# పిల్లరామాయణము

బొమ్మకంటి శ్రీనివాసాచార్యుల సరళపీఠికతో



ఇంటింట సరస్వతీ పీఠం :

సంప్రదాయ సాహితి—12

ఆతుకూరి మొల్ల

# రామాయణము

వాచవి :

విద్వాన్ బొమ్మకంటి

శ్రీనివాసాచార్యులు, ఎం.ఏ.

గౌరవ సంపాదకులు :

బొమ్మకంటి వేంకట సింగరాచార్య

బాలాంత్రపు నళినీకాంతరావు

# మొల్ల రామాయణము






ESS. 12

ఎం. శేషాచలం అండ్ కో
మచిలీపట్నం. మదరాసు. సికింద్రాబాద్




Ess-12

EMESCO SAMPRADAAYA SAAHITI :
(EMESCO CLASSICS)

RAAMAAYANAMU

*by*

AATHUKURI MOLLA

*Publishers :*

M. Seshachalam & Co.,

EMESCO POCKET BOOK

*First Edition : May, 1971*

*Cover Design :*

BAPU

*Printers:*

WELDUN PRESS
MADRAS-21

*Distributors :*

ANDHRA PRADESH BOOK DISTRIBUTORS
RAHTRAPATHI ROAD, SECUNDERABAD.




Soft Cover Rs. Revised Price Rs. 5-25

Library Edition Rs. 4.25

# విషయానుక్రమణిక

(58). సుగ్రీవునకు వానర రాజ్య పట్టాభిషేకము (58). వర్షావేళ శ్రీరామ సీతా వియోగ పరితాపము (59). సుగ్రీవుఁడు సీత నన్వేషింప వానర వీరులను నలు దెసలకుఁ బంపుట (61). ఆశ్వాసాంత పద్య గద్యములు (62)].



సంపాతి కపివీరులకు సీత యునికిని దెలుపుట (64). హనుమంతుని సాగర లంఘనము (66). లంకా నగర సందర్శనము(67). హనుమంతుఁడు లంకలో సీతకై కలయ వెదకుట (68). రావణుఁడు మదనాతురుఁడై సీతను బ్రార్థించుట (71). సీత రావణుని దెగడి శ్రీరాముని బొగడుట (74). రావణుఁడు కుపితుఁడై సీతకు గడవు పెట్టుట (76). జానకి సంతాపము (78). త్రిజటా స్వప్న వృత్తాంతము (79). హనుమంతుఁడు రాముని కుశల వార్తను సీతకు విన్నవించుట (80). శ్రీరామ ముద్రికా ప్రదానము (81). హనుమంతుఁడు శ్రీరాముని శోభన గుణములను వర్ణించుట (82). సీత తన చూడామణి నానవాలుగా హనుమంతునకు నిచ్చుట (83). ఆకస మంటఁ బెంచిన హనుమ రూపము (83). శ్రీరామునకు సీతా సందేశము (84). హనుమంతుని విక్రమ విహారము (86). కపివీరుఁడు రాక్షస వీరులను గసిమసంగుట (87). హనుమంతుఁడు జంబుమాలిని రూపుమాపుట (90). అక్షకుమార పవనకుమార భీకర సమరము (92). అక్షకుమారాదుల సంహారము (93). ఇంద్రజిత్తు హనుమంతునిపై నెత్తివచ్చుట (94). మేఘనాదుని భయంకర సమరము (96). బ్రహ్మాస్త్రమునకుఁ గట్టువడిన హనుమంతుఁడు (98). హనుమంతునితో రావణుని యధిక్షేపము (100). హనుమంతునిచే శ్రీరామ చంద్రుని గుణ కీర్తనము (101). దూతను జంపుట దోసమని

# ప్రకాశిక

.... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... ....

ఎమెస్కో సంప్రదాయ సాహితీపదకొండు ప్రచురణలలో ఇంతవరకు తెలుగు సాహిత్యంలో సువిఖ్యాతమైన కావ్యాలు వెలువరించాము. మన ప్రాచీన సాహిత్యంపట్ల ఆధునిక సాహిత్య రసజ్ఞుల ఆసక్తిని, అభిరుచిని పునరుజ్జీవింపజేయటం అవసరమనీ, 'దేశభాషలలో తెలుగు లెస్స' అన్న అనుపమ ఖ్యాతికి ప్రధాన హేతువులయిన ప్రాచీన కావ్యాల పరిచయం నవసాహిత్యకులకు ఆవశ్యకమనీ, దానివల్ల వారి సాహితీ రసజ్ఞత పరిపుష్టమై, తెలుగు పలుకుబడుల ఒడుపులు, ఒయ్యారాలు వారు చక్కగా గ్రహించి ఆనందించగలరనీ విద్వన్మిత్రులు మాకు చిరకాలంగా చేస్తూ వచ్చిన సూచనలను అనుసరించి ప్రారంభించిన ఈ సంప్రదాయ సాహిత్య ప్రచురణలు మేము ఆదిలో ఆశించిన మేరను మించి సహృదయామోదం పొందుతూండటం విశేషం. వివిధ పత్రికలలో వెలువడిన సమీక్షలు, సాహితీ స్నేహితులెందరో పంపిన అభినందన లేఖలు, అన్నింటికన్న ఈ పుస్తకాలు చురుకుగా పంపకం కావటంలో పాఠకులు, పుస్తక విక్రేతలు చూపుతూన్న ఉత్సాహం - ఈ ప్రచురణల అగత్యాన్ని, ఆదిలో సాహితీ హితైషులైన విద్వాంసులు చేసిన సూచనలోని ఔచితిని నిస్సంశయంగా ధ్రువపరచటం మరొక విశేషం.

సంప్రదాయ సాహితీ ప్రచురణలను అభినందించిన కొందరు మిత్రులు మాకు కొన్ని సూచనలుకూడా చేశారు. ఈ కావ్యాలు టీకా తాత్పర్యాలతో ప్రచురిస్తే చాలినంత భాషాజ్ఞానంలేని పాఠకులకు కూడా ఉపయోగకరంగా ఉంటాయని కొందరు, కనీసం కొన్ని కఠిన పదాలకైనా అర్థాలు (లఘుటీక) ఇవ్వటం మంచిదని మరికొందరు సలహా లిచ్చారు. పీఠికలు ఆయా కాలాల్ని, కవుల్నిగురించి ప్రత్యేక

గృషిచేసిన భిన్నభిన్న విద్వాంసులచేత వ్రాయించటం మంచి దన్నది మరొక సలహా. ఈ ప్రచురణలయందు ఆదరభావంతో చేసిన ఈ సూచనలకు కృతజ్ఞులం.

అయితే, ఈ ప్రచురణల ఆశయం సాధ్యమయినంత తక్కువ వెలకు, సులభంగా చేతబట్టి చదువుకొనటానికి వీలయిన ముచ్చటైన చిన్ని సంపుటాలుగా, ముఖ్యంగా నవసాహిత్యకులకు అనువుగా, విస్తృతంగా వంపకం చేయటం - అని ఆదిలో మేము చేసిన వివరణ దృష్ట్యా ఈ సూచనల ఆచరణీయతను పరిశీలించవలసి ఉంది.

సంప్రదాయ సాహితి ప్రథమ దశకము—(1. మనుచరిత్రము, 2. వసుచరిత్రము, 3. ఆముక్తమాల్యద, 4. పాండురంగ మాహాత్మ్యము, 5. శృంగార నైషధము, 6. పారిజాతాపహరణము. 7. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము, 8. ప్రభావతీ ప్రద్యుమ్నము, 9. విజయ విలాసము, 10. హర విలాసము) - ప్రచురణ పూర్తిచేసి, వాటిపట్ల పాఠకలోకంలో వ్యక్తమయిన ఆసక్తిని పురస్కరించుకొని, ఇలాగే ఈ పరంపరలో ఇతర మహాకవుల ప్రముఖ కావ్యాలు కూడా నెలనెలా ప్రకటించ బూనుకున్నాము. ఈ ప్రణాళిక ప్రకారం పిల్లలమఱ్ఱి పిన వీరభద్రకవి శృంగార శాకుంతలము, ప్రచురించి, ఇప్పుడు మొల్లరామాయణము అందిస్తున్నాము. దీని తరువాత సారంగు తమ్మయ వైజయంతీ విలాసము, ఆ తరువాత పింగళి సూరన కళాపూర్ణోదయము రెండుసంపుటాలుగాను ప్రకటించబోతున్నాము.

ఈ ప్రచురణలకు సదా మీ సహకారం ఆశిస్తూన్న.

భవదీయుడు

యం. యస్. రావు

# వా చ వి

విద్వాన్ బొమ్మకంటి
శ్రీనివాసాచార్యులు, ఎం. ఏ.,

తేనె నాలుక మీద వేసుకుంటే ఒక్కసారిగా నోరంతా తియ్యనై పోతుంది. మన ప్రయత్నం ఏమీ అక్కరలేదు. అలాగే మంచి కావ్యం చదివితే చదివిన వెంటనే అర్థమంతా మనస్సులో గుబాళించాలి. అలా కాకుండా గూఢ శబ్దాలు కూర్చి కావ్యం వ్రాస్తే చెవిటివాడూ, మూగవాడూ మాట్లాడుకుంటున్నట్టు ఉంటుంది. కవికీ, పాఠకుడికీ మధ్య ఎలాంటి భావ వినిమయమూ జరుగదు.

'తేనె సోకఁ నోరు తీయనయగు రీతి,తోఁడ నర్థమెల్ల' తోచేట్టు తేట తెలుగు మాటలతో రామాయణం వ్రాసి, లెక్కకు మిక్కిలిగా ఉన్న తెలుగు రామాయణా లన్నింటిలోకీ దాన్ని బహుళ జనాదర పాత్రంగా తీర్చిన మొదటి తెలుగు కవయిత్రి కుమ్మరి మొల్ల.

## స్త్రీలకు ప్రతికూల పరిస్థితులు

ఒక సరోజనీనాయుడు మహా విదుషీ, జగద్విఖ్యాతి గాంచిన కవయిత్రీ అయినా, మరొక ఇందిరాగాంధీ ప్రపంచంలోనే పెద్ద ప్రజా స్వామిక రాజ్యాలలో ఒకదానికి ప్రధాన మంత్రి కాగలిగినా ఈ ఇరవయ్యో శతాబ్దం ఉత్తరభాగంలో మన కేమీ ఆశ్చర్యంగా అని పించక పోవచ్చును. ఏ ఆఫీసుకు పోయినా టైప్ మిషన్ల చప్పు ళ్ళతో పాటు గాజుల గలగలలు కూడా వినిపిస్తూ, ఏ ప్రజాహిత రంగంలో చూసినా పురుషులతో సమస్కంధంగా స్త్రీలు కూడా ముందుకు వస్తూ ఉన్న ప్రస్తుత కాలంలో అది అత్యంత సహజంగానే తోచవచ్చును. కాని ఇప్పుడు ఏ డెబ్బయ్యో పడిలోనో, ఎనభయ్యో పడిలోనో ఉన్న మన తాతయ్యలనూ, అవ్వలనూ కదిపిచూస్తే ఈ శతాబ్దం ఆరంభంలోనే మన తెలుగు దేశంలో స్త్రీల పరిస్థితి ఎంత నాసిగా ఉండేదో వాళ్ళు మనకు చెబుతారు. 'న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి', 'ఆడదానికి స్వాతంత్ర్యం ఏమిటి?', 'ఆడపెత్తనం తంబళ దొరతనం', 'ఆడవాళ్ళకు చదువు లెందుకు? రామాయణాలు

వ్రాయాలా? రాజ్యా లేలాలా?'—ఇలాంటి మాటలూ, నమ్మకాలూ సంఘాన్ని పరిపాలిస్తూ ఉండేవి ఇటీవలి వరకూ. విద్యావతులూ, అక్షరాస్యలూ అయిన స్త్రీలు వేళ్ళమీద లెక్కించ దగినట్లు ఉండేవాళ్ళు.

ఈ శతాబ్దం ఆరంభంలోనే పరిస్థితి ఇలా ఉంటే సుమారు నాలుగైదు వందల సంవత్సరాల క్రితం, మొల్ల జీవించి ఉన్న కాలంలో ఆమె విద్యావతి కావడానికీ, కవయిత్రి కావడానికీ సంఘంలో ఎలాంటి ప్రతిఘటనను ఆమె ఎదుర్కొవలసి వచ్చి ఉంటుందో మనం తేలికగానే ఊహించుకోవచ్చును.

మొల్ల ఆడది కావడమే కాదు; బ్రాహ్మణేతర కులంలో పుట్టింది. ఆరోజులలో విద్యా విజ్ఞాన రంగాలకు అధికారులు బ్రాహ్మణులే! స్త్రీ స్వాతంత్ర్యం విషయంలోలాగే ఇప్పటి పరిస్థితికి పూర్తిగా విరుద్ధంగా ఆరోజుల్లో బ్రాహ్మణేతరులకు విద్యారంగంలో ఎలాంటి ప్రవేశం ఉండేది కాదు. అందుచేత ఆనాటి విద్వద్ బ్రాహ్మణ వర్గం నుంచి ఎంతటి పరిహాసాన్నీ, ప్రతిఘటననూ మొల్ల ఎదుర్కొవలసి వచ్చి ఉంటుందో అది కూడా మనం సులభంగానే ఊహించుకోవచ్చును. పరిస్థితులు ప్రతికూలంగా ఉన్నా, అధ్యయన సౌకర్యాలు కొరవడినా, పట్టుదలతోనూ, భగవదనుగ్రహం వల్లనూ మహాకవయిత్రి అయి, రామాయణంలాంటి ఉద్గ్రంథం వ్రాసిన మొల్ల మన ఆధునిక యువతులకు అనేక విధాలుగా ఆదర్శప్రాయురాలు.

## మొల్ల పుట్టు పూర్వోత్తరాలు

'మొల్ల ఎవరు?', 'ఏ కులంలో పుట్టింది?', 'తల్లిదండ్రులెవరు?', 'ఏ ఊరు?', 'మొల్ల కాలం ఏది?', 'ఎన్నేళ్ళు జీవించింది?', 'వివాహ మైందా?', 'అయితే భర్త ఎవరు?', 'సంతానం కలిగారా?', 'ఎంతమంది?'—మొల్లరామాయణం చదివి ఆనందించే పాఠకులకు మొల్ల జీవితాన్ని గురించిన ఇలాంటి అనేక ప్రశ్నలకు జవాబులు తెలిస్తే బాగుండును అనిపించడం సహజం. కాని, తమ జీవిత విశేషాలను గురించి తమ రచనలలో వెల్లడిచేసే అలవాటు మన ప్రాచీన కవులకు లేకపోవడం వల్ల ఇంచుమించు ఏ ప్రాచీన ఆంధ్రకవి జీవిత విశే

షాలూ సమగ్రంగానూ, స్పష్టంగానూ మనకు తెలియవు. అందులోనూ రాజాస్థానాల జోలికి పోకుండా రాజసన్మానాల మోజులకు భ్రమసి పోకుండా విడిగా జీవితాలు వెళ్ళదీసుకున్న మొల్ల, వేమన, పోతన మొదలైనవారిని గురించి మనకు తెలుస్తున్న అంశాలు మరీ తక్కువ.

తన రామాయణంలో ఆమె వ్రాసుకున్నదానినిబట్టి మొల్లను గురించి మనకు తెలుస్తున్న సంగతులు ఇవి:

1. గురులింగ జంగమార్చన పరుడూ, శివభక్తిరతుడూ, బాంధవ హితుడూ అయిన ఆతుకూరి కేసన వరపుత్రి మొల్ల.

2. 'విఖ్యాత గోపవరపు శ్రీకంఠమల్లేశు వరము చేత' కవిత్వం చెప్పడం నేర్చుకుంది ఆమె.

ఈ గోపవరం నెల్లూరు పట్టణానికి సమీపంలో ఉన్న ఒక పల్లెట. ఆశ్వాసాంత గద్యలలో 'కేసనసెట్టి తనయ' అని ఉండడం వల్ల వాళ్ళు వైశ్యులా అని కొందరు అనుమానిస్తున్నారు గాని, అనూచానంగా వస్తున్న కథలు ఈమె కుమ్మరి కులానికి చెందిందని చాటి చెబుతున్నాయి.

## కవయిత్రి కాలం

మొల్ల కాలం ఇద మిత్థ మని స్పష్టంగా నిర్ణయించడానికి తగిన ఆధారాలు లేవు. అనుశ్రుతంగా వచ్చే కథలు మొల్లనీ, తెనాలి రామకృష్ణుణ్ణీ సమకాలికుల్ని చేసి వాళ్ళిద్దరి మధ్య జరిగినట్టుగా అనేక సంఘటనలను వివరిస్తున్నాయి.

అలాంటి ఒక సంఘటన: ఒకరోజున మొల్ల ఒక కోడి పెట్టనూ, ఒక కుక్కపిల్లనూ వెంటబెట్టుకుని వీథివెంట పోతూంది. తెనాలిరామలింగడు ఆమెకు ఎదురయాడు. వీలు చిక్కితే ఎంతవారినైనా పరిహసించడానికి వెనుకాడని ఆ వికట కవికిఒక ఆడది—, అందులోనూ సామాన్య కుమ్మరి కులంలో పుట్టిన స్త్రీ-కవిత్వం వ్రాస్తూందంటే ఇక చెప్పే దేముంది? శ్లేషచమత్కారంతో అశ్లీలార్థం

స్ఫురించే తుంటరి ప్రశ్న ఒకటి ఆమెను అడిగాడుట। అందుకు ఆమె ఏమాత్రమూ తడుముకోకుండా వెంటనే ఆతని శ్లేషను అతనికే అప్ప జెబుతూ జవాబు చెప్పిందట: 'నేను నీకు అమ్మనుగద।' అని. ఇక్కడ 'అమ్మను' అనే మాటకు రెండర్థాలు. 'ఈ కోడిపెట్టనూ, కుక్కపిల్లనూ నేను నీకు అమ్మను - విక్రయించను' అని ఒక అర్థం. 'నేను నీకు తల్లిలాంటి దాన్ని గదా। నాతో నీవు ఇలా అశ్లీలంగా మాట్లాడడం తగునా?' అని ఇంకో అర్థం. తెనాలిరామలింగడు మొల్ల సమకాలికుడైనా కాకపోయినా, ఆ తుంటరి ప్రశ్న అడిగినవాడు రామలింగడైనా మరొకడైనా ఇలాంటి కథలవల్ల మొల్లకు గల సద్య స్ఫూర్తీ, ఆమె అనుభవించవలసి వచ్చిన సంఘ నిరసనా సూచితా అవుతున్నాయి.

లోకంలో మొల్ల తెనాలిరామకృష్ణుని కాలం నాటిది అనే ప్రవాదం రూఢంగా ఉన్నా, ఏకామ్రనాథుడు (16 వ శతాబ్దం) సిద్ధేశ్వర చరిత్ర (ప్రతాపచరిత్ర) అని వచనంలో వ్రాసిన ఒక గ్రంథంలో మొల్లను గురించి చిత్రమైన అంశాలు తెలియజేశాడు. తిక్కన సోమయాజుల వరప్రసాదం వల్ల రామాయణం అనే 'వచనకావ్యం' వ్రాసి మొల్ల ప్రతాపరుద్రుడికి అంకితం చెయ్యాలని తీసుకువెళ్ళిందట। ఆ రాజుగారి కొలువులో ఉన్న విద్వాంసులు 'ఇది శూద్ర కవిత్వం' అని దానిని నిరాకరించారు. అప్పుడు రాజుగారు బ్రాహ్మణ కృతం అయిన కావ్యం కావా అని భాస్కరుణ్ణి పిలిపించి ఆయన వ్రాసిన రామాయణం వింటు న్నారు. ఆ సమయంలో మొల్ల అక్కడికి వచ్చి, 'నేను రామాయణం ఇదివరకే వ్రాశాను' అని తన రామాయణంలో నుంచి ఒక 'పద్యం' చదివింది. ఆ పద్యాన్ని రాజుగారు మెచ్చుకుని, తన మెప్పును బహి రంగంగా ప్రకటిస్తే బ్రాహ్మణులకు ఎక్కడ ఆగ్రహం వస్తుందో అని భయపడి ఆమెకు 'పల్లకీ, నగరీ, నిత్యజీవితం' కట్టడిచేసి తన దేవి విశాలాక్షి దగ్గిరికి ఆమెను పంపించాడుట।

ఏకామ్రనాథుని ఈ వ్రాత ఎంతవరకు చారిత్రకమో, ప్రామాణి కమో తెలియదు. ఇది నిజమైతే మొల్ల తిక్కన సోమయాజికీ, ప్రతాప

రుద్రుడికీ, భాస్కర కవికీ కూడా సమకాలికురాలు అవుతుంది. అంతే గాకుండా ఆరంభంలో ఆమె ఒక వచన రామాయణం వ్రాసినట్టూ, అనంతరం తిరిగి పద్యగద్యాత్మకంగా ఈ మొల్లరామాయణం వ్రాసినట్టూ కూడా కనిపిస్తుంది.

'ఆతుకూరి' అని తండ్రి ఇంటిపేరే ఈమెకు ఉండడంవల్ల వివాహం చేసుకోకుండా జీవితాన్ని రామాంకితంచేసి మొల్ల ఆజన్మాంతం కన్యగానే ఉండిపోయిందని కొందరి ఊహ. కాని, శృంగారానుభూతులూ, మాతృత్వ మధురానుభూతీ ఈమెకు అపరిచితాలు కావు అనడానికి ఈ రామాయణ కావ్యంలో వివిధ ఘట్టాలలో ఆధారాలు కనిపిస్తున్నయి. మరి మొల్ల వివాహితో, కాదో నిజం ఆ శ్రీరామచంద్రుడికే తెలియాలి!

## తెలుగులో రామాయణానువాదాలు

తెలుగులో కవిత్రయంవారు మహాభారతం అనువదించిన తర్వాత మళ్ళా భారతానువాదానికి పూనుకున్న కవులు ఎక్కువమంది లేరు. భాగవతం విషయంలోనూ అంతే! రామాయణం మాత్రం ఇందుకు అపవాదం. మొదట భాస్కరుడు రామాయణం వ్రాసిన తరువాత రంగనాథ రామాయణం, మొల్లరామాయణం, కట్టా వరదరాజు రామాయణం, గోపీనాథ రామాయణం, వాసుదాసు రామాయణం, శ్రీమద్రామాయణ కల్పవృక్షం, సరస్వతీ రామాయణం, గోవింద రామాయణం లాంటివి డజన్లకొద్దీ రామాయణాలు తెలుగు భాషలో వెలిసినయి; నేటికీ ఇంకా వెలువడుతున్నయి.

భారత భాగవతాల్లాగ కాకుండా రామాయణం తెలుగులో ఇలా తనను తాను గుణించుకుంటూ పోవడానికి కారణం తెలుగువారికి రామకథ మీద ఉండే ప్రత్యేకమైన అభిమానం కావచ్చును; లేదా భారత భాగవతాల్లాగ ఉపాఖ్యానాలు లేకుండా రామాయణ కథ ఆద్యంతం సాఫీగా, సరళంగా సాగుతూ, ఏ సైజులో కావాలంటే ఆ సైజులో వ్రాయడానికి వీలుగా ఉండడం కావచ్చును; అదీ కాకపోతే ఇంత

వరకూ వచ్చిన రామాయణాలలో 'అంతకంటె ఇక మనం బాగా వ్రాయలేము' అనిపించేటంత ప్రామాణికమైన రచన రాకపోవడం. తత్ఫలితంగా ప్రతి నూతన కవీ వెనుకటి రామాయణాలకంటె విశిష్టంగా తెలుగులోని భారత భాగవతాలతో సమాన ప్రామాణికత సంపాదించగల తెలుగు రామాయణాన్ని తాను వ్రాయగల నని అనుకునే వీలు ఉండడం అందుకు కారణం కావచ్చు. అయితే ఈ కారణాలన్నీ దూరంగా ఉన్న మనలాంటి రామాయణ పాఠకులకు తోచేవి. ఇవికాక మరికొన్ని కారణాలు రామాయణ రచయిత(త్రు)లు స్వయంగా చెప్పుకున్నవి ఉన్నాయి. ఇంచుమించు రామాయణ రచనకు పూనుకున్న ప్రతికవీ (కవయిత్రీ) 'ఇన్ని రామాయణా లుండగా మళ్ళీ నువ్వు తిరిగి రామాయణం వ్రాయడం దేనికి?' అని తనను తాను ప్రశ్నించుకుని ఆ ప్రశ్నకు వేరువేరు విధాలుగా సమాధానం చెప్పుకోడం కనిపిస్తుంది. మొల్ల సహితం ఈ ప్రశ్న వేసుకొని జవాబు చెప్పుకుంది.

## రచయిత్రి వినయశీలం

'ఆది రఘురాముడి' చరిత్రాన్ని ఆదరంగా వింటే 'క్రొత్త' అయి, 'లక్షణ సంపాదం' అయి, 'పుణ్యస్థితి వేదమై' తోస్తుందట. అలా కాకుంటే నేను 'వెట్టినె చెప్పన్?' అంటూంది మొల్ల.

'రాజితకీర్తి' అయిన రఘురాముడి చరితాన్ని వెనుకటి కవీశ్వరులు 'తేజ మెలర్ప' చెప్పారని తెలిసికూడా తిరిగి నేను చెప్పడం ఎందుకూ అంటే 'భూజన కల్పకం' అయి, 'భుక్తికి ముక్తికి మూలమైన రఘురాముని' స్తుతించడం తప్పా? అని మనల్నే ఎదురు ప్రశ్న వేస్తుంది ఆమె.

ఒక వేశ్య ఒక చిలుకను శ్రీరాముడి పేరు పెట్టి పిలిచి 'పెంపు వహించిం'దట। ఎవరికి చేతనైన విధంగా వారు ఆ రాముణ్ణి వినుతి చేస్తే 'హర్షము రాదే?' అని ఆమె వేసిన మరో ప్రశ్న.

'నేరిచి పొగడిన వారిని', 'నేరక కొనియాడు వారి నీ' కూడా శ్రీరాముడు కరుణతో కాపాడదానికి కారణం వారివారి భక్తేగాని, వారి

వారి చదువులూ, పాండిత్య ప్రాగల్భ్యాలు కావు అని కూడా మొల్ల విశ్వాసం.

మొల్లలోని ఈ వినయస్వభావం పలుతావుల్లో మనకు కనిపిస్తుంది. తను విదుషిననిగాని, వెనుకటి కవు లందరికన్నా మిన్నగా రామాయణం వ్రాయబోతున్నానని గాని ఎక్కడా ఆమె చెప్పుకోదు. పై పెచ్చు 'దేశీయ పదాలూ, తెలుగులూ, సాంస్కృతులూ, సంధులూ, ప్రాజ్ఞుల శబ్దవితతీ, శయ్యలూ, రీతులూ, చాటుప్రబంధాలూ, సమాసాలూ, అర్థాలూ, భావార్థాలూ, కావ్యపరిపాకాలూ, రస భావ చమత్కారాలూ, పలుకు సరవీ, బహువర్ణాలూ, విభక్తులూ, ధాతువులూ, అలంకారాలూ, ఛందో విలక్షణాలూ, కావ్యసంపదా, క్రియలూ, నిఘంటువులూ'—ఈ క్రమాల్లో ఏవీ తాను ఎరగనని ముక్తకంఠంతో ఆమె చెప్పుకుంటూంది. 'విఖ్యాత గోపవరపు శ్రీకంఠ మల్లేశు వరముచేత నెఱిఁ గవిత్వంబుఁ జెప్పఁగా నేర్చికొంటి' అంటూంది. మొల్లలోని ఈ వినమ్రభావం, భగవద్వర ప్రసాదమైన ఆమె అసాధారణ కవితాశక్తి—ఇవే మొల్ల రామాయణానికి ఇంత జనాదరణ సంపాదించి పెట్టినా యేమో!

## భగవ దంకితం

పోతనగారు తన భాగవతాన్ని 'ఇమ్మనుజేశ్వ రాధముల' కివ్వకుండా శ్రీరామచంద్రునికి అంకితం చేసినట్టే మొల్లకూడా "సల్లలిత ప్రతాప గుణసాగరుఁడై విలసిల్లి ధాత్రిపై బల్లిదుఁడైన రామనరపాలకునిన్ స్తుతిచేయు జిహ్వకున్ జిల్లర రాజలోకమును జేకొని మెచ్చఁగ నిచ్చపుట్టునే?" అనీ, 'ఈ రాజా లిచ్చే అల్లమూ, బెల్లమూ తింటూ తాత్కాలిక సుఖాలకు అలాంటి జిహ్వ ఆశ పడుతుందా ?' అనీ అంటూ తన రామాయణాన్ని శ్రీరామచంద్రుడికే అంకితం చేసింది.

పోతనగారిలాగే తన నోట కవిత్వం 'పలికించెడి వాడు రామభద్రుఁడే' మొల్లకు కూడా.

"చెప్పుమని రామచంద్రుఁడు
సెప్పించిన పలుకుమీఁదఁ జెప్పెద నే నె
ల్లప్పుడు నిహ పర సాధన
మిప్పఁణ్య చరిత్ర తప్పు లెంచకుఁడు కవుల్ !"

## వివిధకాండల పరిమితులు

ఇతర ఆంధ్ర ప్రబంధాల కథలాగ రామాయణ కథను పరిచయం చేయవలసిన అవసరం లేదు; రామాయణ కథ తెలియని తెలుగు వా డెవ డుంటాడు? అక్షరాస్యులు కావడానికి ముందే ఆడ వాళ్ళ పాటల్లోనో, వీధి భాగవతాల్లోనో సంపూర్ణ రామాయణం, సీతా కల్యాణం, అహల్యా శాపవిమోచనం, పాదుకా పట్టాభిషేకం, లంకా దహనం మొదలైన వాటిని చూసో, వినో ఉంటాడు ప్రతి తెలుగు వాడూ. అందుచేత రామాయణ కావ్యం చేతపట్టి చదువ దల్చుకున్న పాఠకుడు తెలుసుకోవలసింది—రామాయణ కథను గాదు; ఆ కథకు ప్రస్తుత రచయిత (త్రి) చెప్పే వ్యాఖ్య ఏమిటి? అని. ఏ దృష్టితో ఈ రచయిత (త్రి) చేత ఆ కథ చెప్పబడుతూంది అని.

మొల్ల తన రామాయణంలో ఏ ఘట్టాలకూ, ఏ భావాలకూ అధిక ప్రాధాన్యం ఇచ్చిందీ స్థూలంగా తెలుసుకోడానికి ఈ కావ్యంలోని వివిధకాండల సాపేక్ష పరిమితులు మనకు కొంత సహాయం చేస్తాయి. కాండలవారీగా ఈ కావ్యంలో గద్య పద్యాల సంఖ్య ఈ క్రింది విధంగా వుంది.

| | గద్య పద్యాల సంఖ్య |
|---|---|
| పీఠిక (అవతారిక) | 24 |
| బాలకాండము | 100 |
| అయోధ్యా కాండము | 43 |
| ఆరణ్యకాండము | 75 |
| కిష్కింధాకాండము | 27 |
| సుందరకాండము | 249 |
| యుద్ధకాండము | 351 |

| | |
|---|---|
| ఆశ్వా—1 | 121 |
| ఆశ్వా—2 | 93 |
| ఆశ్వా—3 | 137 |
| | 351 - 869 |

ఈ వివరాలను బట్టి ఆరంభంలో కథను సంగ్రహంగా చెప్పి సుందర, యుద్ధకాండలే ప్రత్యేకదృష్టితో విపులంగా వ్రాయడానికి మొల్ల పూనుకున్నదని స్పష్టం అవుతూంది. మొదటి నాలుగు కాండలూ కలిపినా సుందరకాండలో ఉన్నన్ని గద్యపద్యాలు లేవు. మొదటి అయిదు కాండలనూ ఒక్కొక్క కాండను ఒక్కొక్క ఆశ్వాసంగా వ్రాసిన మొల్ల యుద్ధకాండను మాత్రం మూడు ఆశ్వాసాలుగా విభజించి మరింత విపులంగా వర్ణించింది.

వాల్మీకి వ్రాసిన సంస్కృత రామాయణంలో కూడా అన్ని కాండల పరిమితీ ఒకే విధంగా లేని మాట నిజమే। కొన్ని చిన్న కాండలూ, కొన్ని పెద్ద కాండలూ అక్కడా కనిపిస్తాయి. అయితే కాండల పరిమితుల మధ్య ఇంత ఎక్కువ వ్యత్యాసాలు అందులో కనిపించవు. సంస్కృత రామాయణంలోని వివిధకాండల సాపేక్ష పరిమితులు:

| | పుటలు. |
|---|---|
| బాలకాండము | 104 |
| అయోధ్యాకాండము | 194 |
| అరణ్యకాండము | 112 |
| కిష్కింధాకాండము | 116 |
| సుందరకాండము | 134 |
| యుద్ధకాండము | 262 |

సీతారాముల కల్యాణం

అయోధ్యా పుర వర్ణన, సీతా కల్యాణ ఘట్టం, పరశురామ గర్వభంగ ఘట్టం - ఈ మూడు ఘట్టాలే బాలకాండలో మొల్ల కొంచెం

విపులంగా అయిదారు పద్యాలలోనైనా వర్ణించినవి. తక్కిన రామాదుల జననం, రామలక్ష్మణుల చేత విశ్వామిత్రయాగ సంరక్షణ, తాటకవధ, అహల్యా శాపవిమోచనం మొదలైన ఘట్టాలన్నీ ఒకటి రెండు పద్యాలలోనే టూకీగా తేల్చివేయడం జరిగింది. శాంతా ఋశ్య శృంగుల కథను అసలు ఎత్తుకోనేలేదు.

అహల్యాశాప విమోచన ఘట్టంలో 'రాముని శ్రీపద రజము సోఁకి చిత్రం బొదవఁగఁ గనుపట్టె నెదుట నొక యుపల మటన్' అని. తరువాత ఒక అందమైన కందపద్యంలో ఆ రాయిలో క్రమంగా చైతన్యం ఏర్పడుతూ 'బంగారు పూదె కరఁగిన రీతిన్ మెదలుచు లావణ్య స్థితి సుదతిగఁ జూపట్టి' నిలవడం మొల్ల వర్ణిస్తుంది. అంతే! అక్కడితో ఆ ఘట్టం అయిపోతుంది. అహల్యకు శాపం ఏవిధంగా వచ్చిందో ఆ వృత్తాంతాన్ని విశ్వామిత్రుడి చేత శ్రీరాముడికి ఆమె చెప్పించలేదు.

సీతాస్వయంవర ఘట్టం ఆహ్లాదకరంగా సాగింది. ద్రావిడ కర్ణాటాంధ్ర యవన మహారాష్ట్రాది వివిధదేశాల రాజకుమారులు - కొందరు పల్లకీల మీదా, కొందరు అందలాలలోనూ, కొందరు గుఱ్ఱాల మీదా, కొందరు ఏనుగుల మీదా, మరికొందరు స్వర్ణడోలికలలోనూ, విచ్చేశారు, సీతాస్వయంవరానికి. మంచి బాహుబలం గల పదికోట్ల మందిని పంపించి జనక మహారాజు హరుని శరాసనాన్ని 'వేది మధ్యము'నకు చేర్పించాడు. ధూపదీపాలతో, 'విరులు, గంధం, అక్షతల' తో ఆ విల్లును పూజించాడు. 'ఈ శంకరుచాప మెక్కిడిన సత్త్వఘనుండగు వాని కిత్తు నీ పంకజనేత్ర సీత నరపాలకులారా!' అన్నాడు జనక మహారాజు. రాజకుమారులు ఆ విల్లు చూసి 'విల్లా ఇది, కొండా?' అని తల్లడపడి, 'సందులు గొందుల' దూరారు. విశ్వామిత్రుడు రామచంద్రుని ముఖంవైపు చూశాడు. అప్పుడు లక్ష్మణు డిలా అంటాడు: "ఓ భూదేవీ! నువ్వు కదల బోకు! ఓ ఆదిశేషుడా! నీ వీ భూదేవిని గట్టిగా పట్టుకో! ఓ కూర్మమా! భూమినీ, ఆదిశేషునీ కదలకుండా ధరించు! ఓ వరాహమా! భూదేవినీ, ఆది

శేషువునీ, కూర్మాన్నీ కదలకుండా చూడు। ఓ దిగ్గజములారా। భూమినీ, ఫణినీ, కూర్మాన్నీ, వరాహాన్నీ గట్టిగా పొదివి పట్టుకోండి। రామభూవరుడు ఇప్పుడు చాపం ఎక్కుపెట్ట బోతున్నాడు.'' బాల కాండలోని మంచి పద్యాలలో ఇదొకటి,

సీతా, మాండవీ, ఊర్మిళా, శ్రుతకీర్తుల వివాహాలకు జనక మహారాజు చేసిన ఏర్పాట్లూ, దశరథుడు బంధుమిత్ర సమేతంగా వివాహానికి తరలి రావడం, పెండ్లివారికి విడిదిలో జనకుడు జరిపిన మర్యాదలూ, జనకుడు కుమార్తెలకు ఘనంగా భరణం యిచ్చి అంప కాలు చెయ్యడం అన్నీ ఒక పెద్ద వచనంలో తెలుగువారి వివాహ మధురదృశ్యాలను జ్ఞాపకం చేసే విధంగా వర్ణిస్తుంది మొల్ల.

## గుహుడి చతుర భక్తి

సంస్కృత మూలంలోనూ, ఇతర ఆంధ్ర రామాయణాల్లోనూ కూడా యుద్ధకాండ తరువాత పెద్దది అయోధ్యాకాండే। అయితే మొల్ల రామాయణంలో ప్రధాన ఘట్టాలను మాత్రం వివరిస్తూ అయోధ్యా కాండ రచన సూక్ష్మంగా ముగించబడింది. మంథర వృత్తాంతాన్ని మొల్ల పరిహరించింది. శ్రీరాము పట్టాభిషేకానికి చేసిన ఏర్పాట్లూ, కైక ''నా కుమారునిఁ బట్టంబుగట్టి రాముని మునిగా ననుపుడు మఱి వనమునఁ బదునాలుగేండ్లు వర్తింపంగన్'' అని వరాలు కోరడం, సీతా రామ లక్ష్మణులు అరణ్యవాసానికి బయలుదేరడం, దశరథుడు 'పుత్రశోకంబున నాకపురంబునకు' చనడం - అన్నీ సంగ్రహంగా ఒకటి రెండు పద్యాలలో తేల్చివేయబడినయి. గుహుడి ఘట్టాన్ని కూడా రెండు పద్యాల్లోనే సరిపెట్టినా, ఆ రెండింటిలో ఒక పద్యం దానిలోని విచిత్రమైన కల్పనా చమత్కారం వల్ల చిరకాలంగా ఆంధ్రసాహిత్య రసజ్ఞు లందరికీ కంఠస్థమయింది.

ఆ పద్యం యిది :

''సుడిగొని రాముపాదములు సోఁకిన ధూళి వహించి రాయి యే
ర్పడ నొక కాంతయయ్యెనఁట పన్నుగ నీతని పాదరేణు వి

య్యెడ వడి నోడ సోఁక నిది యేమగునో యని సంశయాత్ముఁడె
కడిగె గుహుండు రామ పద కంజ యుగంబు భయంబు పెంపునన్‌"

గుహుడు రామభక్తుడు. దశరథుని చెలికాడు. రాముని బాల్య లీల లన్నీ ఎప్పటి కప్పుడు వింటూ ఆ మహానుభావుణ్ణి ఎప్పుడు చూస్తానా అని ఎదురుతెన్నులు చూస్తూ ఉన్నవాడు. తీరా రాముడు వచ్చాడు. తన ఓడలో ఆయనను గంగ దాటించాలి. అంతకు ముందు శ్రీరాముడి పాదధూళి సోకి ఒక రాయి స్త్రీగా మారిం దనే కథ విని ఉన్నాడు గుహుడు. ఇప్పుడు ఈయన పాదరజం తన ఓడను సోకితే మరి ఇది ఏమై పోతుందో అనే సంశయం వచ్చింది. అందుచేత ముందుగా "రామపద కంజయుగాన్ని" కడిగి గాని తన ఓడలో రాముణ్ణి అడుగుపెట్టనీయలేదుట- ఆ ముగ్ధభక్తుడు. తరతరాలుగా తెలుగు సాహిత్యంలో అనర్ఘ రత్నాలుగా తెలుగు పిల్లలచేత మన పెద్దలు కంఠస్థం చేయిస్తూ వచ్చిన పద్యాల్లో ఇది ఒకటి.

అయోధ్యాకాండలో విపులంగా నిర్వహించిన భాగం సాయం సంధ్య, చీకటి, వెన్నెల, జారిణులు మొదలైనవాని వర్ణన. మొల్ల వర్ణనా సామర్థ్యాన్నిగూర్చి చెప్పుకునే సందర్భంలో ముందుముందు ఈ వర్ణనలోని సొగసులు సూక్ష్మంగా గమనిద్దాం.

## సీతా రాములమీద చెంచెతల జాలి

అరణ్యకాండలో కూడా కథ సంగ్రహంగానే చెప్పుకుంటూ పోయినా చిత్రమైన స్వతంత్ర కల్పనలు కొన్ని కనిపిస్తాయి

విరాధవధ. అత్రిమహాముని ఆశ్రమ సందర్శనం అయిన తరువాత 'మనసులోఁ జేవ యూఁతగా' ఇంకా దక్షిణంగా అడవిని బడి పోతున్నారు సీతా రామ లక్ష్మణులు, పంచవటి దిక్కుగా. మధ్యలో కొందరు చెంచెతలు వాళ్ళను చూసి అనుకుంటారు: "అయ్యో! ఇంతటి పట్టభద్రుడికి మరి 'పాదచారితనం' ఎందుకు వచ్చిందోగదా! నవరూప రేఖలను చక్కనిదైన ఈ సతి ఇలాంటి దుర్దశను ఎలా అనుభవించ

గలదు? రతి రాజ సమానులైన వీళ్ళకు బ్రహ్మ ఇటువంటి వ్రాత ఎందుకు వ్రాయాలి?"

మరో కల్పన: బంగారు లేడి రూపంలో తనను భ్రమింపజేసి దూరంగా తీసికొనిపోయిన మారీచుని మాయ గ్రహించి. 'ఆ మృగము శీఘ్రమునన్ బడనేసిన' తరువాత శ్రీరాముడు 'దాని పై తిత్తిని దీసి వింటికొనఁ' దెస్తున్నా డట. సీతకు కానుకగా ఇవ్వటంకోసం ఆ బంగారు లేడి చర్మాన్ని ఒలిచి తన వింటి కొప్పుకు తగిలించుకొని విల్లు భుజాన పెట్టుకొని ఊగులాడుకుంటూ రాముడు తమ పర్ణశాలకు తిరిగి వచ్చే ఈ చక్కని దృశ్యం మొల్ల స్వతంత్ర కల్పన.

ముక్తి వధూ విలాస కబరి శబరి

'సన్న్యాసి వేష మలరఁగ' రావణుఁడు వచ్చి సీతను 'రథము మీదికి వేవేగమ తిగిచి గగన వీథిని' చనడం. జటాయు వధ, శబరి ఘట్టం అన్నీ సూక్ష్మంగానే ముగించబడినయి. ఒక కందం, రెండు తేటగీతు లతో ముగించిన శబరి ఘట్టంలో శబరికి వాడిన విశేషణాలు ఆమెపట్ల ఈ కవయిత్రికి గల భక్తిని సూచిస్తున్నాయి.

"చనిచని యెదుటను రాముఁడు
గనుఁగొనియె మహాజనోగ్ర కలుషాద్రి మహా
శని రూపం బనఁదగు నా
ఘనముక్తి వధూవిలాస కబరిన్ శబరిన్"

లోకంలోని జనుల పాపాలు అనే కొండలకు పిడుగు వంటి దట శబరి. ముక్తికాంతయొక్క సవిలాసమైన కేశపాశ మట శబరి! అలాంటి శబరి ఆ 'భూమికాంతునకును' మ్రొక్కి సద్భక్తితో పూజిస్తుంది. ఆమెకు తమ కార్య సరణి తెలియజెబుతాడు రాముడు. అప్పు డా కాంత - 'సుగ్రీవుఁ డనేవాఁడు కపికుల శ్రేష్ఠు డత్యంత ఘనుఁడు. అతనితోఁ టొత్తు గావింపుము. అన్ని పనులు చక్కబడ గలవు.' అని రాముడికి సలహా ఇస్తుంది. శబరి ముందుగా తాను రుచి చూచి ఆ పండ్లు రాముడిచేత తినిపించే ఘట్టాన్ని మొల్ల పరిహరించింది.

## జానకి లోకోత్తర సౌందర్యం

అరణ్యకాండలో సీతాదేవి సౌందర్య వర్ణన, శ్రీరామ విరహ తాప వర్ణన మనోహరమైన ఘట్టాలు. శూర్పణఖ రావణునితో సీతాదేవి సౌందర్యాన్ని వర్ణించి చెబుతుంది. సీత శరీరంలోని అలకలు-నాసిక, కరములు - ఆననం, చరణములు - కంఠస్వరం, పయోధరములు - నడుము, అధరము - వాక్కు, బాహువులు - గమనవైఖరి, హాసము - కన్నులు, ఊర్పులు - గాలి అనే ఈ జంటలను చూస్తూ ఉంటే తుమ్మెదల మీదికి సంపెంగలనూ, పద్మాలమీదికి చంద్రుణ్ణీ, చివురులమీదికి కోకిలలనూ, ఏనుగులమీదికి సింహాలనూ, దొండపండుమీదికి రామ చిలుకనూ, తామరతూడులమీదికి హంసలనూ, వెన్నెలనిగ్గుమీదికి చకోరాలనూ, గాలిమీదికి పాములనూ ఉసిగొల్పుతున్నాడా మన్మథుడు అనిపిస్తుందిట. పైకి వాచ్యంగా చెప్పకుండా సీత ముంగురులతో తుమ్మెదలకూ, నాసికతో సంపెంగకూ, కరములతో పద్మాలకూ, వదనంతో చంద్రుడికీ, చరణాలతో చివురుటాకులకూ, కంఠంతో కోకిలకూ, నడకలతో ఏనుగులకూ, నడుముతో సింహానికీ, ఓష్ఠంతో దొండపండుకీ, పలుకులతో చిలుకలకూ, బాహువులతో తామరతూడులకూ, నడకలతో హంసలకూ, హాసంతో వెన్నెలలకూ, కన్నులతో చకోరాలకూ, ఊర్పులతో గాలికీ, నూగారుతో సర్పాలకూ గల స్పర్ధను మొల్ల ఈ పద్యంలో మిక్కిలి గడుసుగా వ్యంగ్యం చేసింది.

## శ్రీరాముని అవిరళ విరహం

సీతలేని పర్ణశాలను చూసి 'చిత్తమంతఁ గలఁగి శ్రీరామ చంద్రుండు' వెఱ్ఱివాడయి పలవరించే ఘట్టాన్ని నాలుగు సీసపద్యాల్లో కరుణరసభరితంగా మొల్ల నిర్వహించింది.

'నీ దృగ్విలాసంబు నేఁటి నభ్యసించెడు
గురుకుచఁ గానవే హరిణవిభుఁడ!' అనీ,
'ఘనసార భూజంబ! కానవే నీవంటి
గంధంబు గలయట్టి కరటియాన,' అనీ,

'పరంతి! నీతోఁగూడి పవళించు కర్కశ
శయ్యలు పూవుల శయ్య లగును' అనీ

వాపోతూ

'ఏమృగంబును గన్న నేణాక్షిఁ గానవేః'

అని ప్రశ్నిస్తూ ఉండే శ్రీరాముడి చిత్తరువు పాఠకుల మనస్సుల్లో హత్తుకు పోతుంది.

కిష్కింధాకాండ మరీ టూకీగా కేవలం 27 గద్యపద్యాలతో పూర్తి అవుతుంది. సుగ్రీవుని పంపున హనుమంతుడు వచ్చి రామ లక్ష్మణులను కలియడం, శ్రీరామ సుగ్రీవుల మైత్రి, వాలి వధ, సీతా న్వేషణకు సుగ్రీవుడు తన 'డెబ్బది రెండు వెల్లువల కపి బలంలోనూ మైందుణ్ణి, సుషేణుణ్ణి, శతబలినీ వరుసగా తూర్పు, పశ్చిమం, ఉత్తర దిక్కులకూ, హనుమంతుణ్ణి దక్షిణదిక్కునకూ ఒక్కొక్కరికి లక్ష లక్ష కపిబలాన్ని తోడిచ్చి పంపించడం - అంతా స్థూలంగా కేవలం కథాకథన దృష్టితో వివరించడం జరిగింది.

సుందరమైన కాండ

రామాయణంలో సుందరకాండకున్న ప్రసిద్ధి ఇతర కాండలకు లేదు. తక్కిన కాండలకన్నా ఇది అందమైంది కావడం వల్లనే బహుశః దీన్ని సుందరకాండ అన్నారేమో! పారాయణ చేసే వాళ్లు ప్రధానంగా సుందరకాండనే పారాయణ చేస్తూ ఉండడం మనం చూస్తాం. హనుమంతుడు సముద్రలంఘనం చేసి, లంకలో సీతను చూసి, లంకాదహనం చేసి, తిరిగి వచ్చి ఆ శుభ వర్తమానం రాముడికి చెప్పడం సుందరకాండలోని ప్రధాన ఇతివృత్తం. పూర్వ కథను సంగ్రహంగా చెప్పి ఈ సుందర, యుద్ధ కాండలే మొల్ల విపులంగా వ్రాయబూనుకోడానికి రామాయణకథలో ఈ కాండలకు ఉన్న ప్రాధా న్యమే కారణం అనవచ్చును.

జాంబవంతుడు మొదలైన పరివారంతో హనుమంతుడు దక్షి ణంగా వెళ్ళి మహేంద్రపర్వతం చేరుకుంటాడు. అక్కడ జటాయు సోదరుడు సంపాతి కనిపించి వాళ్ళకు రావణుడు సీతను లంకకు

తీసుకువెళ్లాడని చెప్పి లంకకు మార్గ నిర్దేశం చేస్తాడు. జాంబవ దాదుల ప్రశంసలకు ఉబ్బి హనుమంతుడు సముద్రలంఘనం చేసి సువేలాద్రి చేరుకుని తనమేటి గాత్రంబు అణుమాత్రంబుగా 'గుదియించి' రాత్రి సమయంలో లంకాపుర ప్రవేశం చేసి సీతకోసం వాడవాడగా గాలిస్తాడు. ఎక్కడా సీత జాడ కనబడక పోతే చివరికి ఒక గోపురం ఎక్కి చూస్తాడు. అశోకవనంలో ఒక శింశుపావృక్షం క్రింద రాక్షసస్త్రీ పరివృత అయి కూర్చుని ఉంటుంది సీత. సూక్ష్మశరీరంతో ఆ వృక్షం మీదికి హనుమంతుడు చేరుతాడు. సంగ్రహంగానే అయినా సరళమైన చక్కని శైలిలో ఈ సంఘటనలన్నీ కళ్ళకు కట్టినట్టు వర్ణించబడతయి.

## సీతా రావణ సంవాదం

'పన్నీట మజ్జనం బాడి దివ్యాంబరాలు గట్టుకొని' రావణుడు అట్టహాసంగా తన పరివారంతో సహా అశోకవనానికి వచ్చాడు. సీతను చూసి 'నా యెడఁ గృపారసము సేయక యివేకమున నీ యెడల నుండు టిది న్యాయమె లతాంగీ!' అన్నాడు. 'అలకేశ్వరుడు (కుబేరుడు) ఉపాయనంగా ఇచ్చిన చీనిచీనాంబరాలు' మొదలైనవి ఎన్నో 'కలవు నా యింట' అని ఆమెను మురిపించాలని చూశాడు. తరువాత ఆత్మ స్తుతికి దిగి 'ఎవ్వాని వీటికి ఏడు వారాసులు పెట్టని కోటలై పెచ్చు పెరుగు' అంటూ 'మద్భుజాశక్తి ప్రతిపోల్ప అద్భుతంబు' అని తేల్చాడు. ఇలా మొత్తం 15 పద్యాలలో 'నోరికి వచ్చిన మచ్చున ప్రేలుచున్న యా నీచుని దుష్టభాషణంబులకు రోసి తృణంబు చేపట్టి జనక భూపాల నందన' ఇలా అంటుంది: "పరదారలను చెరచడమే వ్రతంగా పెట్టుకొన్న నీకు జవాబు చెప్పడం కూడా పాపమే. సంగర రంగంలో రఘురాముడితో యుద్ధం చేయలేక 'విరాధ ఖరాదులపాట్లు' చూసి, దొంగచాటుగా ఇలా నన్ను తీసుకువచ్చావు. ఇంకా తుచ్ఛపు మాటలు మాట్లాడతా వెందుకు? 'రాజమాత్రుండె మేదినీ రక్షకుండు రామభూపాలుఁ డాదినారాయణుండు.' 'నీవనఁగ నెంత? నీలావు చేవ యెంత? చెప్ప నేటికి నీవె చూచెదవుగాక!"

రావణుడు 'ఒడుపుదప్పిన కాలాహి' లాగ ఉగ్రుడై పోతాడు. 'దీనిన్ దెయ్యాలకు బలిపెట్టెద' అంటాడు; అలా కాకపోతే 'బలిమిని బైకొని నా కాంక్షదీర భావజకేళిన్' విహరిస్తాను-అంటాడు. "నాముందటన్ రామున్ గీమునిఁ జెప్ప గిప్ప నగరా రాకేందు బింబాననా!" అంటూ, సీత 'జిహ్వ మొదలంటఁబట్టి తన శితకుఠారధారతో దునుమాడుతా'నని చంద్రహాసం జంకిస్తాడు. అప్పుడు 'కొందరు ప్రియ సుందరులు' అడ్డువచ్చి 'గాటపు జంకెనయె చాలు. కరవాలున కీ యాటది యర్హ యె!' అని అతణ్ణి శాంతింప జేస్తారు."అలా అయితే రెండు నెలలు మీకు గడువు. ఈలోగా ఆమెను ఒప్పించండి! అప్పటికీ 'ఒడబడకున్నన్ గడికండలుగాఁ గోసుక పడతులు భక్షింపుఁ డింతి పలలం బంతన్' అంటూ రోషారుణితనేత్రాలతో అక్కణ్ణుంచి వెళ్ళిపోతాడు రావణుడు.

ఈ సీతా రావణ సంవాదం కాక సుందరకాండలో మొల్లమనోహరంగా నిర్వహించిన మరి మూడు ఘట్టాలు: సీతాహనుమత్సంభాషణ రాక్షసవీరులతో హనుమంతుడి యుద్ధం, హనుమద్రావణ సంవాదం,

## హనుమ త్సందేశం

రావణుడు వెళ్ళిపోయిన తరువాత కావలి కాస్తున్న యామినీచర కామినులలో ఒకతె యైన త్రిజటకు స్వప్నం వచ్చింది—లంక సముద్రంలో కలిసిపోయినట్టూ, 'రావణేశ్వరుని కుంభిరత్న కోటీరముల్ కలనఁ గూలి'నట్టూ, 'రఘూద్వహుం డెలమితో గంధద్విపం, బెక్కి' వచ్చినట్టూ. త్రిజట తన కలను తోటివారికి చెప్పింది. 'ఈ దేవియె రక్షింప మనకు దిక్కగు మీఁదన్' అనే నిశ్చయానికి వచ్చి, "అమ్మా! వెఱవకు మదిలో నిమ్ముగ మటి వేడ్క నుండు" మని సీతకు జెప్పి, 'అంతంత నెడబాసి' నిదురపోయారు. 'తనకు దిక్కు లేమిఁ దలపోసి' సీత దుఃఖిస్తుంది. అప్పుడు హనుమంతుడు ఇలా అంటాడు, మానవ భాషలో—

"ఉన్నాడు లెస్స రాఘవుఁ
డున్నాఁ డిదె కపులఁగూడి యురుగతి రానై

యున్నాఁడు నిన్నుఁ గాని పో
నున్నాఁ డిది నిజము నమ్ము మూర్వీతనయా! "

సీత ఆశ్చర్యపోతూ తల పైకెత్తి చూసింది. సూక్ష్మరూపంలో ఉన్న కపికుమారుడు కనిపించాడు. 'ఒకవేళ ఇది దనుజ మాయ కాదు గదా!' అని మౌనంగా ఊరుకుంది. హనుమంతుడు కొమ్మమీదినుంచి క్రిందికి లంఘించి 'నిండుభక్తి మ్రొక్కి నిలుచుండె కరములు మోడ్చి'. రాముడు ఋశ్యమూకాద్రికి వచ్చి సుగ్రీవుడితో మైత్రి చెయ్యడం మొదలైన సంగతులన్నీ ఆమెకు చెప్పాడు. రాముడు ఆనవాలుగా పంపించిన ఉంగరం ఆమె కిచ్చాడు. అప్పటికీ ఆమె నమ్మదు. "రావణుఁ డెత్తుక వచ్చువేళ నీ హేమవిభూషణావళుల నేర్పడ వైచినన్ మేమవి తీసి దాచితిమి" అని ఇలా ఎన్నో ఆనవాళ్ళు చెప్పాడు. కాని అప్పటికీ ఆమె అతణ్ణి నమ్మక "రాము డేరీతివాడు అతని చందం బెటింగింపుము" అంటుంది. దానికి హనుమంతుడు "నీలమేఘచ్ఛాయఁ బోలు దేహమువాడు, ధవళాబ్జపత్ర నేత్రములవాడు....ఇన్ని గుణముల రూపింప నెసఁగువాడు వరుస సౌమిత్రి బంగారు వన్నెవాఁడు" అని రామలక్ష్మణుల్ని వర్ణిస్తాడు. తెలుగు పిల్లలు కంఠస్థం చేసే పద్యాలలో భక్తిభావభరితమైన ఈ పద్యం కూడా ఒకటి.

సీత హనుమంతుణ్ణి అతని నిజరూపం చూపించమని కోరింది. "చుక్కలు తల పూవులుగా అక్కజముగ మేను పెంచి" హనుమంతుడు నిజరూపం చూపించాడు. అప్పటికి సీత అతణ్ణి విశ్వసించి తన ఆనవాలుగా శ్రీరాముని కిమ్మని తన శిరోరత్నం ఇస్తూ "అహిత లంకాద్వీప గహనసీమఁ దపము సేయు చునున్నాను దన్నుగూర్చి నాకు ప్రత్యక్ష మగు మని నాథునకును విన్నవింపుము" అని భర్తకు తన సందేశం అందజేస్తుంది.

## యుద్ధ వర్ణన కౌశలం

'మొల్ల స్త్రీ కదా! ఈమె యుద్ధవర్ణన లేమి చేయగలదు?" అని అనిపించడం సహజం. కాని భక్తి, కరుణ ఘట్టాలతోపాటు వీర

రౌద్ర రసప్రధానమైన యుద్ధఘట్టాలను కూడా అంత ఆహ్లాదకరంగానూ ఈమె రచించగలగడం మనకు ఆశ్చర్యం కలిగిస్తుంది. హనుమంతుడికీ, రాక్షసయోధులకూ మధ్య జరిగిన యుద్ధాన్ని 60, 70 పద్యాలలో విపులంగా వర్ణించింది మొల్ల.

సీత సందేశాన్ని స్వీకరించిన హనుమంతుడు 'తన రాక రావణున కెఱుంగఁజేయ వలయు' ననుకున్నాడు. అశోక వనమంతా పెరికి పోగులు పెట్టాడు. మేడలు నేల మట్టం చేశాడు. 'వనముఁ గాచెడి రాక్షస వర్గములను వీర వరులను ఎనిమిదివేల' మందిని చంపాడు. రావణుడికీ వార్త వెళ్ళింది. 'క్రోధ రక్తాంత లోచనుం డగుచు నవ్వింశతి లోచనుండు (20 కళ్ళవాడు)' హనుమంతుణ్ణి చంపండని పదివేలమంది రాక్షసులను పంపించాడు. వాళ్ళను 'తోకను జుట్టి మోది' సంహరించాడు హనుమ. చావకుండా మిగిలిన కొందరు తిరిగి వచ్చి రావణుడితో "మొట్టో! యందర మ్రింగెను దానవులందరకును వీడు దారుణాంతకు డగుచున్' అన్నారు. మళ్ళీ రావణుడు పింగళాక్షాది రాక్షసుల ననేకులను పంపించాడు. అందరినీ మర్దించి 'నిర్వక్రపరాక్రమంబున గర్వించి మరలి మకరతోరణంబు నారోహించి' అరుస్తున్నాడు హనుమంతుడు. ఈ సారి రావణుడు మంత్రికుమారులను ఆరుగురిని పంపించాడు. శతజిహ్వుడు, రుధిరాక్షుడు, రక్తరోముడు, క్రూరదంష్ట్రుడు, వ్యాఘ్రముకటకుడు, స్తనితహస్తుడు అనే ఆ ఆరుగురినీ హనుమంతుడు చావగొట్టాడు. వారి పాటు విని రావణుడు జంబుమాలిని పంపించాడు. అంతకు ముందు వచ్చిన వారిగతే ఆ జంబుమాలికీ పట్టింది. ఇక లాభంలేదని రావణుడు ఈసారి తనకు కుమారుడైన అక్ష కుమారుణ్ణి పంపించాడు.

## అక్షకుమార మేఘనాదులతో హనుమ యుద్ధం

హనుమంతుడికీ, అక్ష కుమారుడికీ జరిగిన యుద్ధం విపులంగా కళ్లకు కట్టినట్టు వర్ణితమైంది. చిట్ట చివరికి 'హనుమంతు డెగిరి పట్టుకొని వాని భూమిపైఁగొట్టి' చంపాడు. ఆ వార్త విని రావణుడు

అనుకుంటాడు. "వీడు వానరు డేమిటి? ఈ దానవావళి మ్రింగ పుట్టిన దయ్యమో, అటుగాక వైశ్వానరుండు (అగ్ని) ఇటువంటి రూపున వచ్చి నిల్చెనో!" అని. అక్షకుమారుణ్ణి తలచుకొని పల విస్తున్న తండ్రిని చూసి మేఘ నాదుడు — 'మీ కీ వగ పేటికి, వానిని చంపెద నొండెను, దీనుని గావించి పట్టి తెచ్చెద నొండెన్' అన్నాడు.

మేఘనాదుడి (అంటే ఇంద్రజిత్తు కీ, హనుమంతుడికీ ఘోర యుద్ధం జరుగుతుంది. ఇంద్రజిత్తు వాయవ్యాస్త్రం వేస్తే హనుమంతుడు వాయుపుత్రుడవడంవల్ల "ఆ వాయవ్యాస్త్రము తూలెను." రుద్రాస్త్రం వేస్తే "అత డా రుద్రుని యంశం బగుటను రౌద్రాస్త్రము తేలిపోయె". ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. హనుమంతుడు తనకు చిన్ననాడు బ్రహ్మ దయచేసిన వరాన్ని తలుచుకొని బ్రహ్మ మంత్రం పఠించాడు. అందుచేత ఆ అస్త్రం "చంప కతని గట్టివై చె నవనిమీద."

హనుమ ద్రావణ వివాదం

బద్ధుడైన అంజనేయుల్ని రావణాసురుడి సమ్ముఖానికి తీసుకుపోయారు. అక్కడ హనుమద్రావణ సంవాదం రసవంతంగా సాగుతుంది. "ఎవ్వడ వోరి! నీకు ప్రభు వెవ్వడు? ఖండించెద నీ చేతులు తుండించెద నడుము" అంటూ 'పట్టరాని కోపంబుతో నాటోపంబుగా' పలుకుతున్న 'రావణాసురుని జీరికిం గొనక' హనుమంతుడు అంటాడు: "ఇనతనయుని వరమంత్రిని. రాముని పంపున వచ్చితి. నారాక మీకు తెలియఁగ వనముఁ గలయఁ బెటికితి. నినుఁ జూచి తిరిగిపోయెదు మన మున మఱి కట్టఁబడితి. వారక సీత నిచ్చి రఘువల్లభునిన్ శరణంబు జొచ్చుట లెస్స. ఊరకే పోరఁగఁజూఁటలేని పొరిపుచ్చకమానఁడు నిన్ను రావణా!'

రావణుడు మహాగ్రహంతో హనుమంతుణ్ణి చంపమని భటులను అజ్ఞాపిస్తాడు. కాని, విభీషణుని 'నీతివాక్య సరవి నరయంగ విని, వీని తోక కాల్చి వెడలంగఁ జేయుడు' అంటాడు. అటుతరవాత లంకా

దహనం చేసి లంకకు కావలికాస్తున్న లంకిణిని చంపి సువేలాచల మెక్కి సింహనాదం చేసి అక్కణ్ణుంచి సముద్రం లంఘిస్తాడు. హనుమంతుడు. అలా జలరాశి దాటుతూ ఉంటే 'మిడివింటన్ పసిడియుండ మీటిన రీతిన్' (ఆకాశంలోకి బంగారపు ముద్ద విసిరినటుగా) అందరికీ దర్శనీయంగా కనిపించాడట!

హనుమంతుడు తిరిగివచ్చి జాంబవంతుడు మొదలైనవారిని కలుసుకుని, ఋశ్యమూకానికి తిరిగిపోతూ దారిలో మధువనమంతా పాడుచేయడం, అడ్డంవచ్చిన దధిముఖాదులను పరాభవించడం, చివరికి శ్రీరామచంద్రుడికి 'కంటిన్ జానకి పూర్ణచంద్రవదనన్' అని సీతను గూర్చిన కుశలవార్తను నివేదించడంతో సుందరకాండ పూర్తవుతుంది.

యుద్ధకాండంలో - సేతుబంధనం, రామరావణుల మధ్య ఘోర యుద్ధం, రావణ సంహారం, విభీషణుడు రావణుడికి అగ్నిసంస్కార విధులను ఆచరించడం, రాముడు విభీషణుని లంకా పట్టణానికి పట్టం గట్టించడం, విభీషణుని భార్య సరమ మొదలైనవారు సీతకు 'మేలి మణి భూషణములను చాల తొడిగి' రామునివద్దకు కొనిరాగా రాముడు 'గెలిచితిc బగc జంపితి నెలతా! నీ యిచ్చ జనుము. నే నిన్నొల్లన్' అని ఆమెను నిరాకరించడం, సీత 'సురలు నుతింప మేటి సొదc జొచ్చెద' అంటూ అగ్నిప్రవేశం చేయడం, అంతలో బ్రహ్మ ప్రత్యక్షమై 'వనజనేత్ర సీత వలన దోషము లేదు' అనడం, స్వర్గంనుంచి దిగివచ్చి దశరథుడు ప్రసన్నుడై కుమారద్వయాన్నీ, కోడలినీ ఆలింగనం చేసుకోవడం, తరువాత అంతా పుష్పక విమానారూఢులై అయోధ్యకు తిరిగి వస్తూ భరద్వాజాశ్రమంలో దిగడం, హనుమంతుని వలన ముందుగా వార్త తెలిసి భరతుడు ఎదురు వచ్చి 'రాఘవేశ్వరుని పాదారవిందంబులకు నమస్కారంబు లాచరించి' అయోధ్యానగరానికి కొనిపోవడం, 'వశిష్ఠానుమతంబున శుభముహూర్తంబున భద్రసింహాసనంబున పట్టభద్రుడై' శ్రీరాముడు అశ్వమేధ యాగం చేసి పదకొండువేల సంవత్సరాలపాటు భూలోకాన్ని పరిపాలించడం - ఈ ఘట్టాలన్నీ అడుగడుగునా పాఠకులకు కుతూహలం ఎక్కువచేసే తీరులో, తెలిసిన కథే అయినా తిరిగి తిరిగి చదవాలనీ వినాలనీ అనిపించే రీతిగా చక్కగా నిర్వహించబడినయి.

ఈ కాండలో సేతుబంధన, రామరావణ యుద్ధ ఘట్టాలలో మొల్లచేసిన విశిష్టమైన చమత్కారాలు ముఖ్యంగా గమనించదగినవి.

### వానరులు కట్టిన వారధి

రాముని పంపున ప్లవగస్తోమం - అంటే వానర సమూహం - పెద్ద పెద్ద కొండలు తెచ్చి సముద్రంలో పడవేస్తున్నారు. వాటి 'గుభగుభ ధ్వానాలకు' ఉప్పొంగిపోతూ అట్టహాసం చేస్తున్నారు. అయితే—'తెచ్చివైచిన పర్వతాల నెల్ల తిమింగిలములు మ్రింగి వేస్తున్నయి. ఏదీ పైకి తేలడం లేదు. రాముడు సముద్రుణ్ణి చూసి 'ఏమి టిది?' అంటాడు. "రావణుడి ఆజ్ఞవలన రాలెల్ల చేపలు మింగు చుండెగదయ్య మేదినీశ! నలుఁడు కట్టినఁ గాని నిలువనేరదు కట్ట" అన్నాడు సముద్రుడు. సుగ్రీవుడి ఆజ్ఞతో నలుడు ఒక్క రోజులో పది యోజనాల కట్ట కట్టాడు. మహాబలశాలియైన హనుమంతుడు 'సువేలాద్రి కరిగి యా నగంబు ప్రాంతనున్న హేమకూటంబును, నాగపర్వతంబును, సింహాచలంబును నను మూడు కొండలు వాల పాశంబునం బెకలించి నిమ్మపండ్ల మాడ్కి, పూలబంతుల వంతున నెగురవైచుచు నలున కందించిన. ఆ పర్వతంబులు మూడును తొంబది యోజనంబులు నిడుపు కలిగియుండ నివ్విధంబున శతయోజనంబుల నిడుపును, దశయోజనంబులు వెడల్పునుగా' నలుడు వారధి నిర్మించాడు.

### కుంభకర్ణ వధ

యుద్ధకాండలో కూడా ఇంచుమించు సుందరకాండలో హనుమంతుడికీ, అక్షకుమారాది రాక్షసులకూమధ్య సాగిన విధంగానే యుద్ధం సాగుతుంది. బ్రహ్మాస్త్రం ప్రయోగించి రాముడు కుంభకర్ణుణ్ణీ, వారుణాస్త్రంతో లక్ష్మణుడు అతికాయుణ్ణీ వధించడం, హతశేషులైన రాక్షసులు కాందిశీకులై రావణుని జేరి 'దేవ! దేవాంతకుడు నచ్చె' అని విన్నవించగా రావణాసురుడు ఇంద్రజిత్తును యుద్ధానికి పంపించడం తేలికగా వర్ణించి, ఇంద్రజిత్తు వధాఘట్టాన్ని విపులంగా వర్ణిస్తుంది కవయిత్రి.

ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రం ప్రయోగిస్తాడు. ఆ బ్రహ్మాస్త్రం 'బ్రహ్మమంత్ర జ్ఞానపరులైనవారిని నిర్బంధంబుగా చుట్టి పట్టి కట్టి'

తక్కినవారిని ఉక్కడగించింది—అంటే సంహారించింది. మహానందంతో ఇంద్రజిత్తు రావణుడి దగ్గరకు తిరిగి వెళ్ళాడు. 'తన మనుమల పాటు తెలిసి తనలో దానే కనుగొనఁజాలక పోయెనొ యనఁగను నపరాబ్ధిలోన నర్కుడు' క్రుంకాడు. రామలక్ష్మణులు సూర్యవంశీయులు గదా। అందుచేత సూర్యుడికి వారు మనుమలు. వాళ్ళ కష్టం చూడలేక నిష్క్రమించాదా అన్నట్టుగా సూర్యుడు అస్తమించాడట.

## ఇంద్రజిత్తు వధ

జాంబవంతుడు హనుమంతుణ్ణి సంజీవిన్యాది దివ్యౌషధంబుల గొనివచ్చి రాఘవప్రీతిగా సైన్యంబుల ప్రాణంబుల నిలిపి కీర్తి బడయుమని ప్రార్థిస్తాడు. వాయువేగ మనోవేగాలతో వెళ్ళి ఆ ఔషధాలు గల కొండకు వాలంబు జుట్టి కొండకు కొండనే తీసుకొని వచ్చి సకలసైన్యాల ప్రాణాలను కాపాడి తిరిగి ఆ కొండను యథాస్థానంలో పెట్టివస్తాడు హనుమంతుడు. రావణుడు అది చూసి ఆశ్చర్యపోతూ కుంభ, నికుంభ, గవాక్ష, ప్రజంఘ, శోణితాక్షులను పంపగా వాళ్ళందరూ క్రమంగా వధించబడతారు. తరవాత ఖరుని కొడుకైన మకరాక్షుణ్ణి పంపితే సుగ్రీవుడిచేతిలో అతడు హతు డౌతాడు.

ఇంక రావణుడూ, అతని కుమారుడు ఇంద్రజిత్తూ మాత్రమే మిగులుతారు. విచారగ్రస్తుడై దిగాలుపడి ఉన్న తండ్రిని ఓదార్చి మేఘనాదుడు మళ్ళీ యుద్ధానికి బయలుదేరుతాడు. తన సైన్యాలను చుట్టూ చక్రాకారంగా నిలిపి మధ్యలో రథం దిగి ఎఱ్ఱని వస్త్రాలూ, ఎఱ్ఱని గంధం, ఎఱ్ఱని పువ్వులూ ధరించి ఒక లోహపాత్రలో నల్ల త్రాచు రక్తం నింపి దానితో హోమంచేయగా ఒక కృత్తి ప్రత్యక్షమయి అతనికి వర మిస్తుంది. ఆ కృత్తి వరప్రభావంవల్ల అంతా చీకటైపోతుంది. వానరులు చీకాకై పరుగులు పెడుతున్నారు. హనుమంతుడి సలహామీద రాముడు 'వాయుశరము తొడిగి ప్రేయ' మాయశక్తి తొలగిపోయి మేఘనాదుడు ఉర్విమీద పడ్డాడు. తరువాత లక్ష్మణుడికీ, ఇంద్రజిత్తుకీ ఘోరయుద్ధం జరిగింది. ఇంద్రజిత్తు ప్రయోగించిన వారుణాస్త్రాన్ని ఐంద్రాస్త్రంతోనూ, గంధర్వాస్త్రాన్ని ఖండశరబాణంతోనూ, ఇలా ప్రతి అస్త్రాన్నీ తగిన అస్త్రంతో లక్ష్మణుండు

ఖండించివేస్తాడు. తరువాత దేవేంద్రదత్తమయిన భుజంగాస్త్రాన్ని వింట సంధించి 'వేదంబులు నిత్యంబగునేని, రామచంద్రుండు ధర్మాత్ముండేని ఇంద్రజిత్తుని శిరంబు నీ శరంబు ద్రుంచుగాక!, అని ఆ శరాన్ని ప్రయోగించి ఇంద్రజిత్తును వధిస్తాడు.

## రామ రావణ సంగ్రామం

'ఇంద్రజిత్తు డీల్గెనని చారులవలన విని తన కుమారుని జంపిన వానిని నేడవశ్యంబును చంపుదు' నని నియమంచేసి రావణుడు యుద్ధ రంగానికి బయల్దేరాడు. ఉభయ బలాలూ తలపడి పోరాడుతున్నాయి. రాక్షస వీరులు శస్త్రాస్త్ర వర్షాలు కురిపిస్తే, వానర వీరులు ఆ దానవులమీద పాషాణ పాదపాదులు విసురుతున్నారు. విరూపాక్షుడి రథంమీద సుగ్రీవుడు ఒకకొండ తెచ్చి వేసి దానిని చూర్ణం చేశాడు. తరువాత వక్షము పొడిచి సుగ్రీవుడు అతనిని సంహరించాడు. అంతట 'హుమ్మని ఆతని కూరిమి తమ్ముడు' సుపార్శ్వుడు మార్కొన్నాడు. అంగదుడు 'తెగువతో వాని యురము పిడుగడంచినగతి ముష్టి బొడిచి' చంపాడు. రావణుడు రామచంద్రుడి మీదికి రథం నడిపించాడు. వారిరువురి మధ్య 'మహాద్భుతకరంబుగా సమరం' జరుగుతుంది. రావణుడు శంబరాఖ్య శరము ప్రయోగించగా అది రాము వక్ష మదర నాటింది. లక్ష్మణుడు రాముడి కడ్డం వచ్చి ఏడు బాణాలతో రావణుడి విల్లూ, నారీ ఖండించాడు. విభీషణుడు రావణుడి రథాన్ని కూల్చాడు. విరథుడైన రావణుడు యముడు తన కిచ్చిన శక్తిని బూని తమ్ముని నేయజూచు చున్నంత 'శరణాగత వజ్ర పంజరుండగు రాఘవేశ్వరుని తోబుట్టువగుటం జేసి లక్ష్మణుండు కరుణాకరుండై విభీషణుం దనవెనుక నిడికొని' ఎదిరించాడు. 'నువ్వు నా శత్రువుకి అడ్డం వచ్చావు గనుక నువ్వే ఈ శక్తిచేత హతుడవు కావలసిం దని రావణుడు శక్తిని ప్రయోగించాడు. దేవతలంతా భయపడి 'రాము తమ్మునికి దీర్ఘాయువగుం గావుత' అని దీవించారు. ఆ శక్తి సౌమిత్రి యురంబునాటి అతడు నేల కొరిగాడు.

## లక్ష్మణమూర్ఛ - పునరుజ్జీవనం

రాముడికి కోపం వచ్చింది. దారుణమైన ప్రతిజ్ఞ చేశాడు.

"రాముఁడు రావణుఁ దనుచున్
భూమి పయిర్వు రునికి పొసఁగదు సుండీ
నామాట వినుఁడు లెస్సగ
రాముఁడ నేనొండె భువిని రావణుఁడొండెన్" అని.

'హ స్తంబును ముడుచుటయు జాచుటయు తెలియరాకుండా రావణుని కాళ్ళేతులాడకుండా శరలాఘవంబు నెఱపుచు' రాముడు యుద్ధం చేశాడు. ఆ ధాటికి రావణుడు తట్టుకోలేక 'విఱిగి శరీర భూషణంబు లురుల, కిరీటంబులు డుల్లఁ, దలలు వీడ, మఱలి మఱలి చూచుచు మృగేంద్రుం గను గజేంద్రుని చందంబున' పలాయనం చిత్తగించాడు.

'ర క్తసిక్తాంగుడై పడి ఉన్న తమ్ముని కనుగొని' ఉస్సురనుచు రాముడు విలపిస్తాడు—'హా! భానుకులదీప! హా! సత్యసల్లాప! హా! సుగుణకలాప! హా! సురూప! ఎందుపోయి తయ్యా తండ్రీ?' అంటూ. అప్పుడు సుషేణుడు రాముణ్ణి ఓదార్చి లక్ష్మణుడు చావలేదని ధైర్యం చెప్పి హనుమంతుడితో 'ఈయన ప్రాణము లెత్తగ వాయుజ! అలనాటి మందు తేవలె!' అన్నాడు. వెంటనే హనుమంతుడు ప్రొద్దు పొడవక మునుపే ఆ సంజీవినీ పర్వతాన్ని తీసుకునిరావడాని కని బయలు దేరాడు. దారిలో రావణుడి పంపున కాలనేమి అనేక మాయోపాయా లతో హనుమంతుణ్ణి వంచించాలని చూస్తాడు. కాని, ఆ చిక్కులన్నీ అధిగమించి కాలనేమినీ, మాల్యవంతుణ్ణీ సంహరించి హనుమంతుడు మహౌషధాచలం తీసికొనివస్తూ ఉంటాడు. దాని దివ్యదీప్తులు చూసి రాముడు సూర్యోదయమై పోతూందని కోపించి సూర్యుడిమీద విల్లు ఎక్కుపెడతాడు. జాంబవంతుడు 'భానుడు కాడు చూడు నరపాలక! మందుల కొండ దీప్తులీ మానము దోచెఁ గాని' అని ఆయనను వారిస్తాడు. సుషేణుడు 'అగ్గిరీంద్రము పైనున్న ఔషధంబులు గొనివచ్చి ప్రయోగింప నా ఔషధంబుల సామర్థ్యంబునం జేసి' లక్ష్మణుడు తిరిగి బ్రతుకుతాడు.

## పాతాళగుహలో రావణుని హోమం

మర్నాడు ఉదయం రావణాసురుడు తన ఆచార్యుడైన శుక్రుడి ఆదేశంతో పాతాళగుహలో హోమం చేస్తూ ఉంటాడు. ఆ హోమం కనుక పూర్తి అయితే ఇక బ్రహ్మాదులు కూడా అతనిని గెలువలేరు - అంటాడు విభీషణుడు. అప్పుడు గవయ, గవాక్ష, వాయుసుతాది వానర వీరులంతా వెళ్ళి మండోదరిని రావణుడి సమక్షంలో సిగపట్టి ఈడ్చి, క్రోధంతో రావణుడు హోమాన్ని మధ్యలో వదలి యుద్ధరంగానికి వచ్చేట్టు చేస్తారు.

## రావణ సంహారం

ఆఖరిరోజు యుద్ధం మరీ భయంకరంగా సాగుతుంది. రాక్షస పక్షంలో ఖడ్గరోముడు, సర్పరోముడు, వృశ్చికరోముడు మొదలైన యోధు లెందరో హతులౌతారు. రామరావణుల మధ్య యుద్ధం తీవ్రంగా సాగుతుంది. 'రథ మెక్కి రావణుండును, పృథివీస్థలి నుండి రామ పృథివీపతియున్' యుద్ధం చేయడం న్యాయం కాదని దేవేంద్రుడు మాతలిచేత కవచం, రథం, విల్లూ, అమ్ములపొదీ పంపుతాడు. 'గిరి గిరి నభము నభంబును ధర ధరయును జలధి జలధి దార్కొను రీతిన్'- రామరావణుల మధ్య యుద్ధం సాగుతుంది. రాముడు ఎన్నిసార్లు రావణుని శిరస్సులూ, చేతులూ ఖండించినా అవి తిరిగి తిరిగి మొలుస్తూ ఉండడం చూసి ఆయన విసిగిపోతాడు. అప్పుడు విభీషణుడు 'అతని నాభీమూలంబున నున్న యమృతమును మొదలన్ నిర్మూలముగా శ్రీరఘుభూపాలక! తెగవేయు మగ్నిబాణముచేతన్' అని రావణుని జీవిత మర్మం చెబుతాడు. అలా అమృతభాండాన్ని భేదించగానే రావణుని పది తలలూ, ఇరవై చేతులూ పోయి ఒక్క తలా, రెండు చేతులూ మిగిలినయి. చివరికి శ్రీరాముడు ''ఉజ్జ్వల చాపదండంబున బ్రహ్మాస్త్రంబు సంధించి' వదలగా 'రావణుఁ డతి వివశుడగుచు' నేల గూలుతాడు.' దేవతతి పొగడి యప్పుడు పూవుల వర్షంబు' కురిసింది.

## ప్రౌఢరచన

మొల్ల రామాయణంలో కందువమాటలు, సామెతలు అందంగా కూర్చి పీనుల విందు అయేట్టే అధికభాగంలో రచన సాగినా అక్క-

దక్కడ దీర్ఘ సమాసరచన కూడా సరళంగాను ప్రసన్నంగాను ఈ కవయిత్రి చేయగలదు అనడానికి నిదర్శనాలు గమనించవచ్చును.

సుందరకాండలో సీతను అన్వేషిస్తూ బయలుదేరిన కపి వరులు—

"ఆకాశనదీ ప్రచుంబి తార్చట భంగా
నీక మహాఘన రవ భయ
దాకార నటత్ప్రకాశు" డైన జలధీశుణ్ణి కనుగొంటారు.

బంధించి తెచ్చిన హనుమంతుణ్ణి చూడగనే రావణుడు
"కుటిలభ్రూకుటి నటన
స్ఫుట ధూమ విలాస పవన పూత్కృతి జనితో
త్కట నేత్రుఁ" డవుతాడు.

యుద్ధకాండలో కాలనేమి హనుమంతుణ్ణి వంచించడానికి కల్పించిన కొలను—

"విమల మకరంద లుబ్ధ
భ్రమర నికర పక్ష పవన పరికంపిత స
త్కమనీయ కుముద కైరవ
కమలంబులు గలుగు కొలను".

మకరందంమీది లోభంతో వచ్చి వాలిన తుమ్మెదల రెక్కల గాలికి ఆ కొలనులోని తామర పూలూ, కలువ పూలూ కంపిస్తున్నాయట.

మొల్ల వర్ణన కౌశలం

మొల్ల రామాయణ రచన ప్రధానంగా తేట తెలుగు మాటలలో తేనె నాలుకమీద వేసుకుంటే కలిగేటంత మధురాస్వాదాన్ని కలిగిస్తూ రామభక్తి ప్రతిపాదన పరంగానే సాగినా, కొన్ని వర్ణన ఘట్టాలలో ఇతర కవులతో పోల్చ దగిన ప్రౌఢ రచన కనిపిస్తుంది. బాలకాండ ఆరంభంలో కనిపించే అయోధ్యా పుర వర్ణన శ్రద్ధగా చదువ దగింది. సూర్య వంశపు రాజుల నవరత్న ఖచిత సింహాసనంగా ప్రసిద్ధి కెక్కిందట—'ధర్మ నిలయమ్ము మహి నయోధ్యా పురమ్ము'. ఆ పట్టణ ప్రాకారాలమీద నిలబడి రోజూ 'పురము కొమ్మలు' (పుర స్త్రీలు) 'తమ్ముల చుట్టము పద జలజమ్ములు, (సూర్యుని పాదాలను) పూజిస్తారట. అంటే—అంత ఎత్తు ఆ ప్రాకారాలు

మరో అందమైన వర్ణన అయోధ్యాకాండ ఆరంభంలో ఉంది. రామ పట్టాభిషేక నిర్ణయం జరిగింది. ప్రొద్దు కుంకింది. పగలంతా శ్రమపడిన సూర్యుడు 'చెమట పట్టిన స్నానంబు జేయ నరుగు కరణి' అపరాబ్ధిలో క్రుంకుతాడు. కల్పవృక్షం తొడిగిన కోరకములా (మొగ్గలా) అనేట్టు తారకములు తలచూపినయి. కారుమబ్బు లాగ, కాటుకలాగ, నీరులాగ, ఇంద్ర నీలాలలాగ, మినుములరాశిలాగ 'అంధకార మవనియెల్ల గలయ' పర్వింది. మన్మథుడి నేర్పువల్ల తల వరులనూ, భర్తలనూ కన్ను బ్రామి, అత్తల్ని నిద్రపుచ్చి 'నిర్మల కరకంకణ జాలకలు మట్టెలు రట్టుగ మ్రోగనీక' మధ్య రాత్రులలో జార లతాంగులు విచ్చల విడిగా చరిస్తున్నారు. 'సురతములేక ఉస్సు రను జోటి' (స్త్రీ), మగడిచేత బాధలు పడేస్త్రీ, సరసం తెలిసిన చంద్ర ముఖి, సాందిదంట, బేరకత్తె, 'పర పురుషాభి లాషమును బాయని భామిని'—వీరంతా ఉప పతులను గూడి చరించ సాగారు. సూర్యుడి ఎండ వేడిమికి అమృత సముద్రం ఉడుకులెత్తి పైన మీగడ కట్టగా గాలికి ఎగిరి దానిమీది నురుగు తూర్పు దిక్కున కనిపిస్తూందా అనేటు 'శశి బింబము తూరుపుఁ గొండపై' ఒప్పింది. పండు వెన్నెలలో మునులంతా నారదు లయారు. చెట్లన్నీ కల్ప వృక్షా లయాయి. భామినులు శారద లయారు. కొండలు రజ తాచలాలు అయినయి. సముద్రాలు పాదరసం అయినయి. ఈ విధంగా 14 పద్యాలలో రమణీయంగా ప్రకృతిని వర్ణిస్తుంది ఈ ఘట్టంలో మొల్ల.

## చివరి మాట

ఎమెస్కో సంప్రదాయ సాహితీ పరంపరలో ఇంతకుముందు వచ్చిన పదకొండు ప్రబంధాల్లో దేనినిగురించీ చెప్పడానికి వీలులేని ఒకమాట ఈ మొల్లరామాయణాన్ని గురించి చెప్పవచ్చు. నేటి నవ సాహిత్యకులకు సుపరిచితమైన శిష్ట వ్యావహారికానికి మిక్కిలి సన్ని హితమైన భాష ఈ కావ్యంలో కవయిత్రి వాడిన భాష. సగం ముప్పా తికవంతు పరుల సహాయాన్ని అపేక్షించకుండా నవ్యసాహిత్యకులు స్వయంగా చదివి అర్థంచేసుకొని ఆనందించదగిన సరళమైన, మధుర మైన కావ్యం ఇది.

ఇంక - చదవండి!

# పరిష్కరణము - పాఠ నిర్ణయము

.... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... ....

భారతీయ సాహిత్య జగ న్మేరువు శ్రీ మద్రామాయణము. ఆదికవి వాల్మీకి యిహ పర సాధకముగ నా కావ్యమును విరచించెను. హైందవులకు శ్రీరాముఁ డారాధ్య దైవము. శ్రీరామ నామము భక్త జగ త్తారకము.

శ్రీరామ చరి తామృతమును గ్రోలి ధన్యులైన భాస కాళిదాస భవభూ త్యాదు లా యితివృత్తమును గైకొని దృశ్య శ్రవ్య కావ్యములను రచించి స్వయం తీర్ణులై, చిరకాలముగఁ ద త్పఠితలఁ దనియించుచున్నారు.

ఆంధ్రమున భాస్కరాది కవులు రామాయణములు రచించిరి. ప్రథమాంధ్ర కవయిత్రి కుమ్మరి మొల్లయుఁ బరమ భక్తి భావముతో. 'కందువ మాటలతో, నందములగు సామెతలతో. తీయన యగు రీతితో' సంగ్రహముగ నీ రామాయణమును రచించెను

ఈమె తన నివాస స్థలమగు గోపవరమున వెలసియుండు శ్రీ కంఠమల్లేశుని వర ప్రసాదముచేఁ గవిత నేర్చినది; బమ్మెర పోతరాజు వలె సహజపాండిత్య సంశోభిత. ఈమె కవితలో స్వచ్ఛందములైన ప్రయోగములు, పలుకుబడులు, సంధులు, సమాసములు పెక్కులు కన్పట్టుచున్నవి. అవి చాలవఱకుఁ బూర్వ ముద్రిత ప్రతులలో నలాక్షణికములని కాఁబోలును సంస్కరింపఁబడినవి.

ఈ కావ్యమును బరిష్కరించుటలో మా కుపయుక్తములైన ప్రతులు:

1 వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారి ప్రతి. మదరాసు. (1917).

2 ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రతి. హైదరాబాదు. (1967).

3 మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయమందలి సి. పి. బ్రౌను దొర వ్రాఁత ప్రతి. (డి. నం. 651).

పై వ్రాఁత ప్రతిలో సరసములు, సముచితము లైన యపూర్వ పాఠము లనేకములు గన్పట్టినవి. వానిలోఁ కొన్ని ప్రధాన పాఠములుగను, మరి కొన్ని పాఠాంతరములుగను నీ ముద్రణమున స్వీకరించితిమి. వానిలోఁ గొన్ని:

బాల. 9. ప్రకటానురాగ సంపన్ను లౌదురు గాని
రమణీయ రుక్మ కారకులు గారు

ఇది ముద్రిత ప్రతి పాఠము. ఇందు 'అనురాగ' శబ్దమున శ్లేష. అనురాగ సంపద ద్విజులకును, గంసాలులకును సమాన ధర్మముగా వివక్షితము. రాగ శబ్దమునకుఁ గల 'ఎఱుపు, ప్రేమ' అను నర్థములు ఇందు ద్విజ రుక్మకారులకుఁ జక్కఁగా సమన్వయింప కున్నవి.

"ప్రకటాగ్ని హోత్ర సంపన్ను లౌదురు గాని" యని వ్రాఁత ప్రతి పాఠము.

బ్రాహ్మణులు నిర తాగ్ని హోత్రులు. అనఁగా వైశ్వదేవాది నిత్య హోమ నిరతులు. అట్లే కంసాలులు గూడ నిర తాగ్ని హోత్రులు. నిత్యము కొలిమితోఁ బని గలవారు. ఈ పాఠము నిందు స్వీకరించితిమి.

బాల. 86. రామా ! రా రమ్మటంచు రహిఁ బిలిచెఁ దగన్.

ఇందు 'రహిన్, తగన్' అను పదములు వ్యర్థములు, పద్య పూరణార్థకములు. "రామా ! రమ్మనుచుఁ బరఁగ రాముఁడు పిలిచెన్" అను వ్రాఁత ప్రతి పాఠము సరళము,

అయోధ్య. 11. ని, ర్మల కర కంక ణావళులు
రట్టుగఁ దా మటు మ్రోఁగనీక

అర్ధరాత్రమున నభిసారికలు తమ యింటి వారిని, బైటివారిని గనుగప్పి కర కంకణములు సద్దు గానీయక స్వైర విహారము గావించుచుండిరి.

"కర కంకణావళులు, మట్టెలు రట్టుగ మ్రోఁగనీక" యని వ్రాఁత ప్రతి పాఠము.

చేతులయందుఁ గంకణ రవము, కాళ్ల యందలి మట్టెల చప్పుడు కాకుండునట్లు సంచరించి రనుట రమ్యతరము.

అయోధ్య. 23. వదలక పద్మరాగ మణి వ్రటువ
గ్రాలఁగఁ బట్టి నేర్పు పెం. పొదవఁగ

ఇందు సూర్యోదయము వర్ణితము. జగత్తను గురువు నేర్పుతో గుంద్రని పద్మరాగ మణి యను నద్దమును దెచ్చి ప్రాచీ దిక్పతి యగు నింద్రు నెదుట నుంచెనా యనురీతిఁ దూర్పున సూర్య బింబము చెందొవ కాంతితోఁ గన్పట్టెను. 'వ్రటువ గ్రాలఁగఁ బట్టి" ననుటలో నర్థ మస్పష్టము.

వ్రాఁత ప్రతిలో "వజ్రపుఁ దర్మెనఁ బట్టి నేర్పు పెంపొదవఁగ" అను పాఠము గలదు.

రత్నము సానపట్టినఁ బ్రకాశించును. ఈ పద్మరాగ మణి వజ్రపుఁ దరిమెనపైఁ జక్కఁగ సానపెట్టఁ బడినది. పద్మరాగము దీప్తి హెచ్చినది.

అరణ్య. 34. తామర సాప్త సోమ గ్రహ తారక
లెల్లను నేల డుల్లవే

ఇందు 'సోమ గ్రహ' లో 'గ్ర' సంయుక్తాక్షరము. కావున దీని పూర్వాక్షరము 'మ' గురువు కావలయును. అయినచో ఛందో భంగము. కావున 'గ్ర' అను నక్షరమును దేలఁ బలుక వలయును. కవు లిట్టి ప్రయోగములు క్వాచిత్కములుగఁ గావించి యున్నారు.

'తామరసాప్త బింబము సుధాకర బింబము' అను వ్రాఁత ప్రతి పాఠము నిర్బాధకము,

అరణ్య. 48. పడఁతుక డించి రాఁదగునె
వన్య మృగోత్కర మధ్య సీమకున్

సుందర. 225. వడిగా ధర శృంగంబున

వ్రాఁత ప్రతిలోఁ దొలి పాఠము "పుడమిజ డించి రాఁదగునె భూరి మృగోత్కర" యనియు, రెండవ పాఠము "పుడమీధర శృంగంబున" ననియు గన్పట్టుచున్నవి.

పుడమి శబ్దము తెనుఁగు. తరువాతి పదము సంస్కృతము. ఈ రెంటికిని సమాసము నిషిద్ధము. కాని, కవులు నిరంకుశులు. నన్నెచోడాది శివకవులు స్వతంత్రించి యిట్టి ప్రయోగములు గావించియున్నారు.

కిష్కింధ. 14. వాలిఁ బ్రతాపశాలి మృదు వందనశీలి
సురాలి మెచ్చఁగన్

ఇందు 'మృదు వందన శీలి' యను పదము వాలికి విశేషణము. దీనిలో 'మృదు' శబ్ద మనన్వితము. 'మృడ వందన శీలి' యను వ్రాఁత ప్రతి పాఠ మర్థవంతమైనది. ఇందే 16 వ పద్యము లోని "శూలి పద భక్తి శీలిని వాలిన్" అను ప్రయోగ మీ పాఠమును ధ్రువపఱచుచున్నది.

కిష్కింధ. 23. భామః దావానల పరితాప ముడుప నీ
తనువు నా తనువునఁ బెనచ వేల

రావణుఁడు సీతను గొంపోవ, రాముఁడు సీతకై పలవించు ఘట్టములోని పద్య మిది. ఇందు దావాగ్ని సంతాప ముడుప శ్రీరాముఁడు సీతా తను సంశ్లేషము నర్థించుచున్నాఁడు. శ్రీరామున కా సమయమున సీతా వియోగ పరితాపమే కాని దావాగ్ని తాప మెక్కడిది?

"భామః తాపానల పరితాప ముడుప" అని వ్రాఁత ప్రతి పాఠము.

తాప మనఁగా సీతా వియోగ తాప మని యర్థము.

సుందర. 200. బెండించెద నీ కండలు
వండించెదఁ జమురులోన వాసవుఁ డలుకన్

అశోక వనమును, దనుజ వీరులను మట్టుపెట్టిన హనుమంతునితో రావణుఁ డాడిన పరుష వాక్య మిది. హనుమంతుని మేని కండలు కోసి వండించినచో నింద్రుఁ డలిగి యేమి చేయునో తెలియదు. ఇంద్రుని కేమి సంబంధము?

"చెండించెదఁ గత్తులతో, వండించెద నూనెలోన వారక నిన్నున్" అను వ్రాఁత ప్రతి పాఠ ముచితమైనది.

సుందర. 202. హనుమంతుం డండ్రు నన్ను నార్యులు దిశలన్.

'ఎవ్వఁడ వోరి?' యని ప్రశ్నించిన రావణునికి హనుమంతుని సమాధాన వాక్యములలోనిది దీ పద్యము. ఇందు 'ఆర్యులు, దిశలన్' అనునవి వ్యర్థ పదములు.

"వినుమీః హనుమంతుఁ డనఁగ వెలసినవాఁడన్" అను వ్రాఁత ప్రతి పాఠము స్వ నామముఁ బేర్కొనునప్పటి వినయమును, సహజతను జాటుచున్నది.

సుందర. 203. రాముని సేమంబు నిందు రంజిల్లెడి యా

రాముని సతి కెఱిఁగించితి

అశోకవనమునందుండు సీతకు శ్రీరాముని కుశల వార్త నెఱిఁగించితి నని హనుమంతుఁడు రావణునితోఁ జెప్పుచున్నాఁడు. సీతకు 'రంజిల్లెడి' అను విశేషణ మీ సందర్భమున ననుచితము. అప్పుడు సీత 'ప్రాణంబు దక్క సర్వమును ద్యజించి' వందురుచున్నది.

"రాముని సేమంబు నీ పురంబున నున్నా, రాముని సతి కెఱిఁగించితి" అను వ్రాఁత ప్రతి పాఠ మిక్కడ సముచితమైనది. ఇచ్చట 'ఉన్నా రాముని' యనుదానిలోని 'దుస్సంధిని' సవరింపఁగాఁ గాఁబోలుఁ బై పాఠ మేర్పడియుండును.

సుందర. 214. కాకుండిన మీ చిత్తము

కా కెల్లను దీట ముజ్జగంబులు బెదరన్

ధాక నదలించి, తోఁకను

పేఁకను ముట్టించి పోవ విడుచుట చాలున్

'దూతలను జంపరాదు. తమకుఁ గోపము దీరుటకు హనుమంతుని తోఁకకు భీషణ మగు నిప్పు ముట్టించి విడిచి పెట్టుఁడు' అని

రావణునికి విభీషణుడు హితోపదేశము చేసె నఁట. ఇది వాల్మీకి విరుద్ధము. వ్రాఁత ప్రతిపాఠ మిట్లున్నది:

కాకుండిన మీ చిత్తము
లో కోపము దీరునట్లు లోకము బెదరన్
ఢాక నడల్చుట చాలును
వీఁకన్ దండించి పోవ విడుచుట చాలున్.

ఇందు దూతను దండించి పోవ విడుచుట న్యాయ మన్నది మాత్రమే విభీషణోక్తి. "యుక్తాఽయుక్తం వినిశ్చిత్య దూతే దండో విధీయతామ్" అని వాల్మీకి రామాయణము.

"కపీనాం కిల లాంగూల మిష్టం భవతి భూషణమ్।
త దస్య దీప్యతాం శీఘ్రం తేన దగ్ధేన గచ్ఛతు॥"
(సుందర. 53-3)

కావునఁ దోఁకను గాల్చి పంపుఁడన్నది రావణోక్తియై యుండఁ దగినది. వ్రాఁతప్రతి పాఠ మట్లే యున్నది. (ప. 216).

పై వ్రాఁత ప్రతి పాఠమున మరొక విశేషమున్నది. రెండవ పాదమందలి 'లో కోపము' అను పదములలో 'లోన్' ద్రుతప్రకృతికము కనుక 'లోఁగోపము' కావలయును. ప్రాస చెడును. కావున నిప్పట్టున ద్రుతకార్యము పొసఁగదు. మొల్ల స్వతంత్ర ప్రయోగములలో నిదియు నొకటి.

కొన్ని లాక్షణికాంశములు:

ఇందు మొదటిది పూర్వ ముద్రితప్రతి పాఠము. రెండవది వ్రాఁతప్రతినుండి ప్రకృతముద్రణమున నుద్ధృతమైన పాఠము.

సుందర. 35.

(1) కా, రింతు నుదు ప్రజంబులఁ బొ-రిం గణియింతును
(2) కా, రింతు నుదు ప్రజంబులను-లెక్కలు పెట్టుదు

రెండవదానిలో 'ర-ల' యతి. ప్రౌఢ కవు లీ యతిని గొన్ని చోట్లఁ గూర్చిరి. మొదటి పాఠమున రేఫమునకు రేఫముతోడనే యతిని గూర్చవలె నను దీక్షతో 'పొరిన్' అను వ్యర్థపదమును దెచ్చిపెట్టిరి.

సుందర. 95. (1) తా. విచ్చను మెచ్చి యా కువల-యేక్షణ
(2) తా. విచ్చను మెచ్చి రామ తరు-ణీమణి

రెండవదానిలో 'అఖండయతి.' దీనిని వారించుటకై మొదటి పాఠము వచ్చియుండును. తిక్కనాది కవు లఖండయతి నాదరించిరి.

సుందర. 140. (1) అగల నార్చుచు భుజ యుగం-బప్పళించి
(2) పగుల నార్చుచు భుజ యుగం-బప్పళించి

రెండవదానిలో, 'అఖండ యతి'.

సుందర. 163. (1) ఓపరే, లోకమం దిటు క్రోఁతు లెక్కడ -
లోఁచు దానవ వీరులన్
(2) ఓపరు, న్లోకమం దిటు క్రోఁతు లెక్కడ -
నొంచె దానవ వీరులన్

రెండవదానిలో 'ఓపరున్' సముచ్చయాంత ద్రుప్రకృతికము. ఇందలి ద్రుతము తరువాతి పదాదియందలి 'లో' తోఁ జేరి సంయుక్త యతి యైనది. మొదటిదానిలో నీ యతి గుర్తింపఁబడక యతిస్థానమున 'లోఁచు' అను వ్యర్థపదము స్థాపింపఁబడినది.

ఇకార సంధి:

అరణ్య. 35. అంత ప నయ్యేనేని (పని + అయ్యేనేని)
యుద్ధ. 2-66. కాలనే మింటికి (కాలనేమి + ఇంటికి)

క్త్వార్థకేకారసంధి:

సుందర. 81. ఎలుఁగె త్తేద్చెన్ (ఎలుఁగు + ఎత్తి + ఏద్చెన్)
.. 246. పొరలాడు (పొరలి + ఆడు)
యుద్ధ. 1-36. విల్లందియ్య (విల్లు + అంది + ఇయ్య)
.. 1-45. అందిచ్చిన (అంది + ఇచ్చినన్)

ద్రుత ద్విత్వ సంధి:

కిష్కింధ. 16. వాలి న్నొక (వాలిన్ + ఒక)
సుందర. 85. గంధేభము న్నెక్కి (గంధ + ఇభమున్ + ఎక్కి)
.. 97. తెలుంగు న్ననవుడు (తెలుంగున్ + అనవుడు)

సుందర. 165. మీకు న్నీ విధము (మీకున్ + ఈ విధము)
యుద్ధ. 1-8 తేరిపయి న్నొక్క (తేరిపయిన్ + ఒక్క)

అకార సంధి:
సుదంర. 203. ఉ న్నారాముని (ఉన్న + ఆ రాముని)
యుద్ధ. 1-8. మ నందఱ (మన + అందఱ)
నగాగమ రాహిత్యము:
సుందర. 233. తరువ పై నుండి తరువుకు (తరువునకు)
వుగాగమ రాహిత్యము:
అరణ్య. 46. శింశుపా తరు క్రింద (తరువు క్రింద)
,, 66. నా తగు పేరు జటాయువు. (ఇందు 'తగు' అర్థరహితము. 'నా దగు' అనవలయును. ప్రాసచెడును.)

కొన్ని విలక్షణ ప్రయోగములు:
సుందర. 79. ఎడ యిస్తి రెండు మాసములు.
యుద్ధ. 1-16. వానర్ల గూడుక వచ్చినాఁడు
,, 1-20. నీవు వానర్ల గూడుక
,, 1-21. ఇ దేమి పనిరా
,, 1-74. ఎదుటొమ్ము (ఎదురు + ఱొమ్ము)
,, 2-16. తెప్పర్లి (తెప్పరిల్లి).

ఈ పరిష్కరణమునందు స్వీకరింపఁబడిన పాఠములు, పాఠాంతరములు సహృదయామోదకము లగు నని యాశయము.

సంపాదకులు

శ్రీ

# రా మా య ణ ము

## అవతారిక

[ఇష్ట దేవతా సన్నుతి - సంస్కృతాంధ్ర మహా కవి స్తుతి - మొల్ల కవితా విలసనము - రామ కథా సుధా మాధురి ]

### ఇష్టదేవతా సన్నుతి

శ్రీ మహి మాభిరాముఁడు, వ
శిష్ఠ మహాముని పూజితుండు, సు
త్రామ వధూ కళాభరణ
రక్షకుఁ, డాశ్రిత పోషకుండు, దూ
ర్వామల సన్నిభాంగుఁడు, మ
హా గుణశాలి, దయా పరుండు, శ్రీ
రాముఁడు ప్రోచు భక్త తతి
రంజిలు నట్లుగ నెల్ల కాలమున్. 1

ఉ. శ్రీ నగ మందిరుం, డమర సేవితుఁ, డర్ధ శశాంక మౌళి, స
న్మౌని మనః పయోజ దిన నాయకుఁ, డబ్జ భ వామదేశ్వర
ధ్యాన లస త్ప్రసన్నుఁ, డతి ధన్యుఁడు, శేష విభూషణుండు; *వి
ద్యా నిధి, మల్లికార్జునుఁడు, తా నిడు మాకు శుభంబు లొప్పఁగన్.

ఉ. తెల్లని పుండరీకముల తేజము మెచ్చని కన్నుదోయితో
నల్లని శక్రనీల రుచి నవ్వెడు కోమల దేహ కాంతితో

---

* పం. చాననుఁడైన యట్టి మలికార్జునుఁ డిచ్చు శుభంబు లెప్పుఁడున్.

నల్లనఁ బిల్లఁగ్రోవి కర మంచిత నంజ్ఞల నింపు నింపఁగా
గొల్లతలన్ విరాళి తగఁ గొల్చెడు కృష్ణుఁడు ప్రోచుఁగావుతన్. 3

ఉ. మించి, సమస్త లోకములు మిన్నక తాఁ దన నేర్పు మీఱ ని
ర్మించి, ప్రగల్భతన్ మెఱసి, మేలను గీడును బ్రాణికోట్లు సే
వించ ఘటించి శాస్త్రములు, వేదములుం గొనియాడుచుండు నా
కాంచన గర్భుఁ డిచ్చు నధికంబుగ నాయువు నీప్సితార్థముల్. 4

సీ. చంద్ర ఖండ కలాపుఁ, జారు వామన రూపుఁ,
గలిత చంచల కర్ణుఁ, గమల వర్ణు,
మోద కోజ్జ్వల బాహు, మూష కోత్తమ వాహు,
భద్రేభ వదను, సద్భక్త సదను,
సన్ముని సుతి పాత్రు, శైల సంభవ పుత్రు,
ననుపి నామోదు, విద్యా ప్రసాదుఁ,
బరమ దయాభ్యాసుఁ, బాకాంకు శోల్లాసు,
సురుతర ఖ్యాతు, నా గోపవీతు,

తే. లోక వందిత గుణవంతు, నేక దంతు,
నతుల హేరంబు, స త్కృపా జావలంబు,
విమల రవి కోటి తేజు, శ్రీ విఘ్న రాజుఁ
బ్రథిత వా క్ప్రౌఢి సేవించి ప్రస్తుతింతు. 5

చ. కరిముఖుఁడుం, గుమారుఁడు వికారపుఁ జేఁతల ముద్దు సూపుచున్
గురువులు వాఱుచు న్నెదుట గుప్పున దాటుచుఁ గన్ను దోయితో
శిరములు రాయుచుం గదిరిఁ జేర్చిన చంద్రునిఁ బట్టి తీయఁగాఁ
గరములఁ జాఁప నవ్వెడు జగమ్ముల తల్లి శుభంబు లీవుతన్. 6

ఉ. సామజ యుగ్మ మింపలరఁ జల్లని నీరు పసిండి కుండలన్
వేమఱు వంచి వంచి కడు వేడుకతో *నభిషిక్తఁ జేయఁగాఁ
దామరపువ్వు గద్దియ ముదంబున నుండెడి లోకమాత మా
కామిని తల్లి లోకములఁ గాచుఁ గృపా మతి నెల్లకాలమున్. 7

---

* జలకంబుసేయఁగా

ఉ. మేలిమి మంచు కొండ నుపమింపఁగఁజాలిన యంచ నెక్కి, వా
హ్యాళి నటించి వచ్చు చతురాస్య నెదుర్కొని నవ్వు దేరగా
వాలిక సోగ కన్నుల నివాళి యొనర్చి, ముదంబు గూర్చు వి
ద్యాలయ, వాణి శబ్దముల నర్థములన్ సతతంబు మా కిడున్. 8

## సంస్కృతాంధ్ర మహా కవి స్తుతి

సీ. సుర సన్నుత జ్ఞాను సువివేకి వాల్మీకి,
నఖిల వేదాగ మావాసు వ్యాసు,
ఘో రాంధకార ప్రభా రవి భారవి,
స త్కాంతి హిమకర శ్లాఘు మాఘు,
వివిధ కళా నీతి విఖ్యాతి భవభూతిఁ,
బ్రకట కార్య ధురీణు భట్టబాణు,
మానినీ లోక సమ్మద భద్రు శివభద్రుఁ,
గవితా రసోల్లాసుఁ గాళిదాసు,

తే. స్తుత గుణోద్దాము నాచన సోము, భీము,
నవ్య మంజుల వా గ్ధుర్యు నన్నపార్యు,
రసికుఁ డైనట్టి శ్రీనాథు, రంగనాథుఁ,
దిక్క కవిరాజు, భోజు నుతించి మించి, 9

క. తొల్లిటి యిప్పటి స త్కవి
వల్లభులను రసిక వినుత వా గ్విభవ కళా
మల్లులఁ గవితా రచనల
బల్లిదు లైనట్టి ఘనుల భక్తిగఁ దలఁతున్. 10

క. గురు లింగ జంగ మార్చన
పరుఁడును, శివభక్తి రతుఁడు, బాంధవ, హితుఁడున్
గురు, ఁడాతుకూరి కేసయ
వర పుత్రిని *మొల్ల యనఁగ వఱలినదానన్. 11

* మొల్లి నామ వర వా గ్విభవన్

## మొల్ల కవితా విలసనము

సీ. దేశీయ పదములు దెనుఁగులు సాంస్కృతుల్
సంధులు ప్రాజ్ఞుల శబ్ద వితతి
శయ్యలు రీతులుఁ జాటు ప్రబంధంబు
లాయా సమాసంబు లర్థ దృష్టి
భావార్థములుఁ గావ్య పరిపాకములు రస
భావ చమత్కృతుల్ పలుకు సరవి
బహు వర్ణములును విభక్తులు ధాతు ల
లంకృతి చ్ఛందో విలక్షణములుఁ

తే. గావ్య సంపద క్రియలు నిఘంటువులును
గ్రమము లేవియు నెఱుఁగ, విఖ్యాత గోప
వరపు శ్రీకంఠమల్లేశు వరముచేత
నెఱిఁ గవిత్వంబుఁ జెప్పఁగా నేర్చుదాన. 12

క. చెప్పు మని రామచంద్రుఁడు
సెప్పించిన పలుకుమీఁదఁ జెప్పెద నే నె
ల్లప్పుడు నిహ పర సాధన
మిప్పుణ్య చరిత్ర. తప్పు లెంచకుఁడు కవుల్ ! 13

వ. అని మఱియును. 14

క. పలిపపు సన్న పయ్యెదను వాసిగ గందపుఁ బూఁతలొ డుతన్
గొలదిగఁ గానవచ్చు వలి గుబ్బ చనుంగవ లీవి నొప్పఁగాఁ
దెలుఁ గని చెప్పుచోటఁ గడుఁ దేటలఁ మాటలఁ గ్రొత్త రీతులం
బొలుపు వహింపకున్న, మఱి పొందగునే పటహాదిశబ్దముల్ ? 15

క. మును సంస్కృతములఁ దేటగఁ
దెనిఁగించెడిచోట నేమి దెలియక యుండన్
దన విద్య మెఱయఁ గ్రమ్మఱ
ఘన మగు సంస్కృతముఁ జెప్పఁగా రుచి యగునే? 16

ఆ. తేనె సోఁక నోరు తీయన యగు రీతిఁ
దోఁచ నర్థ మెల్లఁ దోచకుండ
గూఢ శబ్దములను గూర్చిన కావ్యమ్ము
మూఁగ చెవిటివారి ముచ్చ టగును. 17

క. కందువ మాటలు, సామెత
లందముగాఁ గూర్చి చెప్ప నది తెనుఁగునకున్
బొందై, రుచియై, వీనుల
విందై, మఱి కానుపించు విబుధుల మదికిన్. 18

వ. అని మఱియును, 19

రామ కథా సుధా మాధురి

క. ఆది రఘు*రాము చరితము
నాదరముగ విన్నఁ గ్రొత్తయై, లక్షణ సం
పాదమ్మై, పుణ్య స్థితి
వేదమ్మై తోఁచకున్న వెట్టినె చెప్పన్? 20

ఉ. రాజిత కీర్తియైన రఘురాము చరిత్రము మున్ గవీశ్వరుల్
తేజ మెలర్పఁ జెప్పి రని తెల్సియుఁ గ్రమ్మఱఁ జెప్ప నే? లనన్
భూజన కల్పకం బనుచు, భుక్తికి ముక్తికి మూల మంచు, నా
రాజును దైవ మైన రఘురాము నుతించినఁ దప్పు గల్గునే? 21

క. వారాంగన శ్రీరాముని
పే రిడి రాచిలుకఁ బిలిచి పెంపు వహించెన్;
నేరుపు గల చందంబున
నా రాముని వినుతి సేయ నర్హము గాదే? 22

క. నేరిచి పొగడినవారిని,
నేరక కొనియాడువారి నిజ కృప మనుపం

---

* నాథ కీర్తన, లాదట వినఁ గ్రొత్త లగుచు లక్షణ పద సంపాదములై
పుణ్య స్థితి, వేదములై

గారణ మగుటకు భక్తియె
కారణ మగుఁ గాని చదువు కారణ మగునే? 23

ఉ. సల్లలిత ప్రతాప గుణ సాగరుఁడై విలసిల్లి, ధాత్రిపై
బల్లిదుఁడైన రామ నరపాలకునిన్ స్తుతి సేయు జిహ్వకున్
జిల్లర రాజ లోకమును జేకొని మెచ్చఁగ నిచ్చ పుట్టునే?
యల్లము బెల్లముం దినుచు నప్పటి కప్పటి కాస సేయునే? 24

శ్రీ

# రామాయణము

## బాలకాండము

[కథా ప్రారంభము - అయోధ్యా పుర వైభవము - దశరథుని ధర్మ పాలనము - దశరథుఁడు పుత్రకామేష్టి కావించుట - సురల మొఱ లాలించి శ్రీ మహావిష్ణు వభయ మొసఁగుట - అగ్నిదేవుఁడు ప్రత్యక్షమై దశరథునకుఁ బాయస మిచ్చుట - కౌసల్యా కైకేయీ సుమిత్రల దౌహృద లక్షణములు - శ్రీరామ భరత లక్ష్మణ శత్రుఘ్నుల యవతారము - యాగ రక్షణమునకు రాముని బంపుమని విశ్వామిత్రుని వేఁడికోలు - కౌశికుని యాజ్ఞపై రాముఁడు తాటకను గూల్చుట - రాముఁడు రాక్షసులను జంపి తపసి జన్నమును గాచుట - శ్రీరాముని పాద ధూళి సోఁక నహల్యయైన శిల - సీతా స్వయంవరము - శివ ధనువు నెక్కుపెట్టిన ధీరునకు సీత నిత్తునని జనకుని ప్రకటన - రాజ కుమారులు శివ చాపమును గదల్ప నోడుట - ముని యానతి శ్రీరామునిచే శివ ధనుర్భంగము - సీతా రాముల కల్యాణ వైభవము - దశరథరాముని గని పరశురాముని యధిక్షేపము - శ్రీరాముఁడు పరశురాముని నారాయణ చాపముతోఁ గూడ విష్ణుతేజము నందికొనుట-ఆశ్వాసాంతపద్యగద్యములు.]

### కథా ప్రారంభము

వ. అని వితర్కించి, ముదంబున నిష్ట దేవతా ప్రార్థనంబును బురాతన కవీంద్ర స్తుతియునుం జేసి నా యొనర్పంబూనిన మొల్ల రామాయణ మహా కావ్యమునకుఁ గథా క్రమం బెట్టి దనిన, 1

### అయోధ్యా పుర వైభవము

సీ. సరయూ నదీ తీర సతత సన్మంగళ
ప్రాభవోన్నత మహా వైభవమ్ము,
కనక గోపుర హర్మ్య ఘన కవాటోజ్జ్వల
ప్రాకార గోపుర శ్రీకరమ్ము.

గజ వాజి రథ భట గణి కాతపత్ర చా
మర కేతు తోరణ మండితమ్ము.
ధరణీ వధూటి కాభరణ విభ్రమ రేఖ
దరిసించు మాణిక్య దర్పణమ్ము.

తే. భాను కుల దీప రాజన్య పట్టభద్ర
భాసి నవరత్న ఖచిత సింహాసనమ్ము.
నాఁగ నుతి కెక్కు మహిమ ననారతమ్ము.
ధర్మ నిలయమ్ము. మహి నయోధ్యాపురమ్ము. 2

సీ. మదనాగ యూథ సమగ్ర దేశము గాని
కుటిల వర్తన శేష కులము గాదు.
ఆహవోర్వీజయ హరి నివాసము గాని
కీశ సముత్కరాంకితము గాదు.
సుందర స్యందన మందిరం బగుఁ గాని
సంతత మంజులాశ్రయము గాదు.
మోహన గణికా సమూహ గేహము గాని
యూథికా నికర సంయుతము గాదు.

తే. సరస సత్పుణ్యజన నివాసమ్ము గాని
కఠిన నిర్దయ దైత్య సంఘమ్ము గాదు.
కాదు కాదని కొనియాడఁ గలిగి నట్టి
పుర వరాగ్రమ్ము సాకేత పుర వరమ్ము. 3

సీ. భూరి విద్యా ప్రౌఢి శారదా పీఠమై
గణుతింప సత్య లోకమ్ము వోలె,
మహనీయ గుణ సర్వమంగళావాసమై
పొగ డొందు కైలాస నగము వోలె,
లలిత సంపచ్ఛాలి లక్ష్మీ నివాసమై
యురవైన వైకుంఠ పురము వోలె,
విరచిత ప్రఖ్యాత హరిచంద నాఢ్యమై
యారూఢి నమ రాలయమ్ము వోలె,

తే. రాజరాజ నివాసమై తేజరిల్లి
నరవ రోత్తర దిగ్భాగ నగరి వోలె,
సకల జనములు గొనియాడ జగములందుఁ
బొలుపు మీరును సాకేత పుర వరమ్ము. 4

క. ఇమ్ముల న ప్పురి వప్రము
కొమ్ములపై నుండి పురము కొమ్మలు వేడ్కన్
దమ్ముల చుట్టము పద జల
జమ్ములు పూజింతు రొగి నజస్రముఁ బ్రీతిన్. 5

క. పరువున మురువై యుండును
సురపురమునఁ గల్ప తరులు చూపఱ కింపై;
పరువున మురువై యుండును
దురగంబు లయోధ్యఁ గల ప్రతోళికలందున్. 6

క. దాన గుణమ్మున సుర పురి
నే నాఁడును నమర రత్న మెన్నిక కెక్కున్;
దాన గుణంబున మిక్కిలి
యేనుఁగు లా పురములోన నెన్నిక కెక్కున్. 7

క. కవి గురు బుధ మిత్రాదులు
వివి ధార్చనలను సురపురి వెలయుదు రెలమిన్;
గవి గురు బుధ మిత్రాదులు
వివి ధార్చనలం బురమున వెలయుదు రెపుడున్. 8

క. భో గానురాగ సంపద
భోగులు వర్తింతు రందు భూ నుత లీలన్;
భో గానురాగ సంపద
భోగులు వర్తింతు రిందు భూ నుత లీలన్. 9

సీ. ప్రకటాగ్ని హోత్ర సంపన్ను లౌదురు గాని
రమణీయ రుక్మ కారకులు గారు,

శుభ పవిత్రోజ్జ్వల సూత్రధారులు గాని
టక్కరి హాస్య నాటకులు గారు,
ఉభయ సంధ్యాది విధ్యుక్త కర్ములు గాని
చర్చింపఁగా నిశాచరులు గారు,
తిలకించి చూడ సద్ద్విజు లౌదురే కాని
తలఁపంగఁ బక్షి జాతములు కారు,

బాడబులు గాని యగ్ని రూపములు గారు,
పండితులు గాని విజ్ఞుల పగిదిఁ గారు,
ధీవరులు గాని జాతి నిందితులు గారు,
పరమ పావను లా పురి ధరణి సురులు. 10

ఉ. రాజులు కాంతియందు, రతి రాజులు రూపమునందు, వాహినీ
రాజులు దానమందు, మృగ రాజులు విక్రమ కేళియందు, గో
రాజులు భోగమందు, దిన రాజులు సంతత తేజమందు, రా
రాజులు మానమందు, నగరమ్మున రాజ కుమారు లందఱున్. 11

సీ. తగ దాన విఖ్యాతి ధరఁ గుబేరులు గాని
సత తాంగ కుష్ఠ పీడితులు గారు,
నిర్మల సత్యోక్తి ధర్మ సూతులు గాని
చర్చింప ననృత భాషకులు గారు,
ప్రకట విభూతి సౌభాగ్య రుద్రులు గాని
వసుధపై రోష మానసులు గారు,
కమనీయ గాంభీర్య ఘన సముద్రులు గాని
యతులిత భంగ సంగతులు గారు,

తే. వర్తకులు గాని పశు లేవరుసఁ గారు,
భోగులే గాని పాము లెప్పుడును గారు,
సరసులే కాని కొలఁకుల జాడఁ గారు,
వన్నె కెక్కిన యప్పురి వైశ్యు లెల్ల. 12

క. పంటల భాగ్యము గలరై
పంటలపైఁ బంట లమర బ్రతుకుదు రెపుడున్
బంటలుఁ బాడియుఁ గల యా
పంటలు మొదలైన కాఁపుఁ బ్రజ లా నగరిన్. 13

సీ. కలికి చూపులచేతఁ గరఁగింప నేర్తురు
బ్రహ్మచారుల నైన భ్రాంతి గొలిపి,
మృదు వచో రచనల వదలింప నేర్తురు
ఘన మునీంద్రుల నైనఁ గచ్ఛదములు,
వలపులు పైఁజల్లి వలపింప నేర్తురు
సన్న్యాసులను నైనఁ జలముపట్టి,
సురత బంధమ్ములఁ జొక్కింప నేర్తురు
వ్రతములు గైకొన్న యతుల నైన,
తే. నచల మెక్కింప నేరుతు రౌషధముల,
మరులు గొలుపంగ నేర్తురు మంత్రములను,
ధనము లంకింప నేర్తురు తక్కుసేసి,
వాసి కెక్కిన య ప్పురి వారసతులు. 14

సీ. శారద గాయత్రి శాండిల్య గాలవ
కపిల కౌశిక కుల ఖ్యాతి గలిగి,
మదన విష్వక్సేన మాధవ నారద
శుక వైజయంతి కార్జునులు గలిగి,
చంద్రార్క గుహ గిరిసంభవ జయ వృష
కుంభ బాణాదులఁ గొమరు మిగిలి,
సుమన ఐరావత సురభి శక్రామృత
పారిజాతముల సొంపారఁ గలిగి,
తే. బ్రహ్మ నిలయమ్ము, వైకుంఠ పట్టణమ్ము,
నాగ కంకణు శైలమ్ము, నాక పురము,
లలిత గతిఁ బోలి, యే వేళఁ దులను దూఁగి,
ఘనత నొప్పారు న ప్పురి వనము లెల్ల. 15

చ. కనక విలాస కుంభములు గబ్బి కుచంబుల లీలఁ, జిత్ర కే
తనములు పైఁట కొంగుల విధంబునఁ గ్రాల, గవాక్షముల్ రహిన్
గనుఁ గవ యట్ల పొ ల్పెసఁగఁగా భువి భోగులు మెచ్చ భోగినీ
జనముల రీతిఁ జె ల్వమరు సౌధ నికాయము పాయ క ప్పురిన్.

తే. మకర, కచ్ఛప, శంఖ, పద్మములు గలిగి,
ధనదు నగరమ్ముపైఁ గాలు ద్రవ్వుచుండు
సరస మాధుర్య గాంభీర్య సరణిఁ బేర్చి
గుఱుతు మీఱిన య ప్పురి కొలఁకు లెల్ల. 17

గీ. అమృత ధారా ప్రవాహమ్మునందు నెపుడు
నొక్క ధేనువు దివి నున్న నుచిత మగునె?
అమృత ధారా ప్రవాహమ్మునందు నెపుడుఁ
బెక్కు ధేనువు ల ప్పురిఁ బేరు నొందు. 18

క. ఈ కరణి సకల విభవ
శ్రీకర మయి తాఁ బ్రసిద్ధిఁ జెలఁగుచు మహిమన్
నాక పురితోడ నొఱయుచు
సాకేత పురమ్ము వెలయు జగము నుతింపన్. 19

వ. అట్టి మహా పట్టణంబున కధీశ్వరుం డెట్టివాఁ డనఁగ:

దశరథుని ధర్మ పాలనము

సీ. తన కీర్తి కర్పూర తతిచేత వాసించెఁ
బటుతర బ్రహ్మాండ భాండ మెల్లఁ,
దన శౌర్య దీప్తిచే నిన బింబ మనయంబుఁ
బగ లెల్ల మాఁగుడు వడఁగఁ జేసెఁ,
దన దాన విఖ్యాతి ననుదినంబును నర్థి
దారిద్ర్యములు వెళ్ళఁ బాఱఁ దఱిమెఁ,
దన ప్రీతి మహిమచే జన లోక మంతయుఁ
దగిలి సంతతము సుఖ మొందఁ దనరెఁ,

తే. ఖశిర ! కొనియాడఁ బాత్రమై పరఁగినట్టి
వైరి నృప జాల మేఘ సమీరణుండు.
దినక రాన్వయ పాథోధి వనజ వైరి,
నిశిత కౌక్షేయక కరుండు దశరథుండు. 20

సీ. పాలింపఁ దవినీతి పరుల మన్ననఁ జేసి
పాలించు సజ్జన ప్రతతి నెపుడు,
మనుపఁ డెన్నఁడుఁ జోరులను గారవము చేసి
మనుచు నాశ్రిత కోటి ఘనముగాఁగ,
వెఱ పెఱుంగఁడు వైరి వీరులఁ బొడగన్న
వెఱచు బొంకే యెద దొరలునో యని,
తలఁకఁ డర్థి వ్రాతములు మీఱి పైకొన్నఁ
దలఁకు ధర్మ మ్మెందుఁ దప్పునో యని.

తే. సరవిఁ బోషింపఁ దరి గణ షట్క మెపుడు,
వెలయఁ బోషించు నిత్యమ్ము విప్ర వరుల,
భాస్క రాన్వయ తేజో విభాసితుండు,
మాన ధుర్యుండు దశరథ క్ష్మా వరుండు. 21

సీ. కనఁగోరఁ డొక నాఁడుఁ గన్నులఁ బర వధూ
లావణ్య సౌభాగ్య లక్షణములు,
వినఁగోరఁ డొక నాఁడు వీనుల కింపుగాఁ
గొణఁచువారలవేఁడి కొండెములను,
చిత్తంబు వెడలించి జిహ్వాగ్రమునఁ గోరి
పలుకఁడు కాఠిన్య భాషణములు,
తలఁపఁ డించుకయైన ధన కాంక్ష నే నాఁడు
బంధు మిత్రాశ్రిత ప్రతతిఁ జెఱుప,

తే. సతత గాంభీర్య ధైర్య భూషణ పరుండు,
వార్త కెక్కిన రాజన్య వర్తనుండు,

సకల భూపాల జన సభా సన్నుతుండు,
ధర్మ తాత్పర్య నిరతుండు, దశరథుండు. 22

సీ. వీర హేతిశయమున వృద్ధి పొందఁగ లేక
విష ధరుండును గోఁట విషముఁ బూనె,
తాపంబు గ్రొవ్వెంచి తరియింప నోపక
పలుమాఱుఁ గడగండ్లఁ బడియెఁ గరులు,
కందర్ప శర వృష్టి నంద నోపక ఘృష్టి
వనవాసమునఁ గ్రుస్సి వనరు సూపె,
దీపించి వల పాప నోపక కూర్మంబు
కుక్షిలోపలఁ దలఁ గ్రుక్కికొనియె,

తే. కుంభినీ కాంత తమమీఁది కూర్మి విడిచి
ప్రకట రాజన్య మస్త కాభరణ మకుట
చారు మాణిక్య దీపిత చరణుఁడైన
దశర థాధీశు భుజ పీఠిఁ దగిలె నంత. 23

క. ఆ రాజు రాజ్యమందలి
వారెల్లను నిరత ధర్మ వర్తను లగుచున్
భూరి స్థిర విభవంబుల
దారిద్ర్యం బెఱుఁగ రెట్టి తఱి నే నాఁడున్. 24

వ. ఇట్టి మహా ధైర్య సంపన్నుండును, మహైశ్వర్య ధుర్యుండును నగు దశరథ మహారాజు సకల సామంత రాజ లోక పూజ్యమానుం డగుచుఁ బ్రాజ్యంబగు రాజ్యంబు నేలుచు నొక్కనాఁడు. 25

దశరథుఁడు పుత్రకామేష్టి కావించుట

సీ. సంతాన లబ్ధికై చింతించి చింతించి,
శిష్ట వర్తనుఁ డౌ వశిష్ఠుఁ జూచి,
తన కోర్కి వినుపింప, విని మునిసింహుండు
పలికె ఋశ్యశృంగు నెలమిఁ దేర,

ఘనుఁ డాతఁ డొగిఁ బుత్రకామేష్టి యనుపేర
యాగమ్ముఁ గావింప. నందువలన
వినుతి కెక్కఁగఁ జాలు తనయుల గలుగుట
సిద్ధమ్ము. నా మాట బుద్ధిలోన

తే. నిలుపు మని చెప్ప. నా రాజు నెమ్మితోడ
నకుటి లాత్మకు నా విభాండకుని తనయు
నెలమి రావించి. పుత్త్రికామేష్టి యనెడి
జన్న మొనరించు చున్నట్టి సమయమునను. 26

సురల మొఱ లాలించి శ్రీమహావిష్ణు వభయ మొసఁగుట

ఉ. రావణుచేతి బాధల నిరంతరమున్ బడి వేఁగి. మూఁక లై
దేవత లెల్ల గీష్పతికిఁ దెల్లముగా నెఱిఁగింప. వారి రా
జీవ తనూజుఁ డున్నెడకు శీఘ్రము తోడ్కొని పోయి చెప్ప. నా
దేవుఁడు విష్ణు సన్నిధికి దిగ్గనఁ జేకొనిపోయి యచ్చటన్. 27

వ. అప్పురాణ పురుషోత్తముం గాంచి. నమస్కరించి. యింద్రాది
దేవతలం జూపి. బ్రహ్మ యిట్లని విన్నవించె: 28

ఉ. రావణుఁ డుగ్రుఁడై తన పరాక్రమ శక్తిని వీరి సంపదల్
వావిరిఁ గొల్లలాడి త్రిదివంబును బాడుగఁ జేయ. నేఁడు దే
వావళి దీన భావమున నక్కడ నుండఁగ నోడి. భీతిచే
దేవరఁ గానవచ్చె నిఁక దేవర చిత్తము వీరి భాగ్యమున్. 29

వ. అని విన్నవించిన విని వనరుహలోచనుండు దయాయత్త
చిత్తుండై యనిమిషనాయకుని గూర్చి యిట్లానతిచ్చె: 30

తే. వనజగర్భుని గూర్చి రావణుఁడు మున్ను
తపముఁజేసిన వర మిచ్చుతఱినిఁ దనకు
నేరిచేఁ జావు లేకుండఁ గోరువాఁడు
నరుల వానరులను జెప్ప మఱచినాఁడు 31

వ. అక్కారణంబునం జేసి, 32

తే. వనరు గలిగెను మనకు రావణుని జంప,
వినుఁడు మీరెల్ల నా మాట వేడ్క మీఱ,
దశరథుం డనురాజు సంతాన కాంక్ష
నొనర జన్నంబు గావించుచున్నవాఁడు. 33

క. ధరణీపతి యగు దశరథ
నరనాయకు నింటఁ బుట్టి నర రూపమునం
బెరిగెద; మీరును, మేమును
సుర కంటకుమీఁద లావు సూపుటకొఱకై. 34

క. కొందఱు కపి వంశంబునఁ
గొందఱు భల్లుక కులమున గురు బలయుతులై
యందఱు నన్ని తెఱంగుల
బృందారకులార! పుట్టి పెరుగుఁడు భువిపై. 35

వ. అని, కృపా ధురీణుండైన నారాయణుఁ డాన తిచ్చిన విని, వనజాసనాది దేవతా నికరం బ వ్వనజోదరుని పాదారవిందమ్ము లకు వందనమ్ము లాచరించి, నిజ నివాసమ్ములకుం జని రయ్యవస రమ్మున, 36

అగ్నిదేవుఁడు ప్రత్యక్షమై దశరథునకుఁ బాయస మిచ్చుట

మ. ఇల సాకేత నృపాల శేఖరుఁడు దా హేలా విలాసంబుతో
ఫల కాంక్షన్ గ్రతువుం బొనర్చినయెడన్ బంగారు పాత్రమ్ము లో
పల దుగ్ధాన్నము చాల నించుకొని తాఁ బ్రత్యక్షమై నిల్చి ని
ర్మల తేజంబునఁ బావకుం డనియెఁ బ్రేమన్ మంజు వాక్యంబులన్.

క. భూపాల! నీదు భార్యల
కీ పాయస మారగింప నిమ్మీ! తనయుల్
శ్రీపతి పుత్త్రి సమానులు
రూపసు లుదయింతు రమిత రూప స్ఫూర్తిన్. 38

వ. అని చెప్పి య ప్పాయస పాత్రంబు చేతి కిచ్చిన. 39

ఆ. పాయసమ్ము రెండు భాగముల్ గావించి,
యగ్ర సతుల కీయ, నందులోన
సగము సగము దీసి ముగుద సుమిత్రకు
నొసఁగి, రంత నామె మెసవెఁ బ్రీతి. 40

కౌసల్యా కైకేయీ సుమిత్రల దౌహృద లక్షణములు

వ. అంతం గొన్ని దినంబులకుఁ గౌసల్యా కైకేయీ సుమిత్రలు
గర్భవతులై యొప్పారుచుండ, 41

సీ. ధవళాక్షి యనుమాట తథ్యంబు గావింపఁ
దెలు పెక్కి కన్నులు తేట లయ్యె.
నీల కుంతల యని నెగడిన యా మాట
నిలుపంగ నెఱులపై నలుపు సూపె.
*గురు కుచ యను మాట సరవి భాషింపంగఁ
దోరమై కుచముల సీరు వట్టె,
మంజు భాషిణి యను మాట దప్పక యుండ
మెలఁతల పలుకులు మృదువు లయ్యెఁ.

తే. గామిను లటంట నిక్కమై కాంతలందు
మీఱి మేలైన రుచులపైఁ గోరి కయ్యె.
సవతి పోరనఁ దమలోన సారె సారె
కోకిలింతలు, బెట్టు చిట్టములుఁ బుట్టె. 42

వ. మఱియును. 43

---

* మందయాన లనంగ మానైన య మ్మాట
నిక్కఁబుగా మాంద్య మెక్కె నడలఁ
శ్రీ కం. వీరేశలింగము పంతులవారి ప్రతిలోని పాఠము

సీ. తను మధ్య అను మాటఁ దప్పింపఁ గాఁబోలుఁ
బొలు లేక నడుములు పొదలఁ జొచ్చెఁ,
* గుచములు బంగారు కుండలో యను మాట
కల్లగా నగ్రముల్ నల్ల నయ్యెఁ,
జంద్రాస్య అను మాట సరవి మాన్పఁగఁ బోలుఁ
గళల విలాసమ్ము పలుచ నయ్యె,
సుందరు అను మాట సందియమ్ముగఁ బోలు
గర్భ భారమ్ములఁ గాంతి దప్పె.

తే. ననుచుఁ గనుగొన్న వారెల్ల నాడుచుండఁ,
గట్టు చీరెల ప్రేఁకంబు పుట్టుచుండ
నా సతులఁ జూచి యందఱు నలరుచుండఁ,
గాంతలకు నంత గర్భముల్ కానుపించె. 44

శ్రీరామ భరత లక్ష్మణ శత్రుఘ్నుల యవతారము

వ. ఇట్లు దుర్భరంబులైన గర్భంబులు దాల్చిన కౌసల్యాది కాంతా త్రయమ్మును జైత్ర మాసమ్మున, శుక్ల పక్షమ్మున, నవమీ, భాను వాసరమ్మునఁ, బునర్వసు నక్షత్రంబునఁ, గర్కాటక లగ్నంబున శ్రీరామభరతలక్ష్మణశత్రుఘ్నులం గాంచినం దదనంతరంబున దశరథుండు యథోచిత కర్తవ్యంబులు జరపి, య ప్పది దినంబుల నరిష్టంబు లేక ప్రతి దిన ప్రవర్ధమాన మగుచున్న కుమార చతుష్టయంబునకుఁ గాలోచితంబు లగు చౌలోపనయ నాది కృత్యంబులు గావించి, వెండియు విద్యా ప్రవీణు లగునట్లు లొనర్చి, గజాశ్వ రథారోహణంబులు నేర్పి, ధనుర్వేద పారగులం గావించి, పెంచుచున్న సమయమ్మున, 45

---

* ముకుర కపోలలు ముగుద లనెడు మాట, కల్లగాఁ జెక్కులు వెల్ల నయ్యె (కం. పీ)

## యాగ రక్షణమునకు రాముని బంపుమని
## విశ్వామిత్రుని వేఁడికోలు

సీ. ఒక నాఁడు శుభ గోష్ఠి నుర్వీశ్వరుఁడు మంత్రి
        హిత పురోహితులను నెలమిఁ జేరి,
బంధు వర్గము రాయబారులఁ జారుఁ
        బరిచారకుల నెల్ల సరవిఁ జేరి,
గాయకులను భృత్య గణమును మిత్త్రుల
        సతులను సుతులను జక్క నలరి,
సరసులఁ జతురులఁ బరిహాసకులఁ గళా
        వంతులఁ గడు నొక్క వంకఁ జేరి

తే. కొలువఁ గొలు వున్నయెడ, వచ్చి కుశికపుత్త్రుఁ,
డర్థి దీవించి, తా వచ్చినట్టి కార్య
మధిపునకుఁ జెప్ప, మదిలోన నదరిపడుచు
వినయ మొప్పార నిట్లని విన్నవించె : 46

క. రాముఁడు దనుజులతో సం
గ్రామము సేయంగఁ గలఁడె? కందు గదా! నే
నే మిమ్ముఁ గొలిచి వచ్చెద
నో మునిరాజేంద్ర! యరుగు ముచిత ప్రౌఢిన్. 47

మ. అనినం గౌశికుఁ డాత్మ నవ్వి, విను మయ్యా! రాజ! నీచేతఁ గా
దనరా దైనను రాక్షసుల్ విపుల గర్వాటోప బాహా బలుల్,
ఘనుఁ డీ రాముఁడు దక్క వారి గెలువంగా రాదు, పిన్నంచు నీ
వనుమానింపక పంపు మింకఁ, గ్రతు రక్షార్థంబు భూనాయకా! 48

వ. అని ప్రియోక్తులు పలుకుచున్న విశ్వామిత్త్రునకు మిత్త్రకుల పవిత్రుం డైన దశరథుండు మాఱాడ నోడి యప్పుడు. 49

క. మునినాథు వెంట సుత్రా
ముని నలజడి వెట్టుచున్న మూర్ఖులపై రా

ముని, సౌమిత్రిని వెస న
మ్మునితో నానంద వార్ధి మునుఁగుచుఁ జనిచెన్. 50

కౌశికుని యాజ్ఞపై రాముఁడు తాటకను గూల్చుట

మ త్త. వారిఁ దోడ్కొని కౌశికుం డట వచ్చు నయ్యెడ ఘోర కాం
తార మధ్యమునందు నొక్కతె దైత్య కామిని భీకరా
కార మొప్పఁగ నట్టహాస వికార మేర్పడ వచ్చు నా
క్రూర రాక్షసిఁ జూచి య మ్ముని కుంజరుం డొగి రామునిన్.

క. తాటక వచ్చిన చడిగో
యాటది యని యెంచుచు మొగమాడక నీ వీ
పాటి పడనేయు మని తడ
బాటున శంకించు రామ భద్రున కనియెన్. 52

వ. ఇట్లు చెప్పిన యా మునిచంద్రుని పల్కు లాలించి, రామచం
ద్రుండు తన యంతరంగమ్మున నిట్లని వితర్కించె: 53

క. ఈ యాఁడుదానిఁ జంపఁగ
నా యమ్మున కేమి గొప్ప? నగరే వీరుల్?
చీ! యని రోయుచు న మ్ముని
నాయకు భయ మెఱిఁగి తన మనమ్మున నలుకన్. 54

క. వ్రేటు గొని రామచంద్రుఁడు
సూటిగ నొక దిట్ట కోల సురలు నుతింపన్
ఘోటక సమ వక్షస్స్థలఁ,
దాటక నత్యుగ్ర లీల ధరపైఁ గూల్చెన్. 55

వ. ఇట్లు తాటకం గీ టణంచినయంత, న మ్మునీంద్రుండు మేటి
సంతోషమ్మున రామునిం గొనియాడుచు, న్నాశ్రమంబున నిజాశ్ర
మంబున కేఁతెంచి, రామ సౌమిత్రుల సాయంబున జన్నంబు
సేయుచున్న సమయంబున, 56

రాముఁడు రాక్షసులను జంపి తపసి జన్నమును గాచుట

క. ఆకాశ వీథి నెలకొని
రాకాసులు గురిసి రమిత రక్తముఁ, బలలం
బా కౌశికు యజ్ఞముపై
భీకరముగ ముని గణంబు భీతిన్ బొందన్. 57

ఉ. అంబర వీథి నిల్చి త్రిదశాంతకు లెంతయు నేచి, రక్తమాం
సంబులు గాధి నందనుని జన్నముపైఁ గురియంగ, నంతలో
నంబర రత్న వంశ కలశాంబుధి చంద్రుఁడు, రామచంద్రుఁ డు
గ్రంబుగఁ ద్రుంచెఁ జండ బల గర్వులఁ దమ్ముఁడు దాను నొక్కటై.

వ. ఇట్లు రామచంద్రుండు సాంద్ర ప్రతాపంబు మించ నింద్రారులఁ ద్రుంచిన నమ్మునిచంద్రుఁడు నిర్విఘ్నంబుగా జన్నం బొనర్చి, రామ సౌమిత్రులం బూజించె నట్టి సమయమ్మున: 59

క. ధరణీ సుత యగు సీతకుఁ
బరిణయ మొనరింప జనక పార్థివుఁ డిల భూ
వర సుతుల రం డని స్వయం
వర మొగిఁ జాటించె నెల్లవారలు వినఁగన్. 60

వ. ఇట్లు స్వయంవర మహోత్సవ ఘోషంబున సంతోషమ్ము నొంది, విశ్వామిత్రుండు రామ సౌమిత్రుల మిథిలా నగరంబునకుఁ దోడ్కొని, చనుచుండు మార్గంబున: 61

శ్రీరాముని పాద ధూళి సోక నహల్యయైన శిల

క. ముని తాపసి వెనువెంటను
వదలక చనుదెంచునట్టి వడి రాముని శ్రీ
పద రజము సోఁకి, చిత్రం
బొదవఁగఁ గనుపట్టె నెదుట నొక యుపల మటన్. 62

క. వదనై, యొప్పిదమై, కడుఁ
గదలుచు బంగారు పూదె కరఁగిన రీతిన్,
మెదలుచు, లావణ్య స్థితి
సుదతిగఁ జూపట్టి నిలిచె సురుచిర లీలన్. 63

ఉ. ఆ ముని వల్లభుండు కొనియాడుచుఁ బాడుచు, వేడ్కతోడ శ్రీ
రాముని జూచి యిట్లనియె, రామ! భవత్పద ధూళి సోఁకి, యీ
భామిని రాయి మున్ను. కులపావన! చూడఁగఁ జిత్రమయ్యె నీ
నామ మెఱుంగు వారలకు నమ్మఁగ వచ్చును భుక్తి ముక్తులున్. 64

వ. అని యక్కాంతా రత్నంబు పూర్వ వృత్తాంతం బంతయు నెంతయు
సంతసమ్మున న మ్మనుజేంద్ర నందనుల కెఱింగింపుచు, మిథిలా
నగరంబునకుం జనియె నచ్చట; 65

## సీతా స్వయంవరము

సీ. ద్రవిడ కర్ణా టాంధ్ర యవన మహారాష్ట్రి
రాజ కుమారులు తేజ మలరఁ,
పాండ్య ఘూర్జర లాట బర్బర మలయాళ
భూప నందనులు విస్ఫూర్తి మీఱ,
గౌళ కేరళ సింధు కాశి కోసల సాళ్వ
ధరణీశ పుత్రులు సిరి వెలుంగ,
మగధ మత్స్య కళింగ మాళవ నేపాళ
నృప తనూభవులు నెన్నికకు నెక్క,

తే. మఱియు నుత్కల కొంకణ మద్ర పౌంద్ర
వత్స గాంధార సౌరాష్ట్రి వంగ చోళ
రాజ్యముల నొప్పు చప్పన్న రాజ సుతులు
వచ్చి ర క్కామినీ స్వయంవరమునకును. 66

ఉ. కొందఱు పల్లకీల, మఱి కొందఱు తేరుల, నందలంబులం
గొందఱు, కొంద ఱశ్వములఁ, గొందఱు మత్త గజేంద్ర సంఘ
[మున్,

గొందఱు స్వర్ణ దోలికలఁ, గోరిక నెక్కి నృపాల నందనుల్
సందడిఁగాఁగ వచ్చిరి. బుజంబు బుజంబును ద్రోపులాడఁగన్. 67

వ. అట్టి సమయంబున. 68

చ. గురు భుజ శక్తి గల్గు పదికోట్ల జనంబులఁ బంప, వారు నా
హరుని శరాసనంబుఁ గొనియాడుచుఁ బాడుచుఁ గొంచు వచ్చి, సు
స్థిరముగ వేదిమధ్యమునఁ జేర్చిన, దానికి ధూప దీపముల్
విరులును గంధ మక్షతలు వేడుక నిచ్చిరి చూడ నొప్పుగన్. 69

వ. అట్టి సమయంబున జనక భూపాలుండు రాజ కుమారులం గనుం
గొని యిట్లనియె: 70

శివ ధనువు నెక్కుపెట్టిన ధీరునకు సీత నిత్తునని
జనకుని ప్రకటన

ఉ. కొంకక సావధాన మతిఁ గూర్చి వినుం డిదె, మత్తనూజకై
యుంకువ సేసినాఁడ వివిధోజ్జ్వల మైన ధనంబుఁ, గాన నీ
శంకరు చాప మెక్కిడిన సత్త్వ ఘనుం డగువాని కిత్తు నీ
పంకజనేత్ర సీత, నరపాలకులార! నిజంబు సెప్పితిన్. 71

ఆ. అనుచుఁ బలుకుచున్న యవనీశ తిలకుని
వాక్యములకు నుబ్బి, వసుమతీశ
సుతులు దాము తామె మతిలోనఁ దెలఁగుచు
దగ్గఱంగఁ బోయి ధనువుఁ జూచి. 72

రాజ కుమారులు శివచాపమును గదల్ప నోడుట

క. విల్లా? యిది కొండా? యని
తల్లడపడి సంశయంబు తలకొన మదిలో
బల్లిదు లగు నృప నందను
లెల్లరు దౌ దవుల నుండి రెంతయు భీతిన్. 73

క. కొందఱు దగ్గఱ నోడిరి,
కొందఱు సాహసము చేసి కోదండముతో
నందంద పెనఁగి పాఱిరి
సందుల గొందులను దూఱి, సత్త్వము లేమిన్. 74

సీ. గాలిఁ దూలిన రీతిగా నెత్తఁ జాలక
తముఁ దామె సిగ్గునఁ దలను వంచి,
కౌఁగిలించిన లోను గాక వెగ్గల మైన
భీతిచే మిక్కిలి బీకువోయి,
కరముల నందంద పొరలించి చూచినఁ
గదలక యున్నఁ జీకాకు నొంది,
పాషాణ మున్నట్టి పగిది మార్దవ మేమిఁ
గానరాకుండినఁ గళవళించి,
తే. రాజ సూనులు కొందఱు తేజ ముడిగి,
జగతి రాజుల మోసపుచ్చంగఁ దలఁచి.
జనకుఁ డీ మాయఁ గావించెఁ, జాలు ననుచుఁ
దలఁగి పోయిరి దవ్వుగా ధనువు విడిచి. 75

సీ. ఇది పర్వ తాకార, మీ విల్లు కను విచ్చి
తేఱి చూడఁగ రాదు దేవతలకు,
నటుగాక మును శేష కిటకుని ధను వంట,
హరుఁడె కావలెఁ గాక, హరియుఁ గాక,
తక్కినవారికిఁ దరమె యీ కోదండ
మెత్తంగఁ? దగు చేవ యెట్లు గలుగు?
దీని దగ్గఱ నేల? *దీని కోడఁగ నేల?
పరులచే నవ్వులు పడఁగ నేల?
తే. గుఱుతు సేసియుఁ దమ లావు కొలఁదిఁ దామె
తెలియవలెఁ గాక, యూరక తివుర నేల?

* దీనితో గాడవేల

యొరుల సొమ్ములు తమ కేల దొరకు? ననుచుఁ
దలఁగి పోయిరి రాజ నందనులు గనుచు. 76

వ. అంత విశ్వామిత్ర మునీంద్రుండు రామచంద్రుని ముఖావలోక
నంబుఁ జేసిన, 77

మునియానతి శ్రీరామునిచే శివ ధనుర్భంగము

చ. కదలకుమీ ధరాతలమ, కాశ్యపిఁ బట్టు, ఫణీంద్ర భూ విషా
స్పదులను బట్టు, కూర్మమ రసాతల భోగి ధురీ కులీశులన్
వదలక పట్టు, ఘృష్టి ధరణీ ఫణి కచ్ఛప పోత్రి వర్గమున్
బొదువుచుఁ బట్టుఁడీ కరులు, భూవరుఁ డీశుని చాప మెక్కిడున్.

క. ఉర్వీ నందనకై రా
మోర్వీపతి యెత్తు నిప్పు డుగ్రుని చాపం
బుర్విం బట్టుఁడు దిగ్గం
త్యుర్వీధర కిటి ఫణీంద్రు లూఁతఁగఁ గడిమిన్. 79

వ. అనుచు లక్ష్మణుండు దెలుపుచున్న సమయంబున, 80

మ. ఇన వంశోద్భవుఁ డైన రాఘవుఁడు, భూమీశాత్మజుల్ వేడ్కతోఁ
దను వీక్షింప, మునీశ్వరుం దలరఁ, గోదండంబు చే నంది, చి
వ్వన మోపెట్టి, గుణంబు పట్టి, పటు బాహా శక్తితోఁ దీసినన్,
దునిఁగెన్ జాపము భూరి ఘోషమున, వార్ధుల్ మ్రోయుచుండం
[బునన్.

ఆ. ధనువు దునిమినంత ధరణీశ సూనులు
శిరము లెల్ల వంచి సిగ్గు పడిరి;
సీత మేను వంచె; శ్రీరామచంద్రుని
బొగడె నపుడు జనక భూవిభుండు. 82

## సీతా రాముల కల్యాణ వైభవము

వ. ఇట్లు శ్రీరామచంద్రుని సత్త్వ సంపదకు మెచ్చి, సంతోషించి, జనక మహారాజు వివాహంబు సేయువాఁడై రమ్మని దశరథేశ్వరుని పేరిట శుభలేఖలు వ్రాయించి పంచిన, దశరథ మహారాజును నా శుభ లేఖలం జదివించి, సంతోషంబున నానంద బాష్పంబులు గ్రమ్మ దేర మంత్రి ప్రవరుండగు సుమంత్రునిం బిలిపించి, "సుమంత్రా! యిపుడు మన మందలమును బయలుదేఱి, మిథిలా పట్టణంబునకుం బోయి, యట జనక మహారాజు నింట మన రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులకు వివాహ మహోత్సవము జరుప వలయుఁ, గావున వశిష్ఠాది ద్విజ వర్యులను, గౌసల్యాది కాంతా జనమ్మును, నరుంధతి మొదలుగాఁగల భూసుర భార్యలను, మఱియు సకల బంధు జనంబును రావించి, బంగరు టరదంబుల నిడికొని దోడ్కొని ర" మ్మని యంపిన నతండును మహా ప్రసాదంబని తత్క్షణమ యంతఃపురంబునకుం బోయి, కౌసల్య కైక సుమిత్ర మొదలగు రాజ కాంతలను, వశిష్ఠాది ద్విజ వరిష్ఠులను, నరుంధతి మొదలుగాఁ గల ముత్తైదువలను, మిగిలిన సకల బంధు జనమ్మును రావించి, యుక్తప్రకారమ్ముగాఁ గనక రథమ్ముల పై నిడికొని, దశరథ మహారాజు కడకుం గొనివచ్చిన, యంత దశరథుండు పుత్ర ద్వయ సహితమ్ముగ రథ మారోహించి, సమస్త సేనా సమన్వితుం డగుచు, వాద్య ఘోషంబులు దశ దిశలు నిండ, నడచుచున్న సమయమ్మున; నంతకుముందు జనక భూవల్లభుండు దశరథ మహీపాలు నెదుర్కొని, తోడితెచ్చి, యడుగులు గడిగి, యర్ఘ్య పాద్యాది విధుల విధ్యుక్తంబుగాఁ బూజించి, మానితంబుగఁ గానుక లొసంగి, సకల సంపత్సంపూర్ణ మయిన నివేశముం గల్పించి, యందుఁ బెండ్లివారిని విడియించె, నంత నక్కడఁ గనక విశారమైన పీఠమ్ముపైఁ గూర్చున్న సమయమ్మున "దేవా! శుభముహూర్తం బాసన్న మగుచున్నది ర" మ్మని వసిష్ఠుండు సను దేర, నాతఁడు సని, రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులకు మంగళ

స్నానమ్ముఁ జేయించి, నిర్మ లాంబ రాభరణంబు లొసంగి, వేర్వేఱ నొక్క ముహూర్తమునఁ దన కూఁతు సీతను శ్రీరామచంద్రున కును, దన తమ్ముఁడు కుశధ్వజుని కూఁతు లగు మాండ వ్యూర్మిళా శ్రుతకీర్తులను భరత లక్ష్మణ శత్రుఘ్నులకును నిచ్చి, వివాహముం జేసి, తన ప్రియ తనయల కొక్కొకతెకు నూఱేసి భద్ర గజమ్ములను, వేయేసి తురంగంబులను, బదివేలు దాసీ జన మ్మును, లక్ష ధేనువులను నరణంబు లిచ్చి, దశరథాది రాజలోక మ్మునకు బహుమానమ్ముగా నవరత్న ఖచిత భూషణమ్ములను, జీని చీనాంబరమ్ములను నొసంగి, సుగంధ ద్రవ్యముల నర్పించి, పూజించి యంపె; నంత దశరథ మహారాజు మరలి యయోధ్యా పట్టణంబునకు వచ్చుచుండఁగా మధ్యే మార్గంబున, 83

దశరథరాముని గని పరశురాముని యధిక్షేపము

ఆ. పరశురాముఁ డడ్డుపడి వచ్చి, మీ నామ
మెవ్వ రనిన, మొలక నవ్వుతోడ
నేను దశరథుండ, నితఁడు నా పుత్త్రిండు,
రాముఁ డంద్రు పేరు, భీమ బలుఁడు. 84

వ. అని వినిపించినఁ గ్రోధావేశ వశంవదుండై యప్పు డప్పరశు రాముండు రాముం గనుంగొని యిట్లనియె: 85

క. రాముఁడు నేనై యుండఁగ
నామీఁద నొకండు గలిగెనా మఱి? యౌఁగా
కేమాయె, రణ మొనర్పఁగ
రామా! రమ్మనుచుఁ బరశురాముఁడు పిలిచెన్. 86

వ. పిలిచినతోడనే రామచంద్రుం డతని కిట్లనియె: 87

ఆ. బ్రాహ్మణుండ వీవు పరమ పవిత్రుండ
వదియుఁ గాక భార్గ వాన్వయుండ

వైన నిన్నుఁ దొడరి యాహవ స్థలమున
జగడ మాడ నాకుఁ దగునె చెపుమ? 88

వ. అనిన విని పరశురాముం డిట్లనియె: 89

ఉ. శస్త్రముఁ దాల్చినం దగనె? సన్నుతి కెక్కిన భార్గవుండనన్
శాస్త్రము గాదు, నా కెదిరి సంగర భూమిని నిల్చినంతనే
శస్త్ర ముఖంబులన్ నృపులఁ జక్కఁగఁ జేయుదుఁగాన నిప్పుడున్
శస్త్రము శాస్త్రముం గలవు సాహస వృత్తిని రమ్ము పోరఁగన్.

వ. అనిన రామచంద్రుం డిట్లనియె: 91

మ. విను, మావంటి నృపాలురైనఁ గలనన్ వీరత్వముం జూపఁగా
ననువౌఁగాక, మహానుభావుఁడవు, వి న్నాలంబులో మీఱఁగా
నెనయన్ ధర్మమె మాకుఁ జూడ? మఱి నీ వేమన్న నీ మాటకుం
గనలన్, బంతము కాదు మా కెపుడు దోర్గర్వంబు మీ పట్టునన్.

వ అనిన విని యెంతయు సంతోషించి భార్గవరాముం డా రఘురాము
నితో నిట్లనియె: 93

ఆ. శివుని చివుకు విల్లు శ్రీరామంబె యలనాఁడు
విఱిచినాఁడ ననుచు విఱ్ఱవీఁగ
వలదు, నేఁడు నాకు వశమైన యీ చాప
మెక్కుపెట్టి తివియు మింతె చాలు. 94

ఉ. రాముఁడు గీముఁ డంచును ధరా జనులెల్ల నుతింప దిట్టవై
భీముని చాపమున్ విఱిచి ప్రేలెద వందుల కేమిగాని, యీ
శ్రీ మహిశేశు కార్ముకముఁ జేకొని యెక్కిడుదేని నేఁడు నీ
తో మఱి పోరు సల్పి పడఁద్రోతు రణస్థలి నీ శరీరమున్. 95

## శ్రీరాముఁడు పరశురాముని నారాయణ చాపముతోఁగూడ విష్ణు తేజము నందికొనుట

చ. అని తన చేతివిల్లు నృపు లందఱుఁ జూడగ నంది యాయ, నా
ధనువునఁగూడి తేజముఁ బ్రతాపము రాముని జెందె, నంతనే
జనవరుఁ డా శరాసనముఁ జిక్కఁగ నెక్కిడి వాఁడి బాణ మం
దున నిడి యేది లక్ష్యమనఁ ద్రోవలు సూపినఁ ద్రుంచె గ్రక్కునన్.

వ. ఇట్లు మహా ప్రతాపంబున నా విలు ద్రుంచి, యనర్గళ ప్రతాపమ్మున భార్గవ రాము దోర్గర్వంబు నిర్గర్వంబు గావించి, జయమ్ముఁ గైకొన్న కుమారునిం గౌఁగిలించుకొని, దశరథుండు కుమార చతుష్టయమ్ముతో నయోధ్యా నగరంబుఁ బ్రవేశించి సుఖోన్నతి రాజ్యంబు నేలుచున్న సమయంబున, 97

శా. పారావార గభీరికిన్, ద్యుతి లస త్పద్మారికిన్, నిత్య వి
స్ఫారోదార విహారికిన్, సుజన రక్షా దక్ష దక్షారికిన్,
సారాచార విచారికిన్, మద రిపు క్ష్మాపాల సంహారికిన్,
వీరా సాటి నృపాలకుల్? దశర థోర్వీనాథ జంభారికిన్. 98

వ. అని కొనియాడఁ దగిన నృపాల శేఖరుఁడు ధర్మమార్గంబు నొక్కింత యేనిఁ దప్పకుండ రాజ్యంబు సేయుచుండె ననుట విని నారదుని వాల్మీకి మహా మునీశ్వరుం డట మీఁది కథా విధానం బెట్టిదని యడుగుటయు. 99

### ఆశ్వాసాంత పద్య గద్యములు

క. జలజాక్ష! భ క్త వత్సల!
జలజాసన వినుత పాద జలజాత! సుధా

జలరాశి భవ్య మందిర
జలజాకర చారు హంస! జానకి నాథా! 100

గద్యము.

ఇది శ్రీ గౌరీశ్వర వరప్రసాద లబ్ధ గురు జంగమార్చన వినోద
సూరి జన వినుత కవితా చమత్కార రాతుకూరి కేసనసెట్టి
తనయ మొల్ల నామధేయ విరచితంబైన
శ్రీ రామాయణ మహాకావ్యంబునందు
బాలకాండము సర్వము
నేకాశ్వాసము.

శ్రీ

# రామాయణము

## అయోధ్యాకాండము

[శ్రీరామునకుఁ బట్టాభిషేక సన్నాహము - సూర్యాస్తమయ వర్ణనము - చంద్రోదయ వర్ణనము - ప్రభాత వర్ణనము - రాముని గానలకుఁ బంపుటకై కైక పన్నాగము - సీతా లక్ష్మణులతో శ్రీరాముని యటవీ నిర్గమనము - గుహాని ప్రపత్తి - భరద్వాజ ముని యాదరాతిథ్యము - భరతుని భ్రాతృ భక్తి - శ్రీ పాదుకా ప్రదానము - విరాధ వధ - ఆశ్వాసాంత పద్య గద్యములు.]

క. కందర్ప రూప! ఖండిత
కందర్ప విరోధి చాప! కరుణా దీపా!
వందిత శుభ నామా! ముని
సందోహ స్తుత్య ధామ! జానకి రామా! 1

వ. శ్రీ నారద మునీశ్వరుండు వాల్మీకి మహాముని కెఱింగించిన తెలుంగు వినిపించెద నాకర్ణింపుము: 2

### శ్రీరామునకుఁ బట్టాభిషేక సన్నాహము

సీ. తన సుమంత్రాది ప్రధానులతోఁ గూడి
సుఖ గోష్ఠి నుండంగ నఖిల మునులఁ
జక్కఁగా రావించి, సమ్మదంబున వంశ
గురువుతో దశరథ ధరణినాథుఁ
డనియె: నీ భూ భార మంతయు నొక్కట
నేలితిఁ జాలదే యేక హేళి?
నటుగాక పగతుర నవలీల గెల్చితి,
నిల్పితి ధర్మమ్ము నిషతోడ

తే. ఇంత చాలదె? యాశకు నెంత కెంత?
రామచంద్రుని ధరణికి రాజు గాఁగ
మీరు సూడంగఁ బట్టంబు భూరి మహిమఁ
గట్టవలయును మంచి లగ్నమునఁ జెలఁగి. 3

తే. అనుచు గురునకుఁ దెల్పి, తా నతని సమ్మ
తమున సౌభాగ్య మంగళ ద్రవ్య సమితిఁ
గూర్చుఁ డనుచును మంత్రులకును నెఱుంగఁ
జెప్పి, శృంగార మీ పురిఁ జేయుఁ డనియె. 4

వ. అట్టి సమయంబున. 5

### సూర్యాస్తమయ వర్ణనము

తే. పగలు ప్రాగ్భాగమున నుండి గగన వీథిఁ
చరమ దిక్కున కేఁగఁగా శ్రమము దోఁచి
చెమట పట్టిన స్నానంబుఁ జేయ నరుగు
కరణి, నప రాబ్ధిలో దివాకరుఁడు గ్రుంకె. 6

క. మేలిమి సంధ్యా రాగము
వ్రాలిన చీఁకటియుఁ గలిపి వరుణుని వంకన్
నీలముఁ గెంపును నతికిన
పోలికఁ జూపట్టె నట నభో మణి తలఁగన్. 7

క. వారక కల్ప ద్రుమమునఁ
గోరకములు పుట్టినట్లు గురుతర కాంతిన్
దారకములు తలసూపెన్
జోరానీకమ్ము మిగుల స్రుక్కుచు నుండన్. 8

ఆ. కారు మొగులు రీతిఁ, గాటుక చందాన,
నీటి భాతి, నింద్ర నీల మహిమ,
మాష రాశి పోల్కి, మఱి మఱి యపు డంధ
కార మవని యెల్లఁ గలయఁ బర్వె. 9

వ. అట్టి సమయంబున. 10

చ. తలవరులన్, నిజాధిపుల, దర్పకు నేర్పునఁ గన్నుఁ ద్రామి, య
త్తలఁ, దమ పిన్నపాపల, నుదారత నేర్పడ నిద్రపుచ్చి, వి
ర్మల కర కంకణావళులు, మట్టెలు రట్టుగ మ్రోఁగనీక, వి
చ్చలవిడిగాఁ జరించి రొగి జార లతాంగులు మధ్య రాత్రులన్.

చ. సురతము లేక యుస్సురను జోటి. మగం డుడికిందు కాంతయున్,
సరస మెఱుంగు చంద్రముఖి, సావడి దంటయు, బేరకత్తెయున్,
బర పురు షాభిలాషమును బాయని భామిని, పోరుకట్టునన్
బరఁగిన భామ లాది యుపభర్తలఁ గూడి చరించి రత్తఱిన్. 12

## చంద్రోదయ వర్ణనము

ఉ. భాను సహస్ర సత్కిరణ పంక్తుల నుద్భవ మైన యా బృహ
ద్భానుని వెట్టఁ బెల్లడుకఁ బడ్డ సుధాంబుధి మీఁది మీఁగడల్
పూని సమీరుచేఁ దెరలఁ బూర్వ దిశం గనుపట్ట దానిపై
ఫేన మనంగ నొప్పె శశి బింబము తూరుపుఁ గొండపైఁ దగన్.

చ. కుముదములుం, జకోరములుఁ, గోమల సస్యముఁ, జంద్రకాంత [ముల్
రమణఁ జెలంగ వెన్నెల తిరంబుగఁ జేసె జగంబు లబ్బఁగాఁ,
గమలములున్, వియోగు, లధికంబుగఁ జోరులుఁ, జక్రవాకముల్
రమణఁ గలంగ వెన్నెల తిరంబుగఁ గాచె జగంబు లబ్బఁగాన్.

ఉ. నారదు లైరి సన్మునులు, నాక మహీజము లయ్యె భూజముల్,
శారద లైరి భామినులు, శంకర శైలము లయ్యె గోత్రముల్,
పారద మయ్యె నీరధులు, పన్నగ నాయకు లైరి నాగముల్,
వారిద వర్గ మెల్ల సిత వర్ణము లయ్యెను బందు వెన్నెలన్. 15

చ. కొడు కుదయించె నం చలరి కోరి సుధాంబుధి మిన్ను ముట్టి. య
ప్పుడు జగమెల్లఁ గప్పె ననఁ బూర్ణత నొందెను సాంద్ర చంద్రికల్

పుడమికిఁ బాలవెల్లి గతిఁ బొల్పెసలారఁగఁ జంద్రుఁ డొప్పె. న
య్యుడుపతి మేని మచ్చయను నొప్పెఁ బయోనిధిఁ బద్మనాభుఁడై.

వ. అట్టి సమయంబున, 17

ఉ. కోరి చకోర దంపతులు గుంపులు గుంపులు గూడి, రంతులన్
బేరిన చంద్రికా రసముఁ బేర్కొని మార్కొని పొట్ట నిండగాఁ
బారణ సేసి, పెన్‌బయలఁ బ్రాఁకుచుఁ, జంచు పుటంబు లెత్తుచున్
బేరెము వారుచుండె మదిఁ బ్రేమ జనింప వధూటి కోటికిన్. 18

ఉ. వెన్నెల తీఁగలన్ గొనలు వేడుక ముక్కులఁ ద్రుంచి తెచ్చి, తా
ర్కొన్న ప్రియాంగనా తతికిఁ గూరిమి నోరికి నిచ్చి, కేళికిన్
సన్నపుఁ గంఠ నాళముల సన్నలు సేసి సుఖించె నింపుగన్
దిన్నని చంద్రకాంత మణి తిన్నెలమీఁదఁ జకోర దంపతుల్. 19

## ప్రభాత వర్ణనము

తే. పాకశాసని చేమంతి బంతి దివికి
నెగుర వైచిన కైవడి నేమి చెప్పఁ
బండు పర్ణంబుతోఁ బూర్వ భాగ సీమ
సొంపు మీఱఁగ వేగురుఁజుక్క వాడిచె. 20

వ. అట్టి సమయంబున, 21

క. రవి చనుదెంచెను జనుఁడీ
దివియలు, నక్షత్ర సమితి, తిమిరము, శశియున్
బవ లేమిటి? కను రీతిని
గువలయమున గూళ్ళఁ గోళ్లు గూయఁగ సాఁగెన్. 22

చ. వదలక పద్మరాగ మణి వజ్రపుఁ దర్మెనఁ బట్టి నేర్పు పెం
పొదవఁగఁ దూర్పు కొండపయి కొప్పుగఁ దెచ్చి జగ ద్గురుండు దాఁ
ద్రిదశవరేణ్యు కట్టెదురఁ దేఁకువ నిల్పిన దర్పణంబు నా
నుదయము నొందె భానుఁడు సముజ్జ్వల కోకనద ప్రదీప్తులన్. 23

వ. ఆ రాత్రి రాజశేఖరుని చిత్తంబు వచ్చునట్టుగా మెలంగి, యాతఁడు
దన్ను మెచ్చు టెఱింగి, కైక యిట్లనియె: 24

రాముని గానలకుఁ బంపుటకై కైక పన్నాగము

ఆ. వసుమతీశ! నాకు వర మిచ్చి తప్పుట
తగవు గాదు మీకుఁ, దలఁపులోన
మఱచినా రదేమొ, మన్నించి తొల్లింటి
యీవు లీయవలయు నీ క్షణంబ. 25

క. జననాథ! నా కుమారుని
వినుఁడీ పట్టంబు గట్టి వేవేగను, రా
ముని మునిగా ననుపుఁడు మఱి
వనమునఁ బదునాలుగేండ్లు వర్తింపంగన్. 26

వ. అని ప్రార్థించిన విని పార్థివేంద్రుఁడు డిల్లపడి తల్లడిల్లుచు
నుల్లంబు గలంగి ముసుంగిడి యచ్చేడియ పలికిన పలుకులకు
మాఱాడ నోడి మిన్నక యున్న సమయంబున, సుమంత్రుం
డేతెంచి 'స్వామీ! రామచంద్రుని బట్టంబు గట్ట సుముహూర్తం
బాసన్నం బయ్యెఁ గావున మిమ్ము నచ్చటికి విచ్చేయ నవ
ధరింపుఁ'డని వశిష్ఠ భగవానుండు విన్నవించు మని పంపె నని
చెప్పిన కైక యిట్లనియె: 27

మ. అనిలో మున్ను నృపాలు చిత్తమున కే నాహ్లాదముం గూర్చి, నా
తనయుం బట్టము గట్టి, రాఘవుని బద్నాల్గేండ్లు కాంతారమం
దును వర్తిల్లఁగఁ బంపఁగొన్న వరమున్ ద్రోయంగరా దెంతయున్
వనసీమన్ ముని వృత్తి నుండు మనుఁడీ వైళంబ యా రామునిన్

క. అని పలుకు కైక పలుకులు
విని వేగమ మరల వచ్చి విన్నఁదనంబున్
దనుక వశిష్ఠునితోడన్
వినుపించె సుమంత్రుఁ డట్టి విధ మేర్పడఁగన్. 29

## సీతా లక్ష్మణులతో శ్రీరాముని యటవీ నిర్గమనము

వ. అనిన విని వశిష్ఠాది ప్రముఖులును, సుమంత్రాది ప్రధాన జనంబులును, సైన్యంబులును, బరివారంబులును విన్ననై యున్న నా సన్న యెఱింగి, రామచంద్రుండు రాజ చిహ్నంబులు త్యజించి, జటా విభూతి వల్కలంబులు దాల్చి, ధనుర్ధరుండై యున్నంత ; లక్ష్మణుండును భూ పుత్త్రికయును దోడం జనుదేరఁ, దల్లులకు నమస్కరించి, వశిష్ఠానుమతంబున నాశీర్వచనంబులు గైకొని, యాస్థానంబు వెలువడి యరణ్యంబున కరుగునప్పుడు పుర జను లందఱును బురపురం బొక్కుచు, దశరథ మహారాజును దూషించుచుఁ, గైకను నిందించుచు, మూఁకలై శోకించుచుండ ; నది యంతయు విని దశరథుండు పురోహి తామాత్య బంధు వర్గంబులతో శ్రీరామచంద్రుఁ దేఁగిన త్రోవం జన్నంత ; నా రాముఁడు దూరంబునం జనియె, దశరథుండును మరలి వచ్చి పుత్త్రి శోకంబున నాక పురంబునకుం జనియెఁ ద దనంతరంబ,

### గుహుని ప్రపత్తి

ఆ. చనుచు రాఘవుండు స్వర్ణది యొద్దున
గుహుని గాంచి యతనిఁ గుస్తరించి
తడయ కోడఁ బెట్టి దాఁటింపు మనవుడు
నట్ల చేయఁ దఁలచి యాత్మలోన. 31

క. 'సుడిగొని రాము పాదములు సోఁకిన ధూళి వహించి రాయి యే
ర్పడ నొక కాంత యయ్యె నఁట, పన్నుగ నీతని పాద రేణు వి
య్యెడ వడి నోడ సోఁక నిది యేమగునో' యని సంశయాత్ముఁడై
కడిగె గుహుండు రామ పద కంజ యుగమ్ము భయమ్ము పెంపునన్,

వ. ఇట్లు శ్రీరామచంద్రుని శ్రీపాదంబుల నీటఁ గడిగి, యోడపై నెక్కించి, య మ్మువ్వుర నవ్వలికి దాఁటించిన నా క్షణంబ. 33

## భరద్వాజ ముని యాద రాతిథ్యము

ఉ. రాజ కులావతంసుఁ డగు రాముఁడు తమ్ముఁడుఁ దాను నా భర
ద్వాజ మహా మునీంద్రు పద వారిజముల్ గని మ్రొక్క, నాతఁ డం
భోజ హితాన్వ యాబ్ధి పరిపూర్ణ సుధాకరుఁ డైన రాముని
బూజ లొనర్చి కంద ఫల మూలములం బరితృప్తుఁ జేసినన్, 34

వ. సంతసించుచు నా రాత్రి యచ్చట నివసించి మఱునటి దిన
మరోకోదయమ్మున. 35

ఆ. ముదముతోడఁ దన్ను ముని భరద్వాజుండు
భక్తి ననుప, రామభద్రుఁ డంతఁ
జనియె భ్రాతృ దార సహితుఁడై సన్ముని
కూటమునకుఁ జిత్రకూటమునకు. 36

## భరతుని భ్రాతృ భక్తి

మ. ఘనుఁ డా రాముఁడు చిత్రకూటమున వేడ్కంజేరి యున్నంతలో
నన, దంతావళ వాజిరత్న రథ నానా యోధ సంఘంబుతో
డ, నమాత్య ద్విజ బంధు వర్గములతోడం గూడి వాద్యంబులం
జనుదెంచెన్ భరతుండు రాముకడకున్ సద్భక్తి సంపన్నుఁడై.

సీ. చనుదెంచి, రాముని చరణంబులకు మ్రొక్కి,
కైకేయి చేసిన కపటమునకు
నగరంబు విడిచి, యీ పగిది ఘోరారణ్య
మున కిట్లు రానేల మునుల పగిది?
నది గాక, మన తండ్రి యత్యంత మైనట్టి
పుత్త్రి శోకంబునఁ బొక్కి బొక్కి
త్రిద శాలయమ్మున దేవేంద్రుఁ గనఁబోయె,
నని చెప్ప విని రాముఁ డంతలోన

తే. భరత లక్ష్మణ శత్రుఘ్న ధరణి సుతలఁ
గూడి దుఃఖించి దుఃఖించి, కొంత వడికి

నా ప్త వర్గంబుచే మానె. నంతమీఁద
భరతుఁ డిట్లనె శ్రీరామభద్రుతోడ: 38

తే. "రాజు లేకున్నచో మఱి రాష్ట్రమందుఁ
గార్య మెట్లౌను? మీ రెఱుంగనిది కలదె?
నేఁటి సమయానఁ బట్టంబు నిలుపుకొనఁగఁ
దిరిగి విచ్చేయుఁ" డనుడు నా భరతుతోడ. 39

వ. శ్రీరామచంద్రుం డిట్లనియె: 40

## శ్రీ పాదుకా ప్రదానము

చ. జనకుఁడు సేసినట్టి మితిఁ జక్కఁగఁ దీర్చి, కడంక నేను వ
చ్చిన గుఱిదాఁక, భూతలముఁ జేకొని రాజ్యముఁ జేయు. మాట గా
దనకు మటన్న, నొల్లనన. నాతనికిం దన పాదుకా యుగం
బొనరఁగ నిచ్చి పొమ్మనుచు నుర్వికి రాజుగఁ బంచె సొంపుగన్.

## విరాధ వధ

వ. ఇట్లు భరతుని భరతాగ్రజుం డనునయించి మరలించి, నాకలోక కవాటం బగు చిత్రకూటంబు కదలి సౌమిత్రి భూ పుత్రులం గూడి పోవు నెడ, నటవీ మధ్యంబున విరాధుం డను దైత్యాధముం డప రాధంబు చేసి, దిగ్గన డగ్గఱి జగతీ తనూభవ నెత్తుకొని గగన మార్గంబున కెగిరిపోవునెడ వాఁడి బాణంబున వాని కంఠంబును ద్రుంచి, గారుడాస్త్రంబున మరల నొయ్యన జనక నందనం డించి, భయంబు వాపి, ప్రియంబు సూపి, యొయ్య నొయ్యన నయ్యెడ నున్న యత్రి మహా ముని యాశ్రమంబునకుం జని, ఘనంబున నా ఘనుండు సేయు పూజలం గైకొని, రామచంద్రుం డచ్చటి మునీంద్రులకు దైత్యులవలని భయంబు లేకుండ నభయం బిచ్చి, మన్ననం గొన్ని దినంబు లాయా మునుల యాశ్రమంబుల నిలు చుచు, వార లనుప శరభాది మృగోత్కర శరణ్యంబగు నర

ణ్యంబుఁ జొచ్చి పోయె నని చెప్పిన విని నారదుని వాల్మీకి మునీంద్రుం డటుమీఁది కథా విధానం బెట్టిదని యడుగుటయు. 42

## ఆశ్వాసాంత పద్య గద్యములు

క. జలజాక్ష! భక్త వత్సల!
జలజాసన వినుత పాద జలజాత! సుధా
జలరాశి భవ్య మందిర
జలజాకర చారు హంస! జానకి నాథా! 43

## గ ద్య ము

ఇది శ్రీ గౌరీశ్వర వర ప్రసాద లబ్ధ గురు జంగ మార్చన వినోద సూరిజన వినుత కవితా చమత్కార ఆతుకూరి కేసనసెట్టి తనయ మొల్ల నామధేయ విరచితంబైన శ్రీ రామాయణ మహా కావ్యంబునం దయోధ్యా కాండము సర్వము నేకాశ్వాసము.

శ్రీ

# రామాయణము

## అరణ్యకాండము

[పంచవటిలో సీతారాముల మధుర జీవనము - చుప్పనాక రామ లక్ష్మణుల మోహించి పరాభూతురాలగుట - ఖర దూషణాది రాక్షస సంహారము - శూర్పణఖవలన సీతా సౌందర్యమును విన్న రావణుని కామాంధత - రాముఁడు బంగారు జింకను వెన్నంటి తరుముట - రావణుఁడు సన్న్యాసి వేషమున సీత నపహరించుట - రావణుని నిరోధించిన జటాయువు- సీతను గానని శ్రీరామచంద్రుని విరహాతిశయము - శ్రీరామునికి లక్ష్మణుని సాంత్వనము - జటాయువు రామునకు రావణుని దుశ్చేష్టను దెలుపుట - శబరి మధుర భక్తి - ఆశ్వాసాంత పద్య గద్యములు.]

క. ముని దత్త ధను ర్వేదా।
మునినాథ ప్రియ సతీ సుపూజిత పాదా।
జన కార్చిత గుణ ధామా।
సనకాది స్తవ్య నామ। జానకి రామా। 1

వ. శ్రీ నారద మునీశ్వరుండు వాల్మీకి కెఱింగించిన తెఱంగు విని పించెద: 2

### పంచవటిలో సీతా రాముల మధుర జీవనము

చ. "ఇతనికిఁ బాదచారితన మేటికి వచ్చెనొ? పట్టభద్రుఁ, డీ
సతి నన రూప రేఖలను జక్కని దయ్యును నిట్టి దుర్దశల్
ప్రతివసియించు టెట్లొ? రతిరాజ సమానుల వీరి నేల యీ
గతిఁ బడఁద్రోచె బ్రహ్మ?" యని కాంతురు చెంచెత లమ్మహా
[త్ములన్. 3

సీ. నడువనేరని కొమ్మ యడుగులు పొక్కులై
శర్కర స్థలముల శ్రమముఁ జెందె,
వీచిన చేతుల వ్రేళ్ళు నెత్తురు గ్రమ్మి
పొటమర్లు కెంపుల పోల్కి నమరె,
వడి గాలి సుడివడి వాడిన లేఁ దీఁగ
బావంబునను మేని చేవ తఱిగెఁ,
బూర్ణ చంద్రుని కాంతి పున్నమ వేకువఁ
గనుపట్టు గతి మోము కళల విడిచె,

తే. ధవుని నడుగడుగునకుఁ గై దండఁ గొనుచు,
నెగడు దప్పిని నిట్టూర్పు లెగసి చిగురుఁ
బెదవు లెండఁగ, నీడకు నుదిలగొనుచు,
మనసులోఁ జేవ యూఁతగఁ జనెదు వేళ. 4

వ. ఇట్లా సీతయు రాముండును సత్యఋషిం బోని సౌమిత్రియుఁ
గతిపయ ప్రయాణంబులఁ బంచవటికిం జని, సంతోష భరితాంత
రంగులై. 5

క. అచ్చటఁ గొన్ని దినంబులు
ముచ్చటపడి యుండఁ దలఁచి ముని ముఖ్యులచే
మచ్చికఁ దమ్ముఁడుఁ దానును
గ్రచ్చుల నొక పర్ణశాలఁ గావించి తగన్. 6

ఆ. అందు రామచంద్రుఁ డనుజన్ముఁడును దాను
గొన్ని వాసరంబు లున్న వేళ
వికృత వేషధారి వేవేగ నట శూర్ప
ణఖ యనంగ దైత్య నారి యొర్తు. 7

శూర్పణఖ రామలక్ష్మణుల మోహించి పరాభూతురాలగుట

వ. రాముని గని ప్రేమాభిరామం బగు మనంబునఁ దన్నుఁ గామించి
రమ్మనిన, రామచంద్రుండు సౌమిత్రిం జూప, నతఁడు మున్ను

మా యన్న నభిలషించుటంజేసి నాకు దోషంబు గాన నీ వా
రాముని కడకు మరలఁ జనుమన్న నది యట్లచేసిన, రామచం
ద్రుండు తిరుగ లక్ష్మణుం జూపినఁ గోపించి యా రాక్షసి మను
జేంద్ర సూనుల దండింపం దలంచిన నెఱింగి, భర తానుజుండు
దాని నాసికా కర్ణంబులు గోసివైచిన నది నెత్తురు జొత్తిల్లఁ బసి
పాపయుం బోలి యేడ్చుచు ఖర దూషణాది సోదరులకుం జెప్పిన
వారు గనలి రా క్షణంబున. 8

క. పదునాల్గు వేల దైత్యులు
మదమున సోదరులు గొల్వ మండుచు ఘోరా
స్పద మగు రథ నికరముతోఁ
గదసంబున రాము కడకు ఖరుఁ డేఁతెంచెన్. 9

ఖర దూషణాది రాక్షస సంహారము

ఆ. ఖరుఁడు వచ్చినట్టి కలకలం బాలించి,
రాఘవుండు తనదు రమణియొద్దఁ
దొలఁగ కుండ ననుజుఁ దోడుగాఁ గాఁపుంచి,
బెదర కంతఁ గలని కెదిరి నిలిచె. 10

శా. ఆ వేళన్ ఖరుఁ డుగ్రవృత్తి లయ కాలాభీల ఘో రాకృతుల్
దైవారన్, గజ వాజి సంఘములతో, దైత్యాళితో, భూరి రో
షావిర్భూత మనస్కుఁడై నడిచె గర్వారంభ సంరంభుఁడై
దేవ వ్రాతము భీతి నొంది కలఁగన్ దేజంబు సొంపారఁగన్. 11

వ. ఇట్లు ఖరుండు సనుదెంచి భయంకరంబుగా రణంబు సేయు
సమయంబున, 12

ఉ. అప్పుడు రామచంద్రుఁడు భయంకర రౌద్ర రసంబు కన్నులన్
నిప్పులు రాల్చుచున్ నెరయ, నిర్జరు లార్వ, విచిత్ర శస్త్రముల్
కుప్పలు గాఁగ సేయుచును, గుంజర వాజి రథావళుల్ ధరన్
దప్పక కూల్చుచున్, రుధిర ధారలఁ దేల్చె సురారి సంఘమున్.

వ. అట్టి సమయంబున, 14

క. కరి తురగ స్యందనములఁ
బరివారముఁ దెగిన పిదపఁ బటు రోషమునన్
గరకర పడుచును నెదిరిన
ఖర కర వంశజుఁడు ద్రుంచె ఖరుని శిరంబున్. 15

వ. త్రుంచినం గని తీంద్రంబుగా, 16

క. ఘోషించి, రామచంద్రుని
దూషించుచు వచ్చినట్టి దూషణు మీఁదన్
రోషించి, సురలు కడు సం
తోషింపఁగ వాని కరముఁ ద్రుంచెఁ గడంకన్. 17

ఆ. త్రిశిరుఁ డంతఁ గనలి దివ్యాస్త్ర సంపద
రాముమీఁదఁ జూపి రణ మొనర్చె,
మూఁడు శరము లతఁడు ముదలించి యట వాని
మూఁడు తలలఁ ద్రుంచె మొగ్గరమున. 18

వ. ఇట్లు ఖరాది రాక్షసుల శిక్షించి, జయంబు గొని, ధను వెక్కు-
డించి, మరలి పర్ణశాల కేతెంచి, తమ్ముఁడును దానును సమ్మదం
బునం గలిసియున్న సమయంబున; 19

## శూర్పణఖవలన సీతా సౌందర్యమును విన్న రావణుని కామాంధత

చ. చలమున వంత శూర్పణఖ సయ్యన లంకకు నేఁగి, రావణుం
గొలువునఁ గాంచి మ్రొక్కి-. తనకున్ నృపసూనులు సేసినట్టి చేఁ
తలు వినుపించి, వారు తమ తండ్రి యనుజ్ఞను వచ్చి, కానలో
పలఁ దిరుగాడు చందములఁ బన్నుగ నేర్పడఁ జెప్పి పిమ్మటన్,

క. ఆ రాము భార్య విభ్రమ
మే రాజకుమా ర్తెలందు నెఱుఁగము విను మున్

ధారుణిలోపలఁ గామిను
లా రమణికి సాటి పోల రభినుతి సేయన్. 21

సీ. కన్నులు కలువలో? కాము బాణంబులో?
తెలివిగా నింతికిఁ దెలియరాదు.
పలుకులు కిన్నెర పలుకులో? చిలుకల
పలుకులో? నాతి కేర్పఱుపరాదు,
అమృతాంశు బింబమో? యద్దమో? నెమ్మోము
తెంపుతో సతికి భావింపరాదు,
కుచములు బంగారు కుండలో? చక్రవా
కమ్ములో? చెలి కెఱుఁగంగరాదు,

తే. కురులు నీలంబులో? తేఁటి గుంపు లొక్కొ?
పిఱుఁదు పులినంబొ? మన్మథు పెండ్లి యరుఁగొ?
యనుచుఁ గొందఱు సంశయం బందుచుండ
వెలఁది యొప్పారు లావణ్య విభ్రమముల. 22

క. కలదో! లేదో! యనుచును
బలుమఱు నెన్నడుముఁ జూచి పలుకుదు రితరుల్.
బలిమో! కలిమో! యనుచును
బలుమఱు జఘనంబుఁ జూచి పలుకుదు రితరుల్. 23

సీ. షట్పదంబుల పైకి సంపెంగ పువ్వుల,
జలజాతముల పైకిఁ జందమామఁ,
గిసలయంబుల పైకి వెసఁ గలకంఠముల్,
సింధురమ్ముల పైకి సింహములను,
దొండపండుల పైకి దొడ్డ రాచిలుకల,
నలరుఁ దూఁడుల పైకి నంచ పిండుఁ,
బండు వెన్నెల నిగ్గు పైకిఁ జకోరముల్,
పవనంబు మీఁదికిఁ బాపవేని,

తే. మరుఁడు వైరంబు చేసిన మాడ్కి, నలక
నాసికా కరానన చరణ స్వనములు
వర పయోధర మ ధ్యోష్ఠ వచన బాహు
గమన హా సాక్షు లూ ర్వారు రమణి కమరె. 24

క. బంగారు నీరు నిలువునఁ
బొంగారుచు నుండ నజుఁడు వోసిన మాడ్కిన్,
శృంగార మెల్ల నిలువునఁ
బొంగారుచు నుండుఁ గరఁగి పోసిన మాడ్కిన్. 25

వ. అట్టి వయో రూపంబులను గనుపట్టునట్టి య క్కాంతా రత్నంబు నీకు సిద్ధించె నేని నీవు త్రి భువనంబులు విజయంబు చేసిన యంత కన్నను సంతసింతువన్న విని, కా మాశుగంబులం దగిలి, కామాంధుండై కన్నులు గానక యన్నుకొని తన్నుఁ దా మఱచి, యొడ్డోలగంబు సాలించి, పుష్పకం బను విమాన రత్నంబుపై నధిష్ఠించి, మారీచు కడకుం జని, ప్రార్థించి, 'నీవు కనక మృగంబవై జనస్థానంబునకుం జని, దశరథ నందనుండగు శ్రీరాముం డున్న పర్ణశాల కడం బొడకట్టిన, నతండును నిన్ను వెనుకొను. నీవు నతని నతిదూరంబుగాఁ గొనిపోయి మాయంబైన, నేను రాముని భార్యం గొనివత్తు' ననిన విని సమ్మతిలక మాఱుత్తరం బిచ్చిన, రావణుం డుగ్రుండై మండిపడ, నతం డా సన్న యెఱింగి, కనక మృగ రూపంబును దాల్చె. నా క్షణంబున; 26

క. ఒడ లెల్లను బంగారము,
పొడ లెల్లను రత్న సమితిఁ బోలిన మెఱపుల్
నడ లెల్ల నెఱపి మెలఁగెడు
కడ లెల్ల విలాస రేఖ కళలం దొప్పెన్. 27

వ. ఇట్లు కనక మృ గాకారంబు గైకొని పర్ణశాల కడకుం బోయి మెలంగునప్పుడు, 28

క. కనియును వినియును నెఱుఁగము
కనక మృగం, బనుచు వేడ్క గడలుకొనంగన్
గనఁగ, మృగం బద్భుత మిది
కనక మృగం, బేమి సేయఁగలదో మీఁదన్. 29

వ. అని కనుగొన్న ముని జనంబులు మనంబులం దలంకుచెడ, నా మృగంబును మృగనేత్ర యగు ధాత్రీ పుత్రి గని దాని నభిలషించిన, నా సన్న యెఱింగి సౌమిత్రిని భూమిజకుం దోడిడి, శ్రీరామ చంద్రుండు దాని వెనుకొని చనుచున్న యవసరమ్మున; 30

రాముఁడు బంగారు జింకను వెన్నంటి తరుముట

సీ. తనుఁ బట్టనొయ్యన వెనుకొని చనుదెంచు
నిల జేని తలఁపుఁ దాఁ దెలిపి తెలిపి,
చేరువ మెలఁగుచుఁ బూరి మేయుచు దాపి
మెల్లన యంతంత మెలఁగి మెలఁగి,
తన నీడఁ గనుగొని తానె దిగ్గన దాఁటి
భయమునఁ బరువెత్తి పఱచి పఱచి,
యెడరైనఁ బోవక యెలయించి కనుగొన్నఁ
దరువుల నొయ్యన నొరసి యొరసి,

తే. చెవులు నిక్కించి చూచుచుఁ, జెలఁగి చెలఁగి
పోవ, రాముండు దవ్వుగాఁ బోయి పోయి,
యెలమి మాయా మృగం బని యెఱిఁగి మదిని,
దీనిఁ జంపుదుఁగా కని తెగువ చేసి, 31

క. ఏచిన కినుకను బలు నా
రాచము సంధించి డాసి రాఘవుఁ డా మా
రీచుని దైత్యాధముఁ గుల
నీచుని గూలంగ నేసె నిర్జరు లలరన్. 32

వ. వాఁడునుం గూలు నవ్వేళ "హా! లక్ష్మణా!" యను రవంబుం జేసిన నా ధ్వని విని జనక నందన మనంబున నులికి లక్ష్మణుం బిలిచి 'మీ యన్న కేమి కీడు వాటిల్లెనో కాని నిన్నుఁ దలంచె, నీవునుం బోయి మీ యన్న కుశల స్థితిం దెలిసికొని ర'మ్మనిన నతండు తలంకక నామెతో నిట్లనియె: 33

ఉ. ఏమిటి కింత భీతి మది? నీ వగ తోఁచుట యేమి నీకు? నో
భామిని! రామునందు నొక భారము చెందదు. చెందెనేనియున్
భూమి వడంకదే? నభము బోరన మ్రోయదే? వార్ధు లింక వే?
తామరసాప్త [1]బింబము సుధాకర బింబము నేల దుల్ల వే?

ఉ. అంత ప నయ్యెనేని. దను జాంతకు, నంతకు, మన్మథాంతకున్
బంతము మీఱఁగాఁ గలఁచి, పన్నగ మర్త్య సురేంద్ర లోకముల్
బంతులు గట్టి యూడ్చి, రిపు భంజను రాముని గందకుండ న
ర్పింతును నీకుఁ దెచ్చి, మది భీతిని బొందకు మమ్మ జానకీ! 35

వ. అని లక్ష్మణుండు పలికిన విని, జనక రాజ నందన కినిసి, వినరాని మాటలం దూలనాడిన, మనంబునం గంది కుందుచు, శ్రీరామ చంద్రుం డేఁగిన మార్గంబునన చనియె; నంత నిక్కడ, 36

రావణుఁడు సన్న్యాసి వేషమున సీత నపహరించుట

క. సన్న్యాసి వేష మలరఁగ
నన్యాయము తలఁచుకొనుచు నసురేంద్రుఁడు దాఁ
గన్యా రత్నముఁ గని [2]సౌ
జన్యమునన దీవన లిడె శాంతము దోఁపన్. 37

క. దీవించుడు, మునియే యని
భావింపుచుఁ జేర వచ్చు భామిని, నపు డా
రావణుఁడు రథము మీఁదికి
పే వేగమ తిగిచి గగన వీథిని జనియెన్. 38

1. సోమగ్రహ తారక లెల్లను; 2 సౌజన్యత నాశీర్వదించె

వ. ఆ య్యవసరంబున. 39

ఆ. అసుర గొంచుఁ బోవ నవనీ తనూభవ
వెలచి పలికె దిశలు వినఁగ నంత
"సీత నాదు పేరు, శ్రీరాము భార్యను
నన్నుఁ గావరయ్య మిన్న కిపుడు". 40

వ. అవి మఱియును. 41

ఆ. "దేవ గణములార! దిక్పాల వరులార!
వృక్ష జాతులార! పక్షులార!
కుటిల దానవుండు గొంపోవుచున్నాఁడు
కరుణతోడ నన్నుఁ గావరయ్య!" 42

రావణుని నిరోధించిన జటాయువు

ఆ. అనుచుఁ బలుకుచున్న నా యార్త నాదంబు
విని జటాయు వనెడి విహగ నాథుఁ
డరుగుదెంచి, కలహ మత్యుగ్రముగఁ జేయ
రావణుండుఁ బక్షి రాజుఁ దాకెఁ. 43

చ. అసుర విభుండు పైచు నిశి తాగ్ర ముఖంబుల నొచ్చి, పక్షియున్
గొసరక దైత్య నాయకుని గుండెను నొవ్వఁగఁ దన్న, నంతలోఁ
గసరి నిశాచరుండు కర ఖడ్గముఁ ద్రిప్పుచు బక్ష యుగ్మమున్
వసుధఁ బడంగఁ ద్రుంచి, కడు వైళమ లంకకు నేఁగు నత్తఱిన్.

క. వనచరు లొక గిరి చేరువ
వనమునఁ జరియింపఁ జూచి వసుధా సుతయున్
దన చీర కొంగు తునుకను
దన సొమ్ములు మూట గట్టి ధరపై వైచెన్. 45

క. అంతట దైత్యుఁడు లంకకుఁ
బంతముతో నేఁగి శింశుపా తరు క్రిందన్

సంతసమున నిడి, దానవ
కాంతల నవనిజకుఁ దోడు కావలి యుంచెన్. 46

ఉ. అత్తటి రాఘవుండు తను నాసలఁ బెట్టుచుఁ గొంచుఁ బోవఁగాఁ
జిత్తము నొచ్చి, యా మృగము శీఘ్రమునం బడనేసి, దాని మై
తిత్తిగఁ దీసి వింటి కొనఁ దెచ్చెడి వేళఁ, బయోజ మిత్ర వం
శోత్తముఁ డుల్కఁ, గానఁబడె నొక్కెడ లక్ష్మణుఁ డన్న దృష్టికిన్

చ. పొడగని గుండె ఝల్లుమన బుద్ధిఁ గలంగుచు రామచంద్రుఁ డ
య్యెడఁ గడు నుగ్రుఁడై పలికె "నీ విటు నా కడ కేల వచ్చి? త
క్కడ నినుఁ బర్ణశాల కడఁ గావలి యుంచిన చోట, నొంటిమైఁ
*బడఁతుక డించి రాఁదగునె వన్య మృగోత్కర మధ్య సీమకున్"

ఆ. అనుచుఁ బలుకుచున్న యన్నకుఁ బ్రణమిల్లి
వినయ వాక్య ఫణితి విన్నవించె,
జనక తనయ పలుకు చందంబు మొదలెత్తి
లవముఁ దప్పకుండ లక్ష్మణుండు. 49

వ. చెప్పిన మాటలు విని, విన్నఁదనంబునఁ జిన్నఁబోవుచు ర్నిమి
త్తంబులం గనుచుఁ దత్తరంబున నాశ్రమంబునకుఁ జని యక్కడ,

సీతను గానని శ్రీరామచంద్రుని విరహాతిశయము

ఆ. పర్ణశాలలోనఁ బరికించి పరికించి,
సీత కానఁ బడమిఁ జిన్నవోయి,
చిత్త మంతఁ గలఁగి, శ్రీరామచంద్రుండు
పలువరింపఁ జొచ్చె భ్రమసి భ్రమసి. 51

సీ. నీ దృగ్విలాసంబు నెటి నభ్యసించెదు
గురు కుచఁ గానవే హరిణ విభుఁడ?
నీ మంజు లాలాప నిచయంబుఁ గైకొన్న
సుకుమారిఁ గానవే పిక కులేంద్ర?

---

* పుడమిజ డించి రాఁదగునె భూరి

నీ నిండు స త్కాంతి నెమ్మోము గలయట్టి
రుచిరాంగిఁ గానవే రోహిణీశ?
నీ పక్ష విస్ఫూర్తి నెనయు ధమ్మిల్లంబు
గల యింతిఁ గానవే యళి కులేశ?

తే. స్తన భరంబున నీ పోల్కిఁ దనరినట్టి
యతివఁ గానవె చక్రవా కాధినాథ?
నెలయ నినుఁ బోలు నెన్నడ నేర్చినట్టి
రమణిఁ గానవె నీవు మరాళ రాజ? 52

సీ. ఘనసార భూజంబ! కానవే నీ మంచి
గంధంబు గల మేని కరటియానఁ?
గదళికా తరురాజ! కానవే నీయట్టి
మెఱుఁగుఁ బెం దొడల మా మీననేత్ర?
విలసిల్లు చంపక వృక్షంబ! కానవే
లలి నీదు పుష్ప విలాస నాసఁ?
గమనీయ లత! నీవు కానవే నీయట్టి
కరములు శోభిల్లు కంబుకంఠిఁ?

తే. క్రముక ధరణీరు హాధీశ! కానవయ్య
నీ ఫల స్ఫూర్తి కంఠంబు నీలవేణిఁ!
గళికలను మించు నవ కుంద! కానవమ్మ
నీదు కోరక నిభ దంత నీరజాస్య? 53

సీ. వనజాస్య! నినుఁగూడి వర్తించు నతి ఘోర
వనములు శృంగార వనము లగును.
పడఁతి! నీతోఁగూడి పవళించు కర్కశ
శయ్యలు పూవుల శయ్య లగును.
గలకంఠి! నీచేతి కంద మూలాది భో
జనములు మధుర భోజనము లగును.

హరిమధ్య! నినుఁ గూడి చరియించు నటువంటి
తపములు న త్పుణ్య తపము లగును.

తే. ఇంతి! నీతోడఁ గూడి భోగించునట్టి
భోగమంతయు దేవేంద్ర భోగ మగును.
సుదతి! పొదకట్టఁ గదె నాకుఁ జూడవలయుఁ
గన్నులకుఁ గానఁబడ వేమి కమల నయన! 54

వ. అని మఱియును, 55

సీ. ఏ మృగంబును గన్న నేణాక్షిఁ గానవే?
యని పెక్కు భంగుల నడిగి యడిగి,
యే పక్షిఁ గనుఁగొన్న నెలనాఁగఁ గానవే?
యని పెక్కు భంగుల నడిగి యడిగి,
యే ద్రూనుఁ బొడగన్న వామాక్షిఁ గానవే?
యని పెక్కు భంగుల నడిగి యడిగి,
యే గట్టుఁ బొడగన్న నిభ యానఁ గానవే?
యని పెక్కు భంగుల నడిగి యడిగి,

ఆ. కలఁగు, భీతి నొందుఁ, దలఁకుఁ జి త్తములోన,
సొలయు, మూర్ఛఁ బోవు, వలయు, నలఁగు,
సీతఁ గానఁబడమి శ్రీరామచంద్రుండు
విరహ తాప వహ్ని వేఁగి వేఁగి, 56

వ. ఇట్లు సీతా వియోగంబునకుఁ బలవరించుచున్న యన్నం గని
సౌమిత్రి యిట్లనియె: 57

శ్రీరామునికి లక్ష్మణుని సాంత్వనము

క. దీనుని కైవడి నూరక
మానము సెడి వగవ నేల మనుజేశ్వర! యీ

కానన భూముల వెదకఁగఁ
గానవి మీఁదటను వగవఁగాఁ దగు మనకున్. 58

వ. అని ప్రలాపించి, కోప మాఁపుకోఁజాలక కన్నులు జేగురింప,
నన్నతో నిట్లనియె: 59

ఉ. వ్రచ్చెద నాక లోకమున వారల గుండెలు, నాగ లోకమున్
గ్రొచ్చి యహీంద్ర వర్గమును గూల్చెదఁ, గవ్వపుఁగొండ కై వడిన్
ద్రచ్చెద మర్త్యలోకము, నుదారత నే గతి నైనఁ గ్రమ్మఱం
దెచ్చెద సీత, నీ క్షణమ దేవర చిత్తము మెచ్చునట్లుగన్. 60

వ. అని యిట్లు పలికి మఱియును, 61

ఉ. చించెద దైత్య సంఘములఁ జిందరవందరఁ జేసి, బ్రహ్మ బా
ధించెద, లోక పాలకులఁ ద్రెళ్ళఁగ వేసెద, భూతలమ్ము గ్ర
క్కించెద, శైల జాలముల గీ టడఁగించెద, భూమినందనన్
గాంచెదఁ, దల్లడిల్లకుము కంజ హితాన్వయ వార్ధి చంద్రమా! 62

క. భూ తలమును. నాకసమును,
పాతాళము వెదకి యైన, బాధించైనన్,
సీతను దెచ్చిన పిమ్మట
నీ తమ్ముఁడ ననుచు మెచ్చు నిఖిలోర్వీశా! 63

వ. అని పలుకుచున్న తమ్ముని శౌర్య ధైర్యాది గుణంబులకు సంతో
షించుచు, జనస్థానంబు వెదలి, జనకనందన నన్వేషించుచు దక్షి
ణాభిముఖులై చనుచు ముందట; 64

జటాయువు రామునకు రావణుని దుశ్చేష్టను దెలుపుట

క. పక్షములఁ గాళ్ళఁ దునిఁగిన
పక్షీంద్రుని జూచి రామభద్రుఁడు మదిలో
రాక్షస మాయయొ? యనుచును
శిక్షింపఁ దలంచు నంత శీఘ్రమె పలికెన్. 65

క. నీ తండ్రికి నతి మిత్రుఁడ
నో తండ్రీ! నన్ను నేయ నుచితమె నీకున్?
నా తగు పేరు జటాయువు
సీతాధిప! నన్ను నెఱుఁగు చిత్తములోనన్. 66

వ. అని చెప్పి వెండియు నా జటాయు విట్లనియె: 67

మ. విను మో రాఘవ! పంక్తికంధరుఁడు దోర్వీర్యంబు సంధిల్లఁగా
జనక క్ష్మాపతి నందనన్ గొనుచు స్వేచ్ఛా వృత్తితో నేఁగుచో,
వనితా రత్నము దీనయై పలుకు తద్వాక్యంబు లేర్పాటుగా
విని, పోరాడఁగఁ బ్రాప్తమయ్యె మఱి యీ వేషంబు భూమీశ్వరా!

క. అని సీత తెఱఁగుఁ, దన పని
జన నాయకుఁడైన రామచంద్రునితోడన్
వినిపించి, యా జటాయువు
తను వెరియఁగ నంతఁ గాలధర్మము నొందెన్. 69

వ. ఇట్లు రామచంద్రునకు సకల వృత్తాంతమును నెఱింగించి శరీ
రంబు విడిచిన యప్పక్షిరాజునకు భక్తిపూర్వకంబుగా నగ్ని
సంస్కారాది విధులు దీర్చి, దక్షిణాభిముఖులై చనుచుఁ జిత్ర
రూపంబున నున్న కబంధుని వధియించి, ముందట; 70

శబరి మధుర భక్తి

క. చని చని, యెదుటను రాముఁడు
గనుఁగొనియె మహీ జనోగ్ర కలుషాద్రి మహా
శని రూపం బనఁ దగు, నా
ఘన ముక్తి వధూ విలాస శబరిన్, శబరిన్. 71

తే. కాంచినను మ్రొక్కి యా భూమి కాంతునకును
మించి సద్భక్తిఁ బూజ గావించి నంత,
శబరితోడను దమ కార్య సరణిఁ దెలియ
వినయమునఁ జెప్ప నా కాంత విన్నవించె: 72

తే. ఇనకులాధీశ! సుగ్రీవుఁ డనెడువాఁడు
కపికుల శ్రేష్ఠుఁ డత్యంత ఘనుఁడు తలఁప
నతనితోఁ బొత్తు గావింపు మన్ని పనులఁ
జక్క నౌటకు నాత్మ నిస్సంశయంబు. 73

వ. అని చెప్పి వీడ్కొలిపిన నమ్మనుజేంద్ర నందను లటమీఁదఁ బంపా తటంబునకుం జని, రని చెప్పి నారదుని వాల్మీకి మునీశ్వరుం డటమీఁది కథా విధానం బెట్టి దని యడుగుటయు, 74

ఆశ్వాసాంత పద్య గద్యములు

క. జలజాక్ష! భక్త వత్సల!
జలజాసన వినుత పాద జలజాత! సుధా
జలరాశి భవ్య మందిర
జలజాకర చారు హంస! జానకి నాథా! 75

గద్యము

ఇది శ్రీ గౌరీశ్వర వరప్రసాద లబ్ధ గురు జంగమార్చన వినోద
సూరి జన వినుత కవితా చమత్కా రాతుకూరి కేసనసెట్టి
తనయ మొల్ల నామధేయ విరచితంబైన
శ్రీ రామాయణ మహా కావ్యంబునం
దారణ్యకాండము సర్వము
నేకాశ్వాసము.

శ్రీ

# రామాయణము

## కిష్కింధా కాండము

[సుగ్రీవుని పంపున రామ లక్ష్మణుల సన్నిధికి హనుమంతుని రాక - శ్రీరామ సుగ్రీవుల మైత్రి - వాలి సుగ్రీవుల కయ్యము-రాముఁ డొక్కకోలతో వాలిని గూలనేయుట - సుగ్రీవునకు వానర రాజ్య పట్టాభిషేకము - వర్షావేళ శ్రీరామ సీతా వియోగ పరితాపము - సుగ్రీవుఁడు సీత నన్వేషింప వానర వీరులను నలు దెసలకుఁ బంపుట - ఆశ్వాసాంత పద్య గద్యములు.]

క. పక్షీంద్ర వాహ! గిరిజా
త్ర్యక్ష మనోబ్జాత గేహ! యపహృత మోహా!
రాక్షస భీమా! ముని జన
సాక్షాత్కృత నైజ ధామ! జానకి రామా! 1

వ. శ్రీ నారద మునీశ్వరుండు వాల్మీకి మహా మునీశ్వరున కెఱింగించిన తెఱం గెఱింగించెద నాకర్ణింపుము: 2

### సుగ్రీవుని పంపున రామ లక్ష్మణుల సన్నిధికి హనుమంతుని రాక

సీ. పంపా తటమ్మున బాణాస నాయుధ
పాణులై యున్న భూపాల సుతులఁ
గనుగొని భీతిల్లి, కమలాప్త సూనుండు
వాలి పంపున వీరు వచ్చి రనుచుఁ
గలఁగి, తా ఋశ్యమూకంబున నుండంగ
వెఱచి, మలయ శైల విపిన సీమఁ

దిరిగి, వారల రాక తెఱఁ గెల్లఁ దెలిసి రాఁ
బవ నాత్మజుని వేగఁ బంప, నతఁడు

తే. వచ్చి రఘురాము శ్రీపాద వారిజముల
కర్థిఁ బ్రణమిల్లి, మీ రెవ్వ రయ్య? యిటకు
నేమి కతమున వచ్చితి? రేది నామ?
మనుచు నడిగిన సౌమిత్రి యతని కనియె: 3

సీ. దశరథుం డను రాజు తనయులం, మాతని
పంపునఁ దప మాచరింపఁ గోరి
వచ్చి, కానన భూమి వర్తించుచుండ, నీ
రాజు దేవిని దుష్ట రావణుండు
కుటిల వృత్తిని నెత్తుకొని పోవ, నా జాడ
వదలక దిక్కులు వెదకి వచ్చి,
శబరికి మా రాక చందంబుఁ దెలియంగఁ
జెప్పిన, "సర్కజుచేతఁ గాని

తే. మీదు కార్యంబు నెగ్గదు" మీర లరిగి
వేగ సుగ్రీవు చెల్మి గావింపుఁ, డనిన
వచ్చినారము గనుఁగొన వలసి యతని,
నతఁడు రాముండు, లక్ష్మణుం డంద్రు నన్ను. 4

తే. తలఁప నీ రాజునకు నెందు ధాత్రిలోన
విను మసాధ్యంబు లైనట్టి పనులు లేవు,
సూర్య వంశో త్తముఁడు మహా శూరుఁ డితఁడు,
నీకుఁ బేరేమి చెప్పుమా మాకు ననిన, 5

తే. వాయు దేవుని బ్రార్థించి, వేయి గతుల
నంజనాదేవి గాంచిన యాత్మజుండ,
నర్కజుని మంత్రినై యుందు ననుదినంబు,
వినుఁడు నా పేరు హనుమంతుఁ డనుదు రిలను. 6

వ. అని చెప్పి మఱియు నిట్లని విన్నవించె: 7

చ. వినుఁడు మహాత్ములార! యరవింద హితాత్మజుఁ దోడితెచ్చి, మి
మ్మును బొడఁగానుపింతు నని మ్రొక్కుచు నేఁగి, కపీంద్రుఁ జేరి, తాఁ
జనిన తెఱంగు, వారిఁ గను చందము నేర్పడఁ జెప్పి, గొబ్బునన్
దనిగొనివచ్చి, రాము పద పంకజముల్ గనిపించె నంతటన్. 8

## శ్రీరామ సుగ్రీవుల మైత్రి

వ. సుగ్రీవుండు శ్రీరామచంద్రుని పగ తీర్పఁ దా భారంబు వహించి, తనకుఁ బగవాఁడైన వాలిని జంపింపం దలంచి, వానితోఁ దనకుఁ గలిగిన పూర్వ వైరంబు తెఱంగు శ్రీరామునకుఁ దెలియ విన్నవించి, వాలి మహా సత్త్వశాలి, యతండు రాముని చేతం దెగుట తెల్లంబుగా, దుందుభి కళేబరంబును బది యోజనంబుల దూర మెగురఁ జిమ్ముటయును, సప్త తాళంబు లొక్క బాణంబునఁ దెగఁ ద్రేయుటయును జూచి, సుగ్రీవుండు భయ కంపిత హృదయుండై, రాఘవేశ్వరుల పాదారవిందంబులకు వందనం బాచరించి, జనక నందన మున్ను జాఱవిడిచిన యాభరణంబుల మూటఁ దెప్పించి, చూపినం జూచి మూర్ఛిల్లి, గొబ్బునం దెలిసి, యర్క కులేశ్వరుండైన శ్రీరామచంద్రుం డర్క సంభవుండైన సుగ్రీవునితో నిట్లనియె: 9

క. పగ నీ కెక్కుడి దింకను
నగచర! నగ భేది సుతుని నా యస్త్రమునన్
దెగ నేయుదు నమ్ము మనుచు
జగదీశుఁడు పలుక నతఁడు సంతోషించెన్. 10

వ. ఇట్లు ప్రమాణ వచనంబుల న య్యచల చరాగ్రణి స్వాంతంబును సంతోషింపఁ జేసిన, నతండును శ్రీరామచంద్రుని కార్యంబునకు సహాయుండై యుండ నొడంబడి, య మ్మహానాయకుని యను

మతంబున యుద్ధ సన్నద్ధుండై, కిష్కింధా నగరంబునకుం జని, తద్ద్వారంబున నిలిచి సింహనాదంబుఁ జేసినం, గనలి యా దేవేంద్ర తనూభవుండు సనుదెంచె, నంత నయ్యిరువురుం గదిసి, భుజంబు లప్పళించుచు గర్వాలాపంబు లాడుచు నొండొరు మార్కొని. 11

## వాలి సుగ్రీవుల కయ్యము

శా. శైలంబుల్ కడు వేగ ఱువ్వుచు, మహా ఝుంకార హుంకారముల్
చాలం జేయుచు, భీక రోద్ధతులచే సాలంబులన్ వ్రేయుచున్,
వాలాగ్రంబుల మోదుచున్, వడిపడిన్ వక్త్రింబులన్ రక్తముల్
కూలన్, వాలియు సూర్య సూతియు వడిం గోపాత్ములై పోరఁగన్

వ. అట్టి సమయంబున, 13

## రాముఁ డొక్క కోలతో వాలిని గూలనేయుట

ఉ. [1]సాలము పొంత నిల్చి రఘుసత్తముఁ డమ్మరివోసి, శబ్ద వి
స్ఫాలముగాఁగ విల్ దివిచి, ముష్టియుఁ దృష్టియు గూర్చి, గోత్రభృ
త్కూలము వజ్ర పాత హతిఁ గూలు విధంబునఁ గూల నేసె న
వ్వాలిఁ, బ్రతాపశాలి, మృడ వందన శీలి, సురాలి మెచ్చఁగన్, 14

క. [2]ఓలిమిఁ బొంచియు రఘుపతి
పాలిత కపిరాజ్యశాలిఁ బ్రస్ఫుట కీర్తిన్
కూలి పద భక్తి శీలిని
వాలి న్నొక కోల నేలఁ గూలఁగ నేసెన్. 15

వ. తదనంతరంబున 16

## సుగ్రీవునకు వానర రాజ్య పట్టాభిషేకము

క. తారా పతి శిక్షింపుచుఁ
దారా పతి ధవళ కీర్తిఁ దగు నర్కజునిన్

---

1. ఓలము చొచ్చి యొయ్యన రఘూద్వహుఁ డమ్మొనరించి శబ్దవిస్ఫాలము దాఁక; 2. ఈ పద్యము వ్రాఁత ప్రతిలోఁ గలదు.

దారా దేవికిఁ బురి కా
తారార్కము గాఁగ రాజ తనయుఁడు నిల్చెన్. 17

క. నిగ్రహము మాని నృపతి శు
భగ్రహ లగ్నంబునందుఁ బట్టము గట్టెన్
విగ్రహ రా జోపగ్రహు
సుగ్రీవుని, హేమ దామ సుగ్రీవుఁ దగన్. 18

వ. ఇట్లు సుగ్రీవుని గపి రాజ్య పట్టభద్రునిం జేసి, వాలి తనూసంభ
వుని నంగద కుమారుని యువరాజ పదంబున నిలిపె, నంత వర్షా
కాలము గడచునంతదనుక శ్రీరాముని మాల్యవంతంబుపై నుండ
నియమించి వారు సని రయ్యవసరమున. 19

వర్షా వేళ శ్రీరామ సీతా వియోగ పరితాపము

సీ. బ్రహ్మాండ మగలంగఁ బటపట ధ్వనులతో
నుఱుము లంతంతకు నుఱుముచుండఁ,
గడు భయంకరముగా వడి మ్రోగు మ్రోఁతలఁ
బిడుగు లాడాడ గుభిల్లు మనఁగఁ,
గ్రముకంబు లంతేసి కణములతోఁ గూడఁ
గరుడు గట్టిన వడగండ్లు రాలఁ,
గొఱవి దయ్యంబుల మఱపించు తెఱఁగున
విద్యు త్ప్రకాశమ్ము వి_స్తరిల్ల,

తే. ముసుఁగు వేసిన చందాన మొగులు గప్పి,
మీఁటి నలు పెక్కు చీఁకట్లు కాఱుకొనఁగ,
మించి కడవల నుదకంబు ముంచి తెచ్చి
క్రుమ్మరించిన గతివాన కురిసె నపుడు. 20

క. ఏఱులు కా ల్నడ తప్పఁగఁ
బాఱెను, సస్యములు పండె, ఫల వృక్షములన్

మీఱి ఫలించెను, దరఁ బా
లేఱులుగా సురభు లెల్ల నెప్పుడుఁ బితికెన్. 21

వ. అంత వర్షా కాలాంతంబు గాఁగ న మ్మహీకాంతుండు ప్రేయసీ వియోగ పరితా పానలంబునఁ బొరలుచు నోర్వలేక. విభ్రాంత స్వాంతుండై యుండ : 22

సీ. పలుమాఱు నీ హ స్త పల్లవంబులచేత
నలివేణి! నా తాప మార్పవేల?
నలినాక్షి! పరిరంభణ క్రీడఁ దేల్పి నీ
మది నొప్పి నా నొప్పి మాన్పవేల?
చెలియ! యోష్ఠామృత సేవకై నీ యల్క-
వడి దప్పి నా దప్పి గడపవేల?
భామ! తాపానల పరితాప ముడుప నీ
తనువు నా తనువునఁ బెనఁచవేల?

ఆ. యనుచు సీతఁ బిలుచు, నందంద పరికించు,
దిక్కు లాలకించు, నిక్కి చూచు,
దశరథాత్మజుండు తన్నుఁ దా మఱచుచు
బయలు కౌఁగిలించుఁ బలువరించు. 23

వ. అని మఱియును. 24

ఉ. కూరలు నోటికిన్ రుచులు గూడుట దప్పెను, దుంపదూఁడుబం
గారము తోఁచె, జిహ్వకును గమ్మని తేనెలు చేఁదు లయ్యెఁ, గం
గారయెఁ జి త్తమంతయును, గంటికి నిద్ర రహింపదయ్యె శృం
గార మెలర్ప సీతఁ బొడఁగానమి, రామ నృపాల మౌళికిన్. 25

ఉ. తాలిమి తూలిపోయి పరితాపమునం దిరుగాడు, నొక్కచోఁ
గాలును నిల్వఁద్రొక్క నధికారము చాలక యెప్పుడుం గడున్
జాలి వహించుఁ, జి త్తమునఁ జంచలతం గను, భూమి పుత్త్రిపై
మేలిమిఁ జేసి రాముఁ డట మిన్నక వేదురు గొన్న కై వడిన్. 26

## సుగ్రీవుఁడు సీత నన్వేషింప వానర వీరులను నలు దెసలకుఁ బంపుట

వ. ఇట్లు విరహ తాపంబునఁ బొరలుచున్న సమయంబునఁ గార్తిక మాసంబు సనుదెంచిన, శ్రీరామచంద్రుండు బలంబులం గూర్చు కొని రమ్మని సుగ్రీవు పాలికి సౌమిత్రి ననుప, నా రాము తమ్ముని గూడి యినజుండు తారా సమేతుండై చనుదెంచి, రాఘవేశ్వరుల చరణారవిందమ్ములకు నమస్కరించి, తన బలంబులఁ దోడు సూప దొడంగె నెట్లనినఁ; బదులును, నూఱులును, వేలును, బదివేలును, లక్షలును, బది లక్షలును, గోట్లును, శత కోట్లును, నర్బుదంబులును, న్యర్బుదంబులును, ఖర్వంబులును, మహా ఖర్వంబులును, బద్మంబులును, మహా పద్మంబులును, క్షోణు లును, మహాక్షోణులును, శంఖంబులును, మహా శంఖంబులును, క్షితులును, మహా క్షితులును, క్షోభంబులును, మహా క్షోభంబు లును, నిధులును, మహా నిధులును, సాగరంబులును, మహాసాగ రంబులును, నపరిమితంబులును, గడచి లెక్కకు మిక్కిలి యెక్కువయై, డెబ్బదిరెండు వెల్లువలు గల కపి బలంబుతోడఁ దోడు సూపినం జూచి, రాఘవేశ్వరుండు సంతోషించి, సవితృ నందను గారవించి కౌఁగిలించుకొని, సీతాన్వేషణంబుఁ జేయఁగల వానరోత్తముల నధిక బలయుతుల నేర్పఱిచి దిశలకుం బంపు మనవుడుఁ దూర్పునకు మైందుండును, బశ్చిమంబునకు సుషే ణుండును, నుత్తరంబునకు శతబలియు ననువారిని నేర్పఱించి, వారలకుఁ దోడుగా వానరవీరులను లక్ష లక్ష సంఖ్యాకుల నేర్ప ఱించి యిచ్చి, జానకి యున్న చొప్పును దెలిపి, యొక్క నెలలో రండని యనిపి, హనుమంతునిం బిలిచి, 'నీవు దక్షిణమ్మునకుం బొ'మ్మని యనుపునపుడు, శ్రీరామ భూపాలుండు వాని విశ్వాసాది గుణమ్ములకు మెచ్చినవాఁడై దగ్గఱగాఁ బిలిచి; నీవు శౌర్యవంతుం డవు, హితుండవును గావున నీచేత మత్ప్రయోజనం బీడేరు నని పలికి, తన చేతి యంగుళీయకం బతని చేతి కిచ్చి, యీ ముద్రిక

జనకరాజ నందనకు సమర్పించి, యా జానకీ శిరో రత్నంబు మా కానవాలుగాఁ దెమ్మని యనుప, నతం డియ్యకొని మ్రొక్కి న నాతనికిఁ దోడుగా నంగద జాంబవదాదులం గూర్చి యనిపె; ననుటయు విని నారదుని వాల్మీకి మహా మునీశ్వరుం డటమీఁది కథా విధానం బెట్టిదని యడుగుటయును. 27

ఆశ్వాసాంత పద్య గద్యములు

క. జలజాక్షః భక్త వత్సలః
జలజాసన వినుత పాద జలజాతః సుధా
జలరాశి భవ్య మందిర
జలజాకర చారు హంసః జానకి నాథాః 28

గద్యము

ఇది శ్రీ గౌరీశ్వర వర ప్రసాద లబ్ధ గురు జంగమార్చన వినోద సూరి జన వినుత కవితా చమత్కా రాతుకూరి కేసనశెట్టి తనయ మొల్ల నామధేయ విరచితంబైన శ్రీ రామాయణ మహా కావ్యంబునం గిష్కింధా కాండము సర్వము నేకాశ్వాసము.

శ్రీ

# రామాయణము

## సుందరకాండము

[సంపాతి కపివీరులకు సీత యునికిని దెలుపుట - హనుమంతుని సాగర లంఘనము - లంకా నగర సందర్శనము - హనుమంతుఁడు లంకలో సీతకై కలయ వెదుకుట - రావణుఁడు మదనాతురుఁడై సీతను బ్రార్థించుట - సీత రావణుని దెగడి శ్రీరాముని బొగడుట - రావణుఁడు కుపితుఁడై సీతకు వ్యవధి నొసఁగుట - జానకి సంతాపము - త్రిజటా స్వప్న వృత్తాంతము - హనుమంతుఁడు రాముని కుశల వార్తను సీతకు విన్నవించుట - శ్రీరామ ముద్రికా ప్రదానము - హనుమంతుఁడు శ్రీరాముని శోభన గుణములను నుతించుట - సీత తన చూడామణి నానవాలుగా హనుమంతునకు నిచ్చుట - ఆకస మంటఁబెంచిన హనుమ రూపము - శ్రీరామునకు సీతా సందేశము - హనుమంతుని విక్రమ విహారములు - కపివీరుఁడు రాక్షస వీరులను గసిమసంగుట - హనుమంతుఁడు జంబుమాలిని రూపుమాపుట - అక్షకుమార పవన కుమార భీకర సమరము - అక్షకుమారాదుల సంహారము - ఇంద్రజిత్తు హనుమంతునిపై నెత్తివచ్చుట - మేఘనాదుని భయంకర సమరము - బ్రహ్మాస్త్రమునకుఁ గట్టువడిన హనుమంతుఁడు - హనుమంతునితో రావణుని యధిక్షేపము - హనుమంతునిచే శ్రీరామచంద్రుని గుణ కీర్తనము - దూతను జంపుట దోసమని రావణునకు విభీషణుని హితవు - వాలాగ్ర జ్వాలలతో వాయు సుతుఁడు లంకను దగులఁబెట్టుట - మారుతి పోటుతో యమపురి కరిగిన లంకిణి - దధివనమున వానర వీరుల యుత్సాహ క్రీడ - అంగదాదులచే దధిముఖ పరాభవము - సుగ్రీవాజ్ఞచేఁ గిష్కింధకు వానరవీరుల పునరాగమనము - హనుమంతునిచే

శ్రీరామునకు సీత కుశల వార్తా నివేదనము - సీతా శిరో
రత్నమును గాంచి శ్రీరాముఁడు దురపిల్లుట-ఆశ్వాసాంత పద్య
గద్యములు.]

క. సూర్య కుల రత్న దీపా।
సూర్య సహస్ర ప్రతాప। సుందర రూపా।
ఆ ర్యారాధిత నామా।
శౌ ర్యాధిక సుగుణ సీమ। జానకి రామా। 1

వ. శ్రీ నారద మహా ముని వాల్మీకి కెఱింగించిన తెలుంగు విన్న
వించెద నవధరింపుము:

సంపాతి కపివీరులకు సీత యునికిని దెలుపుట

తే. * రామునకు మ్రొక్కి య క్కపిరాజు కరుణఁ
ద క్షిణంబున వెదలిరి దక్షిణంబు
వెదకువా రగు వానర వీర వరులు
పంతములతోడ నెంతయు సంతసమున. 3

క. మును తా పేఁగిన దిక్కులు
పనివడి వెదకంగఁ జనిన బలిముఖు లెల్లన్
జనకజఁ గానక వచ్చిరి
మనుజేశుని కడకు చనిన మార్గంబుననే. 4

వ. అట్టి సమయంబున. 5

క. గిరులును, నదులును, వనములఁ
బరికింపుచుఁ, బట్టణములు బహు విధ గతులన్
దిరుగుచు వెదకుచుఁ, గానక
కరువలి సుతుఁ డాది యైన కపి వరు లెదుటన్. 6

---

* రాజునకు.

క. ఆలోఁ గాంచిరి స త్కపి
జాలముఁ, గరి శరభ సింహ శార్దూల మృగా
భీలముఁ, బుణ్య కదంబ వి
శాలము, నగు న మ్మహేంద్ర శైలము లీలన్. 7

వ. ఇట్లు మహేంద్ర పర్వతంబుం గనుంగొని దాయం జని యచ్చట,

ఉ. ఆ నటి వాసర ప్రవరు లా ధరణీ సుతఁ గాన లేక దుః
ఖాతురులై వగం బడఁగ, నయ్యెడఁ ద ద్గిరినుండి వచ్చి సం
పాతి యనం బ్రసిద్ధుఁ డగు పక్షి కులేంద్రుఁడు, రావణుండు దా
సీతను గొంచుఁ బోవుగతిఁ జెప్పుచుఁ దెల్పెను లంక త్రోవయున్.

క. ఆ పక్షీంద్రునిచేతను
జాపల శుభ నేత్ర రామచంద్రుని దేవిన్
బాపాత్ముఁ డైన దైత్యుఁడు
వే పట్టుక చనిన త్రోవ విని కపు లెల్లన్. 10

వ. మహానందంబు నొంది యమ్మహేంద్ర పర్వతం బారోహించి
పురోభాగంబున, 11

క. ఆ కపి వీరులు గనుగొని
రాకాశ నదీ ప్రచుంబి తార్భట భంగా
నీక మహా ఘన రవ భయ
దాకార నట త్ప్రికాశు నా జలధీశున్. 12

వ. అట్లు కనుంగొని, 13

క. తమ తమ సత్త్వ స్థితులను
గమియించెదు నద్ధి కొలఁదిఁ గనుగొని మదిలో
భ్రమయుచుఁ బలికెను గపి సం
ఘము లెంతయు దెందమందుఁ గళవళపడుచున్. 14

## హనుమంతుని సాగర లంఘనము

క. ఈ వార్ధి దాఁట సత్త్వము
మా వలనం జాల దింక మారుతి! వినుమా
పావని వగుటం జేసియు
నీవలనం దక్క నొరులు నేరరు దాఁటన్. 15

వ. అని యిట్లు ప్రార్థించినతోడనే, యబ్బి వారి వచనంబులకు సమ్మతించి వాయు తనూజుం డిట్లనియె: 16

ఉ. పావన మూర్తి రామ నరపాలకు పంపున నబ్ధి దాఁటెదన్,
దేవ విరోధి చేఁబడిన దేవిని జూచెదఁ, గానకుండినన్
లావున గద్దతోఁ బెటికి లంకయ తెచ్చెద, నట్లు గాకచో
రావణుఁ బట్టి తెచ్చెదను, రాముని సన్నిధి కెన్ని రీతులన్. 17

వ. అని వారి మనంబులు సంతసిల్లునట్లుగా బిరుదులు వక్కాణించి, తనకుఁ దండ్రి యైన వాయు దేవునకును, త్రిమూర్త్యాత్మకుండైన లోక బాంధవునకును, నింద్రునకును, సంద్రమ్మునకును, నమస్కరించి, శ్రీరామ లక్ష్మణులఁ దన మనః పద్మంబునం దిడికొని మ్రొక్కి, బంధు మిత్త్రులం గౌఁగిలించుకొని, వారిచేత దీవనలం బొంది, గమ నోన్ముఖుండై, 18

చ. మొగము బిగించి, పాదములు మొత్తముగా వడి నూఁది త్రొక్కి, నీటుగ మొగ మెత్తి, భీకర కఠోర రవంబున నార్చి, బాహు లత్యగణిత లీల నూఁచి, వలయంబుగ వాలముఁ ద్రిప్పి, వేఁగునన్ నగము సగమ్ము గ్రుంగఁ, గపి నాథుఁడు నింగికి దాఁటె ఠీవునన్.

వ. ఇట్లు నింగి కెగిరిపోవుచుండు సమయంబునఁ బావనికి నడ్డంబుగా మానవ రూపంబున మైనాక పర్వతంబును, సురస యను నాగ జననియు, ఛాయాగ్రాహిణియైన సింహికయునుం, గనుపట్టిన నెల్లర నతిక్రమించి, సువేలాచలంబున కరిగి, యక్కడ నలయిక

దీని నొక్క యిక్కువ నించుక సేపు విశ్రమించియున్న సమ
యంబున, 20

## లంకా నగర సందర్శనము

ఉ. భేరికి సాటి యౌ దనుజ భీషణ భాషలు, భద్ర నాగ ఘీం
కార నినాదముల్, హయ నికాయపు హేషలు, కాహళ ధ్వనుల్,
వీర మృదంగ నాదములు, విశ్వ భయంకర లీల లంకలో
బోరు కలంగఁగా, శ్వసన పుత్త్రుఁడు చాలఁగ నాలకించుచున్. 21

ఉ. కోటికిఁ గోటులై పరఁగు కుంజర వర్గము, ఘోటకంబులున్,
గోటికి నెక్కుడై పరఁగు గోత్ర సమానము లౌ రథంబులున్,
గోటికి హెచ్చులై పరఁగు ఘోర నిశాచర కోటి కోట్లతో
సాటికి నెక్కు న ప్పురము సాహసవంతుఁడు గాంచె ముందరన్,

వ. ఇ ట్లా లంకా పుటభేదనంబును వీక్షించి తన మనంబున; 23

శా. ఘో రాకారులు, కామ రూపులు, మహా క్రూరాత్మ, లత్యుగ్రు లీ
శూరుల్, వీరలఁ గన్నుగ్రామి పురిలో శోధించు లా గెట్లొకో?
యీ రూపంబునఁ బోవఁగాఁ గనిన వా రె గ్గేమి గావింతురో?
నారీ రత్నము సీత నందుఁ గనఁగా నా కెట్లు సిద్ధించునో? 24

వ. అని తలంచుచున్న యవసరమ్మున, 25

ఉ. క్రుంకెఁ బయోజ బాంధవుఁడు, గూండ్లకుఁ బక్షులు సేరె నెల్లెడన్,
బొంకము తీసెఁ దామరలు, పూచెను గల్వలు, తార కావళుల్
బింకముఁ జూపెఁ గాంతి, నళి బృందము కూర్కెఁ, దమంబుఁ
[బర్వె, నే
వంకను జార చోరకులు వ్రాలి చరించిరి కౌతుకంబునన్, 26

వ. ఇట్లు నిశా సమయమునందుఁ దన మేటి గాత్రం బణు మాత్రం
బుగా గుదియించి, య గ్గిరి డిగ్గి చనుచు, నల్ల నల్లనఁ బుర

ద్వారంబు నొద్దకుఁ జేరి, వానర కుల పుంగవుఁడు పుర ప్రవే
శంబు సేసి, 27

హనుమంతుఁడు లంకలో సీతకై కలయ వెదుకుట

ఉ. మేడలు, రచ్చకొట్టములు, మిద్దెలు, మంచెలు, నాట కూటముల్
మాడువు, లంగణల్, దనుజ మందిరముల్, పుర గోపు రావణల్,
వాడలు, దేవ గేహములు, వప్ర చయంబులు, వేశ వాటికల్,
గోడలు, నాదిగాఁగఁ గపి కుంజరుఁ డప్పుడు చొచ్చి చూచుచున్.

క. మఱువులు, సందులు, గొందులు,
నిరవులుఁ. జొరరాని చోట్లు, నేకాంతంపుం
దెరువులు, నంతఃపురములు
వెరవునఁ గపి కుంజరుండు వెదకం జొచ్చెన్. 29

ఆ. గాలి లీల, శీతకర కాంతి విఖ్యాతి,
ధూమ రేఖ రీతిఁ, దూఱి చొచ్చి
యసుర మందిరముల నక్కడ నిక్కడఁ
గలయఁ దిరిగి వెదకెఁ గపివరుండు, 30

వ. ఇట్లు తిరిగి తిరిగి వెదకుచుఁ దన మనంబున, 31

క. మాయా బలుండు రాక్షస
నాయకుఁ డిటఁ బట్టి తెచ్చినాఁ డతని మహా
కాయము నుగ్రాకృతిఁ గని
తోయలి తన తనువు నెచటఁ దొఱఁగెనొ యకటా! 32

మ. అటుగా కీతఁడె యన్య దేశమున నా యబ్జాక్షిఁ బెట్టించెనో?
ఘట యంత్ర స్థితి వార్ధి మధ్యమునఁ దాఁ గ్రౌర్యంబునన్ దాఁచెనో?
*పటు బాహా బల శక్తి నాక భువన ప్రాగ్దేశమం దుంచెనో?
చటు లోగ్రాకృతి రాము బాణములకున్ శంకించి యెందుంచెనో?

వ. అని యీ గతి వితర్కించి, 34

* కుటిలుఁడై మఱి మాయచేసెనొకొ నాకుం గానరానట్లుగా

ఉ. త్రుంతు విధాత జందెములు, ధూర్జటి శైలము వ్రత్తు, విష్ణు సే
వింతు, గ్రహంబులం దిరుగవేయుదుఁ, బూర్ణపయోధు లేడుఁ గా
రింతు, నుడు వ్రజంబులను లెక్కలు పెట్టుదు. భూతలంబు గ్ర
క్కింతు, నహీంద్ర లోకమును గీడ్పడఁ జేయుదు సాహసంబునన్.

ఉ. కొట్టుదు నింద్రుఁ, బావకుని గుండెలు వ్రత్తుఁ, గృతాంతుఁ జెండు [దున్
బట్టుదు దైత్యునిన్, వరుణు మానముఁ గొందును. గాలిఁదూలఁగాఁ
దట్టుదుఁ, గిన్నరేశ్వరుని ప్రాణము కల్గుదు, శూలిఁ ద్రోలుదున్,
జట్టలు ద్రుంతు రావణుని, సారస లోచనఁ జూపకుండినన్. 36

క. ఈ మాడ్కిఁ జేయ దేవ
స్తోమమ్ములు చంద్ర వదనఁ జూపెద రొండెన్,
ఏమిటికిఁ గిదు తగదని
రాముఁడు వల దనుచు మరలి రమ్మను నొండెన్. 37

వ. అని యనేక ప్రకారంబుల నాలోచించుచు నొక్క గోపురం బారో
హించె నా సమయంబున, 38

క. పాపని కనుగొనె నప్పుడు
పావన విఖ్యాత సుగుణ భావోపేతన్,
సేవిత దనుజ వ్రాతన్,
భూ వనితా జాత, నిత్య పూతన్. సీతన్. 39

వ. ఆ రామం జూచి, శ్రీరామచంద్రుని దేవిని గాఁ దలంపుచు, న
గ్గోపురంబునుండి దిగ్గి, సూక్ష్మ రూపంబుఁ గైకొని, శింశుపా
వృక్షం బారోహించి యందు, 40

సీ. పతిఁ బాసినట్టి యాపదకంటెఁ బలుమాఱు
వివిధ మాయలచేత వేఁగి వేఁగి,
పీర దానవ కోటి వికృత వేషంబులు
కనుగొని చిత్తంబు క్రాఁగి క్రాఁగి,

తన దిక్కు లేమికిఁ దలపోసి తలపోసి
లోలోన మిక్కిలి లోఁగి లోఁగి,
కర్ణ కఠోరంబుగా నాడు మాటలఁ
దొరఁగెడి కన్నీటఁ దోఁగి తోఁగి,

ఆ. రాముఁ దలఁచుకొంచు, రామునిఁ బేర్కొంచు,
రామ! రామ! యనుచు రమణి పలుకఁ
గపివరుండు సూచి కామినీ రత్నంబు
సీత యనుచుఁ బొంగెఁ జిత్తమందు. 41

వ. అట్టి సమయంబున రావణాసురుండు సీతాపహృత హృదయుండై పన్నీట మజ్జనం బాడి, దివ్యాంబరంబులు గట్టుకొని, కర్పూర సమ్మిళితంబైన శ్రీగంధంబు నెఱ పూఁత పూసి, పారిజాత పుష్పంబులు ముడిచి, మవ్వంపుఁ దావి నివ్వటిల్లెడు జవ్వాది మెత్తి, దశ శిరంబులయందును రత్న మకుటంబులు ధరించి, మణి మండితంబు లగు కుండలములు పూని, భాను ప్రభా విలసితంబులగు పతకంబులును, ముక్తా హారంబులును, భుజకీర్తులును, బాహుపురులును, నంగుళీయంబులును, నవ రత్న స్థగితంబగు నొడ్డాణంబును నమరించి, చంద్రహాస హస్తుండై, కందర్ప విలాస సుందరుండగుచుఁ, గిన్నర కింపురుష గంధర్వామ రోరగ సిద్ధ విద్యాధరాంగన లుభయ పార్శ్వంబుల నాలవట్టంబులు పట్టి, మౌక్తిక ఛత్త్రంబులును, దాళవృంతంబులును, వింజామరంబులును ధరించి రాఁ, గొందఱు కర దీపికా సహస్రంబులు గైకొని ముందఱఁ బిఱుంద నేతేర, నశోక కారామంబునకుఁ జనుదెంచె, నప్పుడు గంధ వాతూలంబునం దూలు పుష్ప లతయునుం బోలె వడవడ వడంకుచుఁ, దన సుందరాంగంబులు, హస్తోరు వస్త్ర కేశంబుల, మాటియుఁ, గప్పియు, నడంచియు, నివురు గప్పిన నిప్పు చందంబున, ధూళీ ధూసరంబగు రత్నంబు కైవడి, మేఘ చ్ఛన్నంబగు చంద్ర బింబంబు డంబున, నిత్తడి పొదిగిన కుందనంపు శలాక లాగున, మాఱుపడియున్న జానకిని గదిసి, 42

## రావణుఁడు మదనాతురుఁడై సీతను బ్రార్థించుట

క. సీతను గనుగొని రావణుఁ
డాతత నయ వాక్య ఫణితి నతి కుతుకమునన్
జేతోభవ కేళి తాండవ
పాతంబులఁ జాల నొచ్చి పలుకఁగఁ జొచ్చెన్. 43

లయగ్రాహి. తోయజ దళాక్షి! వలరాయఁ డిటు లేచి పటు
సాయకము లేర్చి యిపు డేయఁగఁ దొడంగెన్,
దోయద పథంబున నమేయ రుచితోడ నుడు
రాయఁడును మంచి వడఁ గాయఁగఁ గడంగెన్,
కోయిలలుఁ గీరములుఁ గూయఁగ నళి వ్రజము
లే యెడలఁ జూచినను మ్రోయుచుఁ జెలంగెన్,
నాయెడఁ గృపా రసము సేయ కవివేకమున
నీ యెడల నుండు టిది న్యాయమె లతాంగి! 44

వ. అని మఱియును, 45

సీ అల కేశ్వరుం డుపాయనముగా నిచ్చిన
యంచిత చీని చీనాంబరములు,
దివి జాధినాథుండు దిన దినంబును నిచ్చు
పారిజా తోల్లస త్ప్రసవములును,
దక్షి ణాధీశుండు తగఁ గాన్క లంపిన
సురభి కర్పూరాది పరిమళములుఁ
బాతాళముననుండి ఫణి సార్వభౌముండు
పుత్తెంచినటువంటి భూషణములుఁ

తే గలవు నా యింట నే ప్రొద్దుఁ గడమ లేక,
దేహ పరితృప్తి గావించి మోహ మలరఁ
గాము కేళి సుఖంబులఁ గలయు టొప్పు,
విడువు మదిమీఁద రామ భూవిభుని మీఁద. 46

సీ. ఎవ్వాని వీటికి నేడు వారాసులు
పెట్టని కోటలై పెచ్చు పెరుఁగు,
నెవ్వాని సేవింతు రింద్రాది దేవత
లనుచర బలు లయి యను దినంబు,
నెవ్వాని చెలసాల నే ప్రొద్దు నుందురు
గంధర్వ సుర యక్ష గరుడ కాంత,
లెవ్వాని భండార మిరవొంద విలసిల్లు
నవ నిధానంబుల వివిధ భంగి,

తే. సకల లోకంబులును మహోత్సాహ వృత్తి
నెవ్వనికిఁ జెల్లఁ బుష్పక మ్మెక్కి తిరుగ,
నాకె తక్కంగఁ గలదె యే నాట నైన?
మ ద్భుజా శక్తి ప్రతి పోల్ప నద్భుతంబు. 47

సీ శ్వసనుండు లోగిలి సమ్మార్జనముఁ జేయ,
నబ్ధి నాథుఁడు కలయంపి సల్లఁ,
బావకుం డరుదెంచి పాకంబు లొనరింప,
శమనుండు వెసఁ బరిచర్యఁ జేయఁ,
బాకారి కల్పక ప్రకరంబు లర్పింప,
దనుజేశ్వరుఁడు కైదండ యిడఁగ,
నర వాహనుండు తా నగరి వెచ్చము వెట్ట,
నీశానుఁడు విభూతి నెంమి నీయ,

తే. గురుఁడు పంచాగ మెప్పుడు సరవిఁ జెప్ప,
నసుర కిన్నర గంధర్వ యక్ష భుజగ
సిద్ధ కింపురు షాంగనల్ చేరి కొలువ
వైభవంబునఁ జెలు వొందువాఁడఁ దరుణి. 48

ఉ. ఎత్తితి శంక రాచల మహీన బలంబున బంతి లాగునన్,
మొత్తితి సర్వ దిక్పతుల మూఁగిన గర్వము విచ్చిపాఱఁగా.

నా త్తితి శత్రు భూపతుల నుగ్ర రణంబున భూమిఁ గ్రెళ్ళఁగా,
మొ త్తితి భోగి కంఠము లమోఘ జవంబున మేటి కీర్తులన్. 49

శే. జడలు ధరియించి తపసుల చందమునను
దమ్ముఁడును దాను ఘోర దుర్గమ్ములందుఁ
గూరగాయలు కూడుగాఁ గుడుచునట్టి
రాముఁ డే రీతి లంకకు రాఁగలండు? 50

ఆ. ఇంకఁ జేయఁ నేర, రీఁదంగ నోపరు.
కట్ట లేరు, చుట్టి పట్ట లేరు,
జలధి దాఁట లావు చాఁదు నరులకు,
వచ్చు త్రోవ చెపుము వారిజాక్షి? 51

క. దానవు లెప్పుడు చూచిన
మానవులను గెఱవఁ గలరు, మది నూహింపన్
మానవ భక్షకులై మను
దానవులను గెలువ నరుల తరమే జగతిన్? 52

క. జగతీశుఁడు మానవుఁ డఁట!
నగరే భుజ శ క్తిచేత నా కెదు రన్నన్?
నగ ధరుఁడో, నగ ధన్వుఁడో,
నగ భేదియొ, కొంత కొంత నాతోఁ బోరన్? 53

వ. ఆ సంగతి య ట్లుండనిమ్ము. 54

క. నీ కన్నుల సౌభాగ్యము,
నీ కుచములఁ గలుగు మేలు, నీ ముఖ కాంతుల్,
నీ కరముల లావణ్యము,
నాక స్త్రీలందు లేవు నాకుం జూడన్. 55

మ. సుర కాంతల్ సరి రారు, యక్ష సతులున్ సూటింపఁగా రారు, కి
న్నర భామల్ ప్రతి రారు, సిద్ధ వనితల్ న్యాయంబుగాఁ బోల, రా

గరుడాబ్జాక్షులు సాటిరారు, తలఁపన్ గంధర్వ లోలాక్షులున్,
మఱి యెరీ వినుఁ జెప్పి చెప్పఁ దరుణుల్ మత్తేభ కుంభ స్తనీ!

క. వ్రీడ యలంకారముగా
నాడుము భయ ముడిగి మధుర మైన మృదూక్తుల్,
బేడిసల నేలు కన్నులఁ
జూడుము కను ఱెప్ప లెత్తి సుదతీ! నన్నున్. 57

వ. అని యిట్లు నోటికి వచ్చిన మచ్చునఁ బ్రేలుచున్న యా నీచుని దుష్ట భాషణంబులకు రోసి తృణంబు చేపట్టి, జనక భూపాల నందన యిట్లనియె: 58

సీత రావణుని దెగడి శ్రీరాముని బొగడుట

క. పతి దైవముగా నెప్పుడు
మతిఁ దలఁచుచు నుండునట్టి మగువలఁ జెఱుపన్
బ్రతిన గలయట్టి నీతోఁ
బ్రతివచనము లాడుకంటెఁ బాపము గలదే? 59

క. పర దార రతులఁ గోరెడు
పురుషుల కాయువు నశించుఁ, బుణ్యము సెడు, స
త్పురుషుల దూషింపఁగఁ దుది
నరకంబునఁ బడుదు రనెడి న్యాయము వినవే? 60

వ. అదియునుం గాక, 61

క. తన సాహసంబు తానే
కొనియాడు నతండు హీన గుణుఁ డని వినుచున్
విను నీవ పొగడుకొంటివి
వినఁగూడదు ధర్మశాస్త్ర విపరీతంబుల్. 62

శా. సంగర రంగమందు నతి శౌర్యమునన్ రఘురాముతోడ మా
తంగ తురంగ సద్రథ శతాంగ బలంబులఁ గూడి నీవు పో

రంగను నోప, కిప్పుడు విరాధ ఖరాదుల పాటుఁ జూచియున్
దొంగిలి నన్నుఁ దెచ్చితివి, తుచ్ఛపుఁ బల్కులు పల్కఁ బాడియే?

సీ. కూఁకటి ముడికినై కురులు గూడని నాఁడె
బెదరక తాటకఁ బీఁచ మణఁచె,
గాధేయుఁ డొనరించు క్రతు రక్షణము సేయఁ
బెక్కండ్రు దైత్యుల నుక్కణంచె.
నవనిపై విలసిల్లు నఖిల రాజన్యులు
వ్రేలఁ జూపఁగఁ లేని విల్లు విఱిచె,
ఘోరాటవులలోనఁ గ్రుమ్మరు నప్పుడు
ఖర దూషణాది రాక్షసులఁ జంపెఁ,

తే. బాద రజమున నొక ఱాయిఁ బడఁతిఁ జేసె,
లీల మాయా మృగంబును గూలనేసె,
రాజ మాత్రుండె మేదినీ రక్షకుండు
రామ భూపాలుఁ డాదినారాయణుండు. 64

తే. అట్టి రామున కీ యబ్ధి యనఁగ నెంత ?
లంక యన నెంత ? దనుజుల పొంక మెంత ?
నీ వనఁగ నెంత ? నీ లావు చేవ యెంత ?
చెప్ప నేటికి నీవె చూచెదవు గాక ! 65

శా. వీరాలాపము లాడ నేల వినుమీ, విశ్వ ప్రకాశంబుగాఁ
బారావారముఁ గట్టి, రాఘవుఁడు కోప స్ఫూర్తి దీపింపఁగా
ఘోరాజిన్ నిను దాపి, లావు కలిమిన్ గోటీర యుక్తంబుగాఁ
గ్రూరాస్త్రంబుల మస్తముల్ దునిమి, భుక్తుల్ పెటు భూతాళికిన్.

శా. ఆరూఢ ప్రతిమాన విక్రమ కళాహంకార తేజో నిధిన్
శ్రీరామున్, సుగుణాభిరాముఁ దెగడన్ జేకొన్న ని న్నాజిలో
దారన్ దొంగిలి తంచు నిష్ఠుర గతిన్ దండించి ఖండింప ము
న్నీ రెట్లైనను దాఁటివచ్చు నలుకన్ నేఁ డెల్లి శాంతింపుమా. 67

వ. అని తన్నుఁ జీఁకిం గొనక వీరాలాపంబు లాడ నా రావణుం
దొడుపు దప్పిన కాలాహి చందంబున నుగ్రుండై మండిపడి
యి ట్లనియె: 68

రావణుఁడు కుపితుఁడై సీతకు వ్యవధి నొసఁగుట

క. ఆఁటదిగా యని కూరిమి
పాటించిన కొలది నన్నుఁ బలుకఁగఁ జొచ్చెన్,
మాటాడకుండ నాలుక
తూఁటులుగాఁ జేయకున్న దోసము గాదే। 69

క. *కుయ్యాదక నా ముందఱఁ
గయ్యమునకుఁ గాలు దువ్వఁ గడఁగెను దీనిన్
దయ్యాలకు బలి వెట్టెద
వ్రయ్యలుగా నఱికి యెల్లవారును జూడన్. 70

క. కాకున్న దీని బలిమిని
బైకొని నా కాంక్ష దీఱ భావజ కేళిన్
జేకొనక విడిచిపెట్టినఁ
గైకొనునే నవ్వఁ గాక గర్వము పేర్మిన్. 71

శా. భీమాటోప భుజ ప్రతాప మహిమన్ భీమాచలం బెత్తి, సు
త్రామా ద్యష్ట దిగీశ సైన్యముల సంగ్రామంబులో నోర్చి, యు
ద్దామ ప్రౌఢిఁ జెలంగుచుండెదు కళా దాముండ, నా ముందటన్
రామున్ గీముని జెప్ప గిప్ప నగరా రాకేందు బింబాననా। 72

సీ. అఖిల లోకముల నా యాజ్ఞ విల్వితి నేక
హేలను బుష్పకం బెక్కి తిరిగి,
పేల్పు మూఁకలచేత వెట్టి సేయించితి
దితి వంశ వల్లభుల్ నుతులు సేయ,

---

* పయ్యాదక.

గణములతోఁ గూడ గైలాస మెత్తితి
బటువైన పూవుల బంతి పగిది.
వనజ గర్భునిచేత వరములు గైకొంటి
దండిగా నత్యుగ్ర తపము సల్పి.

తే. చెలులు పట్టితి గంధర్వ సిద్ధ సాధ్య
భుజగ సుర యక్ష కిన్నర ముఖ్య సతుల,
నిట్టి సామర్థ్య మెవరి కేనాఁడు గలదు?
మహిని నా కొక్కనికె కాక మంజువాణి! 73

తే. నాకు నెదిరింప నొక షేద నరుని నొడ్డి
వెలవ కీ రీతి దుర్భాష లలుచు దీని
జిహ్వ మొదలంటఁ బట్టి యీ శిత కుఠార
ధారఁ దునుమాడి ధారుణిఁ బాలవైతు. 74

వ. అని చంద్రహాసంబు ఝంకించి లేవ నుంకించు తఱిఁ గొందఱు
ప్రియ సుందరు లడ్డంబు సొచ్చి. 75

చ. సురవరుఁడో? ధనంజయుఁడొ? సూర్య తనూజుఁడొ? యాతు
[ధానుఁడో?
శరధి విభుండొ? గాడ్పొ? పురశాసను మిత్త్రుఁడొ? భోగి భూషుఁడో?
గురు భుజ శక్తిఁ గైకొనుచుఁ గోపము సూపఁగ నీకు నెంత యి
త్తరుణిపయిం బ్రతాపమున దారుణ కృత్యము సేయఁ గూడునే?

క. ఏటికి మీ రిటు కినియఁగ
గాటపు జంకెనయె చాలుఁ, గరవాలున కీ
యాఁటది యర్హమె? మము నీ
మాటికి మన్నించి కావుమా యిఁకఁ జాలున్. 77

వ. అని కాంత వచనంబులఁ బ్రియంబు సెప్పిన య ప్పంకరుహాక్షుల
విన్నపంబులు మన్నించి. యా రాక్షస చక్రవర్తి వైదేహికిఁ గావలి

యున్న యేకజటా ద్విజటా త్రిజటా దుర్ముఖీ వాయముఖీ శూర్పణఖ లాదిగఁ గల దైత్య కామినుల వంకఁ గనుగొని. 78

క. * గడు విచ్చితి నిరు మాసము
లౌదఁబఱుపుఁడు నేర్చినట్టు, లౌదఁబడ కున్నన్
గడి కండలుగాఁ గోసుక
పదఁతులు భక్షింపుఁ డింతి పలలం బంతన్. 79

వ. అని రోషారుణిత నేత్రుండై యతి భీష ణాకారంబుఁ దాల్చి పలికిన. 80

జానకి సంతాపము

క. తన పతి నిందించుటకును
దన ప్రియములు చెప్ప వినక తక్కిన మీఁదన్
దనుఁ జంపుఁ దన్న మాటకు
నిన కుల వల్లభుని దేవి †యేడ్చెన్ బెఱచన్. 81

సీ. జానకి శోకింప సాధ్య కిన్నర యక్ష
గరు డోర గామర కాంత లెల్ల
వెంటనే శోకింప, విని గంధవహ పుత్త్రుఁ
డాత్మలోఁ జింతించి, యాగ్రహమున
నీ దుష్ట దైత్యుపై నిప్పుడే లంఘించి
చెండాడ నాచేతఁ జిక్కనేని
కార్యంబు లెస్సగుఁ, గాక సత్త్వము తూలి
బలువిడి వీవిచేఁ బడితినేని,

తే. సీతఁ గానంగ లేక కృశించి రామ
భద్రుఁ డడఁగిన, సీతయుఁ బ్రాణ మెడలు,
లక్ష్మణుండును జూడ నాలస్య ముడిగి
తెగును, నట్లైనఁ గార్యంబు తెఱఁగు దప్పు. 82

* ఎడ యిస్తి రెండు; † యెఱఁగెత్తే డ్చెన్.

చ. అని పవ నాత్మజుండు దివిజారి పయిం దెగ వేళ గాదు, భూ
తనయకు నాదు రాక, వసుధా వరు మేలు నెఱుంగఁ జెప్పి, మీఁ
దను మఱి చూత మంచు నుచిత స్థితి నూరక యుండె, నప్పు డా
దనుజ విభుండు వోయె నిజ ధామముఁ జేర సతీ సమేతుఁడై. 83

వ. అప్పుడు యామినీచర కామినులు రావ ణానుమతంబున ననేక
విధంబులగు మధు రాలాపంబుల మిథిలాధీశు కుమారిం గుఱించి
బోధించి, కార్యంబు సాధింప నోపక, యలసి యుంటంజేసి
యొక్కింతసేపు నిద్రించుచుండ, మేల్కాని త్రిజటయను నిశాచరి
యిట్లనియె: 84

## త్రిజటా స్వప్న వృత్తాంతము

మ. కల గంటిన్ వినుఁ డింతురారః మన లంకా ద్వీప మీ యబ్ధిలో
పల వ్రాలన్, మన రావణేశ్వరుని శుంభ ద్రత్న కోటీరముల్
కలనన్ గూల రఘూద్వహుం డెలమితో గంధేభము న్నెక్కి, యు
జ్జ్వల కాంతిన్ విలసిల్లు సీతఁ గొనిపోవన్ మిన్నకే నిప్పుడే. 85

క. శుద్ధాత్ముఁ డైన రాముఁడు
శుద్ధాంతపు దేవిఁ గాన శుభ సూచకముల్
సిద్ధ మయి తోఁచుచున్నవి
సిద్ధం బీ మాట వేద సిద్ధాంతముగాన్. 86

క. కావున ని క్కోమలి యెడఁ
గావలి యున్నట్టి మీరు కరి నోక్తులుగా
నేవియు నాడకుఁ, డీఁక నీ
దేవియ రక్షింప మనకు దిక్కగు మీఁదన్. 87

వ. అని చెప్పి మఱియును, 88

క. అమ్మా! వెఱవకు మదిలో,
నిమ్మగ మఱి వేడ్క నుండు మిఁక, నీ మగఁడున్

నెమ్మిగ నిను( గొనిపోవును,
మ మ్మందఱ మనుపు మమ్మ! మఱవక కరుణన్. 89

ఆ. అనుచు దనుజ కాంత లంతంత నెడ(బాసి
నిదుర వోయి, రంత నదరి సీత
తనకు దిక్కు- లేమి( దలపోసి దుఃఖింప(
బవన సుతు(డు మనుజ భాష( బలికె. 90

హనుమంతు(డు రాముని కుశల వార్తను
సీతకు విన్నవించుట

క. ఉన్నా(డు లెస్స రాఘవు(,
డున్నా( డిదె కపుల( గూడి, యురు గతి రానై
యున్నా(డు, నిన్ను( గొని పో
నున్నా(, డిది నిజము నమ్మ మ్ముర్వీ తనయా! 91

సీ. ఆ మాట లాలించి భూమిజ తనలోన
వెఱ( గంది, శింశుపా వృక్ష మరసి
చూడంగ, నప్పుడు సూక్ష్మ రూపంబున
నొడికమౌ శాఖల నడుమ నున్న
కపి కుమారుని రూప మపురూపముగ( జేసి
స్వాంతంబులోన హర్షంబు నొంది,
దనుజ మాయలచేత( దఱచు వే(గుట( జేసి
మాటాడ నేరక యూర కున్న

తే. భావ మూహించి, తన్ను నా దేవి యాత్మ
నమ్మకుండుట దెలిసి, యా కొమ్మమీ(ది
నుండి క్రిందికి లంఘించి, నిండు భక్తి
మ్రొక్కి- నిలుచుండి కరములు మోడ్చి పలికె. 92

ఉ. తమ్ముని గూడి పుణ్య గుణ ధాము(డు, రాము(డు వచ్చి మాల్యవం
తమ్మున సైన్య సంఘము ముదంబున( గొల్వ(గ నుండి. భూమిపై

మిమ్ములఁ జూచి రం డనుచు మేటి కపీంద్రులఁ బుచ్చి, యందు మొ
త్తమ్ముగ మమ్ముఁ గొందఱను దక్షిణ భాగము చూడఁ బంపుచున్.

### శ్రీరామ ముద్రికా ప్రదానము

క. అంగనఁ బొడఁగన నీ వి
య్యంగను గడుఁ జాలువాఁడ వంచును, నాచే
నుంగర మంపెను శ్రీ రఘు
పుంగవుఁ, డిదె కొ మ్మటంచు భూమిజ కిచ్చెన్. 94

ఉ. ఇచ్చినఁ జూచి, రామ ధరణీశ్వరు ముద్రికగా నెఱింగి, తా
నిచ్చను మెచ్చి మెచ్చి, తరుణీమణి యాత్మ గతంబునందు నీ
వచ్చినదాని భావమును, వల్లభు చందము నేర్పడంగ, నేఁ
జెచ్చెర సంతయుం దెలియఁ జెప్పుము నమ్మిక పుట్టునట్లుగన్. 95

వ. అని విచారించి యిట్లనియె: 96

క. నిను విశ్వసింపఁ జాలను,
వినుపింపుము నీ తెఱంగు, విభుని తెఱంగు
న్ననవుడుఁ బావని తెలియఁగ
వినయంబున విన్నవించె విస్ఫుట ఫణితిన్. 97

ఉ. రాముని డాఁగురించి, నిను రావణుఁ డెత్తుక వచ్చువేళ, నీ
హేమ విభూష ణావళుల నేర్పడ ఋశ్య మహాద్రి వైచినన్
మే మవి తీసి దాఁచితిమి, మీ పతి యచ్చటి కేఁగుదేరఁగాఁ
దామరసాప్త నందనుఁడు తా నవి సూపినఁ జూచి మెచ్చుచున్.

సీ. అర్క సంభవునకు నభయంబు దయసేసి,
దుందుభి కాయమ్ముఁ దూలఁ దన్ని,
యేడు తాడుల సర్వ మేకమ్ముగాఁ ద్రుంచి,
వాలి నద్భుత శక్తిఁ గూల నేసి,

సుగ్రీవునకుఁ దార సుదతిగా నిప్పించి,
యంగదు యువరాజనంగ నిలిపి,
వారలతోడను వానర సైన్యంబు
లెన్నేని గొలువంగ నేఁగుదెంచి,

తే. మాల్యవంతంబునం దుండి, మనుజ విభుఁడు
నిన్ను వెదకంగ నందఱ నన్నిదిశలఁ
బనుచునప్పుడు, దక్షిణ భాగ మరయ
నంగదునితోడఁ గొందఱ మరుగుదేర. 99

తే. వారి పంపున నవలీల వార్ధి దాఁటి
వచ్చి సకలంబుఁ జూచి యీ వంకఁ గంటి
రావణుఁడు వచ్చి నిన్ను నుగ్రంబుగాఁగఁ
బలుకునప్పుడు నున్నాఁడఁ బాదపమున. 100

హనుమంతుఁడు శ్రీరాముని శోభన గుణములను వర్ణించుట

వ. ఇవ్విధంబునఁ బలుకుచుండినను నమ్మక యతనిం గనుంగొని రాముఁ డే రీతివాఁడో యతని చందం బెఱింగింపు మనవు దా వాయు నందనుండు, రఘునందనునకు వందనం బాచరించి, భూమి నందన కిట్లని చెప్పుచున్నాఁడు: 101

సీ. నీల మేఘ చ్ఛాయఁ బోలు దేహమువాఁడు
ధవళాబ్జ పత్ర నేత్రములవాఁడు
కంబు సన్నిభ మైన కంఠంబు గలవాఁడు
చక్కని పీన వక్షంబువాఁడు
తిన్ననై కనుపట్టు దీర్ఘ బాహులవాఁడు
ఘనమైన దుందుభి స్వనమువాఁడు
పద్మ రేఖలు గల్గు పద యుగంబులవాఁడు
బాగైన యట్టి గుల్ఫములవాఁడు

తే. కపట మెఱుఁగని సత్య వాక్యములవాఁడు
రమణి! రాముండు శుభ లక్షణములవాఁడు
ఇన్ని గుణముల రూపింప నెసఁగువాఁడు
వరుస సౌమిత్రి బంగారు వన్నె వాఁడు. 102

తే. ఉరుత రాటవిలోన మహోగ్ర తపము
వాయు దేవుని గుఱియించి వరుసఁ జేపి
యంజనా దేవి గనియె న న్నర్థితోడ
నర్కజుని మంత్రి, హనుమంతుఁ డనెడువాఁడ. 103

వ. అని యిట్లు తాత్పర్యంబు పుట్టునట్లుగా విన్నవించి దేవీ! నీ దేవుం డయిన శ్రీరాముండు నాచేతి కిచ్చి యంపిన నూత్న రత్నాంగుళీ యకంబు నీకు సమర్పించితి. నింక రిక్త హస్తంబులతోఁ జనుట దూతల కుచితమైన కార్యంబు గాదు. కావున నిన్ను దర్శించి నందులకు శ్రీరామునకును నమ్మిక పుట్టునట్టులుగా నీ శిరోరత్నంబు నాకు దయచేయవలయు ననుటయు నా కుశేశయ నయన యిట్లనియె:

సీత తన చూడామణి నానవాలుగ
హనుమంతునకు నిచ్చుట

క. నా నాథు క్షేమ మంతయు
ధీనిధి! నీచేత వింటిఁ దెలియఁగ, నైనన్
నీ నిజ రూపము చూడక
నే నా రత్నంబు నమ్మి నీ కీయఁ జూమీ! 105

వ. అనుటయు నా హనుమంతుండు, 106

ఆకస మంటఁ బెంచిన హనుమ రూపము

క. చుక్కలు *తల పూవులుగా
నక్కజముగ మేను పెంచి యంబర వీథిన్

* మొల పూసలుగా

వెక్కసమై చూపట్టిన
నక్కోమలి ముదము నొందె నాత్మ స్థితికిన్. 107

వ. ఇట్లు తన మహోన్నత రూపంబు చూపి యెప్పటియట్ల మరల సూక్ష్మ రూపంబు గైకొని నమస్కరించిన, నా హనుమంతునకు నద్దేవి తన శిరోరత్నంబు ననుగ్రహించి యిట్లనియె: 108

శ్రీరామునకు సీతా సందేశము

చ. రవి కుల వార్ధి చంద్రుఁడగు రాముని సేమము చాల వింటి, నా
వివిధము లైనపాట్లు పృథివీ పతికిం దగఁ జెప్పఁగల్గె నేఁ
డవిరళ భంగి నీ వలన, నచ్చుగ నే నుపకార మేమియుం
దవిలి యొనర్ప లేను, వసుధాస్థలి వర్ధిలు బ్రహ్మ కల్పముల్. 109

వ. ఇట్లు దీవించి మఱియును. 110

క. ఏ యెడఁ జూచిన ధరణీ
నాయకు శ్రీపాద యుగము నా చిత్తములోఁ
బాయ దని విన్నవింపుము
వాయు తనూభవుఁడ! పుణ్యవంతుఁడ! తెలియన్. 111

తే. ఇపుడు రావణుఁ డేఁతెంచి కపట బుద్ధి,
గర్వమునఁజేసి నన్నెన్ని కాఱులాడె,
నన్నియును నీవు చెవులార విన్న తెఱఁగు
పతికి దయ పుట్టఁగా విన్నపంబు సేయు. 112

సీ. నిడుద పెన్నెఱి వేణి జడలుగా సవరించి
మలిన జీర్ణాంబరం బొలియఁ గట్టి,
భూమి రజంబు విభూతి పూఁతగఁ బూసి
తన పతి మూర్తిఁ జిత్తమున నిల్పి,
నిరశన స్థితితోడ నిలిచి భూ శయ్యను
బవళించి నిదుర యేర్పడఁగ విడిచి,

తారక బ్రహ్మ మంత్రంబుఁ దలిఁపుచుఁ
గఠిన రాక్షస దుర్మృగములలోన
తే. సహిత లంకా మహా ద్వీప గహన సీమఁ
దపము సేయుచునున్నాను తన్నుఁ గూర్చి.
నాకుఁ బ్రత్యక్ష మగు మని నాథునకును
విన్నవింపుము సత్త్వ సంపన్న! నీవు. 113

వ. అని చెప్పి మఱియును. 114

చ. జనకుని భంగి రామ నృపచంద్రుని, నన్నును దల్లిమాఱుగాఁ
గని, కొలువంగ నేర్చు గుణ గణ్యుని, లక్ష్మణు నీతి పారగున్
వినఁ గన రాని పల్కు లవివేకముచేతను బల్కినట్టి యా
వినుత మహా ఫలం బనుభవించితి నంచును జాటి చెప్పుమా. 115

క. ఆ మాటలు మది నుంచక
నా మానముఁ గావు మనుచు నయ వినయ గుణో
ద్దాముఁడు, రాముని తమ్ముఁడు,
సౌమిత్రికిఁ జెప్పవయ్య సాహసివర్యా! 116

వ. అని యిట్లు జనక రాజ తనయ పలికిన పలుకు లాలకించి హను
మంతుం డా జననితో నిట్లనియె: 117

క. ఇనుఁ డుదయింపక మున్నే
వననిధి లంఘించి, మనుజ వల్లభుకడకున్
నినుఁ గొనిపోయెద, వీఁపున
జననీ! ఎక్కుము మనిన, సంతోషమునన్. 118

క. నీ వంతవాఁడ వగుదువు.
నీ వెంటనె వత్తు నేని నెగడవు కీర్తుల్
రావణుకంటెను మిక్కిలి
భూ వరుఁడే దొంగ యండ్రు బుధ నుత చరితా! 119

వ. ఆదియునుం గాక రామచంద్రునిం దప్ప నితరుల నంటుదానం గాను. గావున నీతో రాఁ దగదు మఱియును. 120

క. దొంగిలి తెచ్చిన దైత్యుని
సంగడు లగు వారి వారి సాహస మొప్పన్
సంగర ముఖమునఁ జంపక
దొంగిలి కొనిపోవఁ దగునె దొరలకు నెందున్? 121

వ. మఱియు రామచంద్రుండు త్రిజగ దేక వీరుండును, గోదండ దీక్షా గురుండును, రాక్షస కులాంతకుండును నగుటంజేసి రాణివాస ద్రోహి యగు రావణుని సంగరంబునఁ బ్రఖ్యాతంబుగాఁ జంపి కొనిపోవుట ధర్మంబు; నీవు రామచంద్రునకుఁ బరమ భృత్యుండవును, బుత్త్రి సముండవును నగుటంజేసి. నీ వెంట నరుగు దెంచుట తప్పు గాకపోయినను, బగ తీర్పక వచ్చు టుచితంబు గాదు. కావున రాఘవేశ్వరుల కిన్నియుం దెలియ విన్నపంబు సేసి తడయక తోడ్కొని ర మ్మనిన న ద్దేవికి నమస్కరించి హనుమంతుం డిట్లనియె: 122

ఉ. నీ విభుఁ డబ్ధి దాఁటి, ధరణీతల నాథుల సన్నుతింప, సు
గ్రీవ సుషేణ ముఖ్య బల బృందముతో నరుదెంచి, నీచునిన్
రావణు నాజిలోఁ దునిమి, రాజస మొప్పఁగ నిన్నుఁ గొంచు, సే
నావళితోడ నీ పురికి నారయ నేఁగు నిజంబు నమ్ముమా। 123

వ. అని విన్నవించి నమ్రుండై య ద్దేవిచేత దీవెనలు పొంది, మరలి చనుచున్నవాఁడై తన రాక రావణున కెఱుంగఁ జేయవలయు నని తలంచి, 124

## హనుమంతుని విక్రమ విహారము

సీ. మేదిని సమముగా మేడలు గావించి,
కేళీ గృహంబుల నేలఁ గలిపి,

కమ లాకరంబులు కలఁచి గారలు వెట్టి,
వృక్ష జాతంబుల విఱుగఁ దన్ని,
పుష్ప గుచ్ఛంబులు పుడికి పాఱఁగవైచి,
తేనెలు రాల్చి పూఁదేనె లడిపి,
పొదరిండ్ల పొదవులు చదియఁగా నుగ్గాడి,
చప్పరంబుల నేల చదునుజేసి,

తే. వనముఁ గాచెడి రాక్షస వర్గములను,
వీర వరులను, నెనిమిదివేలఁ జంప,
సీతఁ గాచెడి రాక్షస స్త్రీలు బెదరి
పాఱిపోయిరి రావణు పాలి కంత. 125

వ. ఇట్లు రావణుం జేరి వారు, 126

క. దేవా! నేఁ డొక మర్కటుఁ
డే విధమున వచ్చినాఁడొ యెఱుఁగము, సీతా
దేవిఁ గని మాటలాడియుఁ
బోవుచు వన మెల్లఁ బెఱికి ప్రోవిడి కడఁకన్. 127

తే. వనముఁ గాచెడి రాక్షస వర్గములను
దండి నొకనిని విడి వోవ కుండఁ బట్టి,
మేటి భుజశక్తి నందలు గీ టడంచి,
వాలియున్నాఁడు సాహసవంతుఁ డగుచు. 128

కపి వీరుఁడు రాక్షస వీరులను గసిమసంగుట

వ. అని విన్నవించినంతనే క్రోధ రక్తాంత లోచనుం డగుచు, న
వ్వింశతి లోచనుండు విచారించి, వాఁడు రాముని పంపున వచ్చిన
దూత కాఁబోలు, వానిం జంపుం డని పదివేల రాక్షసులం బంపిన,

క. ఉగ్రాకారుం డగుచు ద
శగ్రీవుం డనుప, దనుజ సంఘంబులు దా

మా గ్రహమునఁ జనుచు బలో
దగ్ర క్రోధాత్ము లగుచుఁ దాఁకిరి కడిమిన్. 130

ఉ. తాఁకిన యంత, వాయుజుఁడు తా నదలించి కఠోర రేఖతో
వీఁక నెదిర్చి పేర్చి, రణవీథి నిశాచర సైన్య మెల్ల నొ
క్కూఁకున వెంట నంటి సమ దోగ్ర బలంబునఁ బాఱఁ బాఱఁగాఁ
దోఁకను జుట్టి మోఁదె, బలు దుర్దములం దునుమాడె నందఱిన్.

క. అందునఁ జావక మిగిలిన
కొందఱు పఱతెంచి, యసుర కొల్వున మ్రొక్కో
యందఱ మ్రింగెను, దానవు
లందఱకును వీఁడు దారు ణాంతకుఁ డగుచున్. 132

వ. అని విన్నవించిన రాక్షసేశ్వరుం డగు రావణుండు మండిపడి, పింగళాక్షుని, దీర్ఘజిహ్వుని, నక్రవక్షుని, శార్దూలముఖుని, వక్రనాసుని బనిచిన, వారును దమ తమ బలంబులం గూడికొని, రథాయోధులై వచ్చి, యార్చుచుం దాఁకి, శస్త్రాస్త్రంబు లడరించిన, నవి యెల్ల లెక్కగొనక, య క్కరువలి కొడుకు దర్పంబునం బేర్చి, వాల మల్లార్చి, యెదిర్చిన బలంబును బలువిడిగాఁ దోలి, పింగళాక్షుని ద్రుంచి, దీర్ఘజిహ్వుని దీర్ఘనిద్ర పుచ్చి, వక్రనాసుని బరాక్రమంబునం జూర్ణంబు సేసి, యక్రవక్షుని భస్మంబుఁజేసి, శార్దూలముఖుని మర్దించి, నిర్వక్రపరాక్రమంబున గర్వించి, మరలి మకరతోరణంబు నారోహించి, యార్చుచున్న సమయంబున, 133

క. చావక మిగిలిన దైత్యులు
రావణు కడ కేఁగి వేగ రాహుత్తుల పా
ట్లా వాయుజు సాహసమును
వే విధములఁ జెప్ప నతఁడు విస్మయపడుచున్. 134

మ. కుటిల భ్రూకుటి దుర్నిరీక్షణములం గ్రోధానల జ్వాల లు
త్కటమై పర్వఁగ, మంత్రి సూనుల, మహా గర్వాంధులన్,

[క్రూరులన్

బటు బాహా బలు రార్వురం బనిచె, కుంభ ద్విక్ర మాటోప మ
ర్కట పారీంద్రముమీఁద నుద్దవిడి సంగ్రామంబు గావింపఁగన్.

వ. ఇట్లు పనిచిన నా యార్వురును, 136

సీ. శతకోటి విక్రమ ప్రతిమానుఁ డైనట్టి
శతజిహ్వుఁ డత్యంత సాహసుండు,
రోషాన లాభీల శేషాహి యైనట్టి
రుధిరాక్షుఁ డత్యుగ్ర రూప యుతుఁడు,
పర సైన్య కానన పావకుం డైనట్టి
రక్తరోముఁడు మహా రణబలుండు,
కఠిన శాత్రవ లోక గజ సింహుఁ డైనట్టి
క్రూరదంష్ట్రుఁడు లయ కాల హరుఁడు,

తే. వ్యాఘ్ర కబళుండు పృథుత రాహవ జయుండు,
స్తనితహస్తుండు సాహ సోదార బలుఁడు,
వీర లార్వురు నత్యుగ్ర వేషములను
రూఢి వెడలిరి ఘన రథారూఢు లగుచు. 137

క. తమ తమ బిరుదులు నెఱపుచుఁ
దమకంబున వెడలి రథిక దళములు గొలువన్
ఘుమఘుమ భేరీ రవ సం
భ్రమములతో మంత్రి సుతులు పావనిమీఁదన్. 138

వ. ఇట్లు కదిసి సింహనాదంబు లంబరంబునం జెలంగ, గజ తురంగ
శతాంగ సుభట నికరంబుం గూడి శస్త్రాస్త్రంబులం బొదివిన. 139

తే. వాలమల్లార్చి, బ్రహ్మాండ గోళ మెల్ల
పగుల నార్చుచు, భుజ యుగం బప్పళించి,
రణము చేయంగ మకరతోరణము దిగ్గి
మంతు కెక్కిన యా హనుమంతుఁ డంత, 140

సీ. ఒక్కొక్క రథముతో నొక్కొక్క రథమును
విటతాటనంబుగా విఱుగఁ గొట్టి,
యొక్కొక్క గజముతో నొక్కొక్క గజమును
జాఁపచుట్టగఁ బట్టి చావఁ గొట్టి,
యొక్కొక్క హయముతో నొక్కొక్క హయమును
వాల ముఖంబునఁ గూలఁగొట్టి,
యొక్కొక్క భటునితో నొక్కొక్క సుభటుని
వడిఁ ద్రిప్పి చెక్కలు వాఱఁ గొట్టి,

తే. బాహు బల గర్వమునఁ బేర్చి, ప్రధన సీమ
మంత్రి సూనుల నార్వుర మడియఁగొట్టి,
మకరతోరణమున విక్రమమ్ము మెఱయ
భీక రాకారుఁడై యుండెఁ బెచ్చు పెరిఁగి. 141

క. ఆ రణ వీథిని నిలువక
పాఱిన హత శేషు లెల్లఁ బర్విడి, రాజ
ద్వారమున బొబ్బ లిడి, రా
ఘోరాజిని మంత్రి సుతులు కూలి రటంచున్. 142

వ. వారి పాటు విని రావణాసురుం దదరిపడి, యాజ్యాహుతిం బ్రజ్వ
రిల్లు హుతాశనుం బోలి మండిపడి, ప్రహస్త తనూజుండగు జంబు
మాలిం గని, నీ వా వానరాధముని వధించి శీఘ్రమ్ము రమ్మని
యనిపిన. 143

హనుమంతుఁడు జంబుమాలిని రూపుమాపుట

ఉ. అప్పుడు జంబుమాలి భయ దాకృతి, వీర రసాప్తిఁ గన్నులన్
నిప్పులు రాలఁ, బేరలుక నిండఁగ, నూర్పులు పర్వఁ, జిత్రమై
యొప్పుగ రొప్పుచున్, రణ మహోత్సుకుఁడై గజ వాజి బృంద
[ముల్
విప్పుగ వెంట రాఁగఁ, గపివీరు నెదుర్కొని విక్రమంబునన్,

క. అదలించి, వాయు నందనుఁ
బ్రదరంబుల నేయ, నంతఁ బవనజుఁ డలుకన్
గొదగొని బలముల నన్నిటిఁ
జదియంగా మోఁదె నొక్క సాలముచేతన్. 145

ఆ. రథము నుగ్గు నేసి, రథ సారథిని జంపి,
రథ తురంగమములఁ బృథుల శక్తిఁ
బట్టి, వాలమునను బడఁగొట్టి చంపిన,
జంబుమాలి కినిసి సాహసమున. 146

క. అడిదంబును గదయును గొని,
పుడమికి లంఘించి, వాయు పుత్త్రుని నిటలం
బెడపక వ్రేసిన, ధరణిం
బడి మూర్ఛ మునింగి, తెలిసి బలయుతుఁ డగుచున్. 147

క. ఆలంబున నాతని కర
వాలంబును ద్రుంచివైచి, వర భుజ శక్తిన్
నేలం గూల్చెను, విక్రమ
శాలిన్, వడి జంబుమాలి, సాహస శీలిన్. 148

ఆ. అంత జంబుమాలి, యత్యంత బలశాలి,
గర్వ మెల్లఁ దూలి, కలన వ్రాలి,
పొలిసె ననుట దైత్యపుంగవుఁ డాలించి,
యాత్మ సంచలింప నాగ్రహించి. 149

క. సాహసము వెలయ సమరో
త్సాహంబున దుష్ట కపిని జంపు మటంచున్
బాహు బలాఢ్యుని, నరి వివి
రాహవ సంహారు, వీరు, నక్ష కుమారున్. 150

వ. అంపిన నతండు. 151

## అక్ష కుమార పవన కుమారుల భీకర సమరము

సీ. చిత్ర మాణిక్య రంజిత వేత్ర విభవంబు,
భాను కోటి ప్రభా భాసితంబు,
భీకర ధ్వజ దండ బిరు దాలవాలంబు,
శస్త్రాస్త్ర పరికర సంయుతంబు,
బంధు రాధిక జవ బహు హయోపేతంబు,
కుటిల దిక్పాల దృగ్గోచరంబు,
ఘన నభో మార్గ విఖ్యాతైక గమనంబు,
వర తపో లబ్ధాతి వైభవంబు.

తే. నైన రథ మెక్కి, మద వార ణాశ్వ సుభట
వీర హుంకార ఝుంకార వార ములియఁ
గదలె హనుమంతుపైకి నాగ్రహ మెసంగ
మదము దైవార నక్ష కుమారుఁ డలుక. 152

క. అటు చని పావనిఁ గని ది
క్తటములు పెదరంగ నార్చి, దండడి భూభృ
త్తటముపయిఁ గురియు వర్షో
త్కట ధారల రీతి. నంప ధారలు గురిసెన్. 153

ఉ. వాయుజుఁ డప్పు డంప గమి వాల ముఖంబునఁ ద్రుంచెఁ, ద్రుంచినన్
వాయుజుమీఁదఁ గ్రమ్మఱ నవార్య బలంబున నేసె, నేసినన్
వాయుజుఁడుగ్రుఁ డై తునిమె వాని శరావళి నెల్లఁ బిమ్మటన్,
వాయుజు నాట సేసెఁ గడు వాఁడి శరంబుల నక్షుఁ డుద్ధతిన్.

వ. ఇట్లేసిన, 155

ఉ. తాల మహీజ రాజిని రథంబును గూలఁగ మోఁదె, మోదినన్
నేలఁ బదాతియై నిలిచి నేర్పున వాఁడు శరాళి మారుతిన్

ఫాలము నొంచె, నొంచినను బావని మూర్ఛిలి తేఱి, దానవున్
దూలఁగ ముష్టిచేఁ బొడిచె దోర్బల శ క్తి రణాంగణంబునన్.

అక్ష కుమారాదుల సంహారము

సీ. పొడిచిన మూర్ఛిల్లి, వడిఁ దేఱి, దైత్యుండు
గదఁ గొని వైచె వక్షంబు పగుల,
వైచిన మారుతి వడి వాని గదఁ బుచ్చు
కొని వాని దేహంబు గుదియ నేసె,
నేసినఁ దన వ్రేక నోసరింపక వాఁడు
గగనంబు కెగసె నా క్షణమునందె,
వాయు తనూజుండు వదలక తన వెంట
నెగసిన, గదఁ గొని యేసె నతని,

తే. నతఁడు గదఁ ద్రుంప, ఖడ్గాన నతుల శ క్తి
వాఁడు మారుతి తొడలు నొవ్వంగ నడఁచె,
నంత మూర్ఛిల్లి హనుమంతుఁ, డంతఁ దెలిపి
పట్టుకొని వాని ధాత్రిపైఁ గొట్టి చంపె. 157

తే. అంత హత శేషు లగువార లరుగుదెంచి,
సంభ్రమంబున దానవ చక్రవ ర్తిఁ
గాంచి, కొలు వెల్ల సందడి గాఁగ, నపుడు
బహు విధంబుల హనుమంతుఁ బ్రస్తుతించి. 158

సీ. అక్షుండు తెగె, నశ్మవక్షుండు తెగటాఱె,
ర క్తరోముఁడు పీల్గె రణములోన
స్తనితహ స్తుఁడు ప్రగ్గె, శార్దూలముఖుఁ డీల్గెఁ,
గింకర వర్గంబు గీటడంగె
శార్దూలకబళుండు సచ్చె, దుర్జయుఁ డేఁగె,
శతమాయుఁ దొరిగెను, సమసె వక్ర

నాసుండు, మఱి ర క్తనాసుండుఁ గడతేఱె,
శూలదంష్ట్రుఁడు నేలఁ గూలిపోయె,

తే. మడిసె యూపాక్షుఁ, డల జంబుమాలి తునిఁగెఁ,
బింగళాక్షుని పే రంత బిలము సొచ్చె,
వనము కావలి రాక్షస వర్గ మడఁగె,
దీర్ఘజిహ్వుండు నేటితోఁ దీఱిపోయె. 159

వ. అని వేఱు వేఱ విన్నవించిన నసురేంద్రుఁడు విని తన మనంబున,

మ త్త. వీని వానరుఁ డంచు నాత్మను విశ్వసింపఁగఁ జెల్ల, దీ
దాన వావళి మ్రింగఁ బుట్టిన దయ్యమో? యటుగాక వై
శ్వానరుం డిటువంటి రూపున వచ్చి నిల్చెనొ? కాక యీ
మేను గై కొని విష్ణుఁ డీడకు మేటియై చనుదెంచెనో? 161

మ త్త. కాక యే వర మైన నా కఱకంఠుఁ డిచ్చిన నుబ్బి యా
నాక వల్లభుఁ డెల్లకాలము నాకు నోడిన భీతిమై
లోక భీకర మైన రాక్షస లోక మెల్ల నడంపఁగా
నీ కరాళపు రూపు నిప్పుడ యీడ కంపఁగ వచ్చెనో? 162

మ త్త. కాక తక్కినవార లెవ్వరు గర్వ సంపద మీఱఁగా
నాకు దీకొని ధాకతోడ రణంబు సేయఁగ నోపరు
న్లోకమందిటు క్రోఁతు లెక్కడ నొంచె దానవ వీరులన్
జోక వీనికిఁ గల్గెనేనియుఁ జూఱ పుచ్చఁదె సర్వమున్. 163

వ. అని యి ట్లనేక ప్రకారంబులఁ జింతించి యక్షకుమారులం దలంచి
పలు దెఱంగులఁ బలవించుచున్న తండ్రిం గాంచి మేఘనాదుం
డిట్లనియె: 164

ఇంద్రజిత్తు హనుమంతునిపై నెత్తివచ్చుట

క. దేవతలతోడఁ గూడను
దేవేంద్రుని గెలిచినట్టి దేవర । మీకు

న్నీవిధము నొంద నేటికి
దేవా! చిత్తంబులోన దీనుని భంగిన్ ? 165

క. వానరుని గొంద చేసుక
పూనికఁ జింతింప నేల? భుజ బల శక్తిన్
వానిం జంపెద నొండెను
దీనుని గావించి పట్టి తెచ్చెద నొండెన్. 166

వ. నావుడు రాక్షసేశ్వరుం డతని మాటలకు మనంబున నలరి, నీవు
విరించి దత్త వర ప్రతాప హంతాశనుండవు. చాప విద్యా ప్రవీ
ణుండవు. తపో బల సమర్థుండవు. దేవేంద్ర గర్వ విమర్ద
నుండవు, మ త్సమాన శౌర్య చాతుర్య ధుర్యుండవు, గావున నీ
కసాధ్యం బగు కార్యం బెద్దియును లేదు. నీ విపుడ పోయి వాని
సాధించి రమ్మని పంచిన, 167

సీ. మాణిక్య తపనీయ మయ విమానముతోడఁ
గెం బట్టు బిరుదు టెక్కెంబుతోడ
సరి చెప్పఁగా రాని శస్త్రాస్త్రములతోడ
బల మైన దివ్య చాపంబుతోడ
నాహవ కోవిదుండైన సారథితోడ
ఘన సత్త్వ జవ తురంగములతోడఁ
గనుపట్టు దిక్కుల గగన యానముతోడ
బాల సూర్యోదయ ప్రభలతోడఁ

తే. గరము విలసిల్లు రథ మెక్కి, గంధ నాగ
తురగ రథ భట వంది సందోహ పటహ
శంఖ కాహళ దుందుభి స్వనము లొలయ,
మేఘనాదుండు హనుమంతుమీఁద వెడలె. 168

లయగ్రాహి. పెక్కులగు గుఱ్ఱములుఁ, జొక్కపు రథంబులును,
నెక్కువగు నేనుఁగులుఁ, గ్రిక్కిఱిసి రాఁగా

రక్కసులు సేరి యిరు ప్రక్కలను గొల్వఁ, గదు
నుక్కనను మీఱి చల మెక్కుడుగ నంతన్
గ్రక్కదల భూతలము, చుక్క లొగి రాల, శిల
లుక్కసిలి, నాదములు పిక్కటిలి మ్రోయన్
దెక్కెముల మించి, జవ మెక్కుడుగఁ జూపు దశ
మక్కజముగా నడువ దిక్కులు వడంకన్. 169

వ. ఇట్లు భయంకరాకారంబున వెడలి, కంఠ హుంకృతులును, భేరీ భాంకృతులును, నంబరంబునఁ జెలంగఁ, బొంగి చనుదెంచుచున్న రాక్షస సైన్యంబుం గనుంగొని హనుమంతుండు తోరణ స్తంభంబుపై నుండి, బధిరీభూత దిగంతరంబుగా భీకర గతి నార్చిన. 170

మేఘనాదుని భయంకర సమరము

క. కలఁగినవి దేవ గణములు,
జలధులు ఘూర్ణిల్లె, గిరులు చలనం బొందెన్,
జలజాప్త చంద్రు లొదిగిరి,
జలధరములు పటియ లగుచుఁ జదలం బర్వెన్. 171

క. అప్పుడు దానవ వీరులు
విప్పులు వర్షించునట్టి నిశి తాస్త్రములన్
గప్పిరి, కెందొగ వానలఁ
గప్పిన శైలంబుఁ బోలఁ గపివరు మీఁదన్. 172

తే. అంప వర్షంబు తనమీఁద జొంపములుగ
లీలఁ గురియంగ, నవి యెల్ల లెక్క గొనక
భువికి లంఘించి, యప్పు డద్భుతముగాఁగ
వాల మల్లార్చి యొక మహాసాల మెత్తి. 173

తే. తేరు లన్నియుఁ గూరాటి తేరులుగను,
గుఱ్ఱముల నెల్లఁ గావేరి గుఱ్ఱములుగ,

నేనుఁగుల నెల్ల వెదరూపు ఉేనుఁగులుగ,
దళము లన్నియు మఱి హరిదళము గాఁగ. 174

వ. ఇట్లు సమయింపం జూచి బలంబుపై కుఱికి, 175

సీ. కరి యూథములమీఁదఁ గడిసి మావంతుల
తోడఁ గూడఁగఁ బట్టి తునియఁ గొట్టి,
గుఱ్ఱంపుఁ బౌఁజులకును దాఁటి రౌతులఁ
గలయంగఁ బట్టి చెక్కలుగఁ గొట్టి,
రథములపైకి నుగ్రంబుగా లంఘించి
రథికులతోఁ గూడఁ బృథివిఁ గొటి,
బలములమీఁద నిబ్బరముగాఁ గుప్పించి
వాల ముఖంబునఁ దూలఁ గొట్టి

తే. పటహ నిస్సాణ కాహళ పటిమ లరియఁ
ద్రొక్కి శస్త్రాస్త్ర నిచయముల్ తుమురు చేసి,
ఛత్రములఁ ద్రుంచి పడగల సత్త్వ మణఁచి
పవన సూనుండు సాహస ప్రౌఢి మెఱసె. 176

వ. అట్టి సమయంబున, 177

చ. అనలము రీతి మండి దివిజారి తనూజుఁడు తేరు దోలి, య
య్యనిల తనూజు నేసె వివిధాయుధ పంక్తుల, వాని నెల్లఁ దు
త్తునియలు సేసె వాయుజుఁడు,దోర్బల శక్తిని దైత్యుఁ దేయఁ,
[దోఁ
కను దునుమాడె వాని విశిఖంబుల నన్నిటి వాయు సూనుఁడున్.

క. గిరులను బావని రువ్వుచు
దరువుల నేయంగఁ, గినిసి దానవుఁ డంతన్
దురమున నడుమనె త్రుంచెను
శర జాలముచేత నొక్క క్షణమున వానిన్. 179

తే. గంధవహ పుత్త్రుఁ దప్పు డాగ్రహముతోడ
రథముఁ గూలంగఁ దన్ని సారథిని జదిపి,
గుఱ్ఱములఁ జంపి, కేతువుఁ గూల నడవ,
మేఘనాదుండు కినిసి సమీర సుతుని. 180

వ. అహంకారంబునఁ బ్రతిఘటించి. 181

క. వాయవ్యాస్త్రము నంతట
వాయుజు మీఁదికి నతండు వడి నేసిన, నా
వాయవ్యాస్త్రముఁ దూలెను
వాయుజునిం జంప నోడి వారని కరుణన్. 182

వ. అది వృథ యగుటం గని మఱియును. 183

క. రౌద్రం బదరఁగ నేసెను
రుద్రాస్త్రం బతనిమీఁద రూఢిగ, నతఁ డా
రుద్రుని యంశం బగుటను,
రౌద్రాస్త్రము దేలిపోయె రభసం బొప్పన్. 184

వ. అ మ్మహాస్త్రంబు గూడఁ దప్పిపోవుట కాశ్చర్యంబు నొంది
యింద్రజిత్తు మఱియును. 185

బ్రహ్మాస్త్రమునకుఁ గట్టువడిన హనుమంతుఁడు

క. సుర ఖచర యక్ష కిన్నర
గరు డోరగ సిద్ధ సాధ్య గంధర్వ గణం
బరుదంది చూడఁగా ని
ర్భర ఘుష్టిం దొడిగి యేసె బ్రహ్మాస్త్రంబున్. 186

వ. అట్టి యవసరమున, 187

క. సప్తాంభోధులు కలఁగెను,
సప్త ద్వీపములు వణఁకె, శైలము లదరెన్,

స ప్తానిలములు దలఁకెను,
సప్తాశ్వుఁడు బ్రమనువడియె, జగములు గదలెన్. 188

వ. ఇట్లనేక ప్రకారంబులఁ గాలాగ్ని తెఱంగున వెదలి, మిడుంగుఱులు చెదరి పడఁగ, బ్రహ్మాండ మండలంబులం బట్టుకొనునట్టు పెను మంట లుప్పరం బెగయ, నేఁతెంచు బ్రహ్మాస్త్రముం గని హనుమంతుఁడు తన మనంబున, 189

ఆ. తనకుఁ జిన్ననాఁడు దయచేసి నటువంటి
వనజ భవునిచేతి వరముఁ దలఁచి,
బ్రహ్మ మంత్ర మంత పఠియింప, నది చంప
కతనిఁ గట్టివైచె నవనిమీఁద. 190

వ. ఇట్లు కట్టుపడిన కరువలి పట్టిని జూచి, రావణాసురుని పట్టి తనలో నిట్టు లనుకొనియె: 191

క. ఈ బ్రహ్మాస్త్రము తాఁకున
కే బలియుఁడు బ్రదుక నోపఁ, డితఁడు ఘనుండౌ,
నీ బాహు బలుని గట్టుట
నా బలిమికిఁ దొడవ కాదె నాకులు మెచ్చన్। 192

క. పెక్కండ్ర దనుజ వీరులఁ
జక్కాడిన వీనిఁ బట్టి, సాహసముగ మా
రక్కసుల తేని యొద్దకుఁ
జక్కఁగఁ గొనిపోవు టదియ చంపుట గాదే। 193

చ. అని తన స త్త్వ సంపద రయంబునఁ బొంగుచు మేఘనాదుఁ డ
య్యనిలజుఁ గొంచు నేఁగె దివిజారి సభా స్థలి కద్భుతంబుగా,
ఘన రథ దంతి ఘోటక నికాయ భటావళి శస్త్ర దీ ప్త కే
తన వర శంఖ కాహళ వితాన రవంబులు మిన్ను ముట్టఁగన్.

వ. ఇట్లు కొనిపోయి రాక్షసేశ్వరుం డయిన రావణాసురు సమ్ముఖమ్మునం బెట్టినంతనే గాడుపు పట్టిం గని, 195

## హనుమంతునిచే రావణుని యధిక్షేపము

క. కుటిల భ్రూ కుటి నటన
స్ఫుట ధూమ విలాస పవన పూత్కృతి జనితో
ద్భట రోషానల కీలో
త్కట నేత్రుం డగుచుఁ బలికెఁ గటము లదురఁగన్. 196

ఉ. ఎవ్వఁడ వోఁరి? నీకుఁ బ్రభు వెవ్వఁడు చెప్పుము? నీ విటొంటిమై
ని వ్వనరాశి దాఁటి యిట కే గతి వచ్చితి? నామ మేమి? నీ
వెవ్వని ప్రాపునం బెఱికి తీ వన మంతయు శంక లేక? యిం
కెవ్వని పంపునం దునిమి తీ సురవైరుల నెల్ల నుగ్రతన్? 197

సీ. అమర వల్లభు భోగ మంతయుఁ గైకొని,
వీతిహోత్రుని సిరి నీటముంచి,
జముని కింకరులను సంహార మొనరించి,
రాక్ష సాధీశ్వరు శిక్షసేసి,
యంభోధి నాథుని గాంభీర్య మణఁగించి,
దోర్బలంబున గాలిఁ దూలఁబెట్టి,
విత్త నాథుని మహా విభవంబు గొల్లాడి,
శూల హస్తుని నొక్క మూల కదిమి,

తే. యమర గంధర్వ కిన్నర యక్ష భుజగ
గరుడ గుహ్యక ముని సిద్ధ వరుల నెల్లఁ
బట్టి మును వెట్టి సేయించునట్టి నన్ను
విన్నయంతన గుండెలు వ్రీల వెట్లు? 198

చ. శరనిధి దాఁటి వచ్చుటయు చాలక నా పురిఁ జొచ్చి, చొచ్చియున్
వెఱవక దంటవై వనము వేళ్ళకుఁ ద్రుంచితి, త్రుంచి క్రమ్మఱన్
బిరుదవు బోలె రాక్షసులఁ బెక్కురఁ జంపితి, చంపి నెమ్మదిన్
గరకరితోడ నా యెదుర గర్వముతోడుత నిల్చి తద్దిరా! 199

క. ఖండించెద నీ చేతులు,
తుండించెద నడుము రెండు తునుకలు గాఁగన్,
జెండించెదఁ గత్తులతో,
వండించెద నూనెలోన వారక నిన్నున్. 200

వ. ఇట్లు పట్టరాని కోపంబున నాటోపంబుగాఁ బలుకుచున్న రావణా
సురుం జీరికిం గొనక హనుమంతుం డిట్లనియె: 201

హనుమంతునిచే శ్రీరామచంద్రుని గుణకీర్తనము

క. ఇన తనయుని వర మంత్రిని,
జనపతి యైనట్టి రామచంద్రుని దూతన్,
ఘనుఁడగు వాయు కుమారుఁడ,
వినుమీ హనుమంతుఁ డనఁగ వెలసినవాఁడన్. 202

క. రాముని పంపున వచ్చితి,
రాముని సేమంబు నీ పురంబున నున్నా
రాముని సతి కెఱిఁగించితి,
రాముని కడ కేఁగుచుండి రాజస వృత్తిన్. 203

క. నా రాక మీకుఁ దెలియఁగ
బీరంబున వనము గలయఁ బెఱికితి శక్తిన్,
ఘోర రాజి నాకు నెదిరిన
వారలఁ బంపితిని యముని పట్నము చూడన్. 204

క. నినుఁ జూచి తిరిగి పోయెదు
మనమున మఱి కట్టఁబడితి మనుజాశనః నీ
యను వెల్లఁ గంటి, నింకను
వినుమా నా బుద్ధిఁ దెలియ వివరముతోడన్. 205

చ. ఘనుఁడవు, నీతిమంతుఁడవు, కార్య మెఱుంగుదు, సాహసంబునన్
నిను నెదిరించి పోరుటకు నిర్జర వల్లభుఁ డోప లేఁడు, నీ

వనిన జగత్త్రియం బఱకు, నద్భుత రూపము సెప్పరాదు, నీ
యనుపమ భోగ సంపదల కాఁటడి తెచ్చితి విప్ర రావణా! 206

క. కడ లేని బలము, ధర నె
క్కడ లేని మహా ధనంబు కరి తురగంబుల్,
కడ గానరాని సంపద,
చెడ కుండఁగ నీకు బుద్ధి చెప్పెద వినుమా! 207

సీ. కుదియించి సింహంబు కోఱలు పెఱుకంగ,
శేషాహి దౌడలు చీల్చివేయఁ,
బీడించి దంభోళిఁ బిడికిటఁ బట్టంగఁ,
గఱిన కాకోలంబు కడి గొనంగఁ,
జెలఁగి బ్రహ్మాండమ్ము చిప్ప లూడఁగఁ దన్న,
హంకారమున బడబాగ్ని నుఱుక,
నంభో నిధానంబు లఱచేత నడవంగ,
గిరి వర్గములఁ దలక్రిందు చేయఁ

తే. గల మహా బాహు సత్త్వ విఖ్యాతి విపుల
చండ భుజదండ సాహ సోద్దండ విజయ
కాల రుద్రావతార సంగ్రామ భీమ
మూర్తి మంతులు కపులు, సత్కీర్తి యుతులు. 208

వ. అదియునుంగాక దశరథరాజ నందనుండును, గౌసల్యా గర్భ సంభవుండును, దాటకా ప్రాణాపహరుండును, విశ్వామిత్ర యాగ సంరక్షకుండును, నహల్యా శాప మోక్ష దీక్షా గురుండును, హర కోదండ ఖండనుండును, జామదగ్ని బాహు బల భంగుండును, విరాధ విరోధుండును, ఖర దూషణ త్రిశిర చ్ఛేదనుండును, మాయా మృగ సంచారి మారీచ సంహారకుండును, గబంధాంత కుండును, వాలి ప్రాణ నిబర్హణుండును, సుగ్రీవ రాజ్య సంస్థా పన పరమాచార్యుండును, ధను ర్విద్యా ప్రవీణుండును, నమోఘ బాణుండును, రాక్షస కులాంతకుండును, గాకుత్స్థాన్వయాంభో

నిధి చంద్రుండును, గరుణా సింధుండును, నగు శ్రీరామ
చంద్రుండు కరుణాలంకారుండు గావున. 209

ఉ. వారక సీత నిచ్చి, రఘువల్లభునిన్ శరణంబు చొచ్చినన్,
నేరము లెంచి చంపమికి నీయెడ సెప్పుడు నేను బూటగా
భారపడంగఁ జాలుదు, శుభ స్థితి నమ్ముము, నమ్మ కూరకే
పోరఁగఁ జూచితేనిఁ, బొరిపుచ్చక మానఁడు నిన్ను రావణా! 210

ఉ. నావుడు మండి, దైత్య కుల నాయకుఁ డుగ్ర విలోకనంబులం
బావక విస్ఫులింగములు పైకొని పాఱఁగ, వీర ఘోర దై
త్యావళిఁ జూచి, మీరలు మహా విశిఖంబుల వీనిఁ జంపుఁడీ
యావల రాముఁ డుల్కుచు భయాకులుఁడై చెడిపోవు నట్టుగన్.

వ. అనిన విభీషణుం డిట్లనియె: 212

దూతను జంపుట దోసమని రావణునకు విభీషణుని హితవు

క. దూతపనిఁ బూని వచ్చిన
దూతలు తమ నోరి కెంత తోఁచిన నట్లా
నేతల నాడుదు, రాడిన
దూతలఁ జంపంగఁ దగదు దొరలకు నెందున్. 213

క. కాకుండిన మీ చిత్తము
లో కోపము దీరునట్లు లోకము బెదరన్
ధాక నదల్చుట చాలును,
వీఁకన్ దండించి పోవ విడుచుట చాలున్. 214

వ. అని విన్నవించిన, 215

ఆ. నీతి వాక్య సరణి నెరయంగ విని రావ
ణాసురుండు కోప మడరి పలికె
వీనిఁ దోఁక గాల్చి, వెడలంగఁ ద్రోయుఁ డీ
ప్రొద్దె యటకుఁ దిరిగి పోవుఁ గాక. 216

వ. అని యి ట్లానతిచ్చిన విని, రాత్రించరు లతనిని సభా మధ్యంబు నుండి బయటికి వెడలం గొనిపోయి యొక్కచోట, 217

## వాలాగ్ర జ్వాలలతో వాయు సుతుఁడు లంకను దగులఁ బెట్టుట

ఉ. వాలము నిండఁ గోకలు జనంబున గట్టిగఁ జుట్టి చుట్టి, పైఁ
దైలము చక్కఁ జల్లి, పిఱుఁదం జని పౌరులు సూడఁ, బావక
జ్వాలఁ దగిల్చి, బొబ్బలిడి, వాడల వాడలఁ ద్రిప్పుచుండ, వా
తూల భవుండు దానికిని దూలక వహ్ని జపంబు సేయఁగన్. 218

ఆ. అగ్ని దేవుఁ డప్పు డాత్మలోఁ జింతించి
'హితుఁడు నాకు, లోక హితుఁడు పవనుఁ,
డతని పుత్రుఁ డైన హనుమంతునకు నేను
చలువ కూర్తు' ననుచుఁ జల్ల నయ్యె. 219

వ. అప్పు డచ్చటి వృత్తాంతం బంతయుఁ, దనకుఁ గావలి యున్న రాక్షస కాంతలవలన విని, చింతా భరా క్రాంతయై, జనకరాజ నందన కరంబు శోకించి, కరంబులు ముకుళించి, జగద్ధిత కార్య ధుర్యుండును, రాఘవ ప్రియానుచరుండును, మత్ప్రాణ బంధుండును, జగత్ప్రాణ నందనుండును నైన హనుమానునకు శీతలుండవు కమ్మని యగ్ని దేవునకు నమస్కరించి, యగ్ని మంత్రంబును, బ్రహ్మ మంత్రంబును నుచ్చరించిన, నద్దానివలన వానికి వైశ్వానర భగవానుండు సల్లనయ్యె, బ్రహ్మాస్త్ర బంధనంబును నూడె, నట్టి సమయంబున. 220

సీ. కొలువు కూటములకుఁ గుప్పించి, గజ వాజి
శాలల మీఁదికిఁ జౌకళించి,
భండార గృహముల పైకిని లంఘించి,
మెఱుఁగారు మేడలమీఁది కుటికి,

చప్పరంబులమీఁది కుప్పరంబున దాఁటి,
యంతఃపురమునకు గంతువైచి,
చవికలమీఁదను సాహసంబున వ్రాలి,
గరిడికూటంబుల సొరిది నెక్కి,

తే. వాడ వాడల వీథుల వన్నె మెఱపి,
హరుఁడు త్రిపురంబు గాల్చిన యట్టి లీల,
నొక్క గృహమైన లెక్కకు దక్క నీక,
దానవేశ్వర పురము దగ్ధంబు చేసె. 221

శా. అంభో రాశిని వాల వహ్ని నతి శైత్యం బొప్పఁ గావించి, య
య్యంభోజానన సీతఁ గాఁచి, తన వృత్తాంతంబు తెల్లంబుగా
గంభీర ధ్వని విన్నవింపుచు నమస్కారంబు గావించి, సం
రంభం బొప్పఁగ వేడ్కతోఁ గదలె ధీర ప్రౌఢి హన్మంతుఁడున్.

మారుతి పిడికిటిపోటుతో యమపురి కరిగిన లంకిణి

క. పోయెదు వాయుజ నెక్కడఁ
బోయెదు నాచేత ననుచుఁ బోనీక వడిన్
డాయఁగ వచ్చిన లంకిణి
కాయము వగులంగఁ బొడిచెఁ గదు వడిఁ గినుకన్. 223

వ. ఇట్లు లంకిణిం జంపి, సువేలాచలం బెక్కి, సింహనాదంబు సేయుచు.

క. పుడమి ధర శృంగంబున
నడుగులు వడి నూఁది త్రొక్కి, యద్భుత శక్తిన్
జలరాశి దాఁటెఁ బావని
మిడివింటం బసిఁడి యుండ మీఁటిన రీతిన్. 225

వ. ఇట్లు కుప్పించి, యుప్పరం బెగసి, వాయు వేగంబునం జనుచు
న య్యబ్ధి మధ్యంబున నున్న సునాభం బను శైలంబునఁ దన
దేహంబు దాహంబుఁ దీర్చుకొని, సముద్రంబును దాఁటి, యవ్వలి
కిం జనియె నప్పుడు, 226

## దధివనమున వానర వీరుల యుత్సాహ క్రీడ

ఉ. వచ్చిన పావనిం గని, జవంబున నంగదుఁ డాదియౌ కపుల్
గ్రచ్చఱ భక్తితో నెదురుగాఁ జన, నందఱుఁ గౌఁగిలించి, వా
రచ్చటి కార్య మంతయుఁ బ్రియంబునఁ దన్నడుగంగఁ, బోయి వే
వచ్చిన చంద మేర్పడఁగ వారికిఁ జెప్పెను దప్పకుండఁగన్. 227

క. రఘువరుఁ డిచ్చిన ముద్రిక
రఘువల్లభు దేవి కిచ్చి, రభసంబున నా
రఘువరున కానవాలుగ
రఘువల్లభు దేవిచేత రత్నముఁ గొంటిన్. 228

మ. అని చెప్పన్ విని, యంగదాదులు మహాహ్లాదంబునన్ బొంగి, పా
వని బాహా బల సత్త్వముల్ వొగడుచున్, వర్ణింపుచున్, వే పునః
పునరాలింగన మాచరింపుచు, వడిన్ భూషించుచున్ మ్రొక్కుచున్,
ఘనతం బాడుచు నాడుచున్, బలువిడిన్ గర్వంబునన్ దాఁటుచున్,

శా. నేనే చాలుదు రావణాసురు తలల్ నేలం బడంగొట్టఁగా,
నేనే చాలుదు వాని పట్టణము మున్నీటం బడంద్రోయఁగా,
నేనే చాలుదు దుష్ట దానవ తతిన్ నిర్భీతి దండింపఁగా,
నేనే చాలుదు నంచుఁ బంతములు పూన్కిం బల్కుచున్ ద్రుళ్ళు
[చున్.

క. ఆ రాత్రి కీశు లందఱు
మారుతితోఁ గూడి నిలిచి, మఱునాఁ డచటన్
ధీరత దుర్ధర శైలము
చేరం జని, నిద్రచేసి చిత్తము లలరన్. 231

వ. అమ్మఱునాఁ డుదయంబున మధువనంబులోఁ బ్రవేశింప నుద్యో
గించి, యందఱకన్నను బెద్దవాఁడగు జాంబవంతునిం బిలిచి, నీవు
శ్రీరామునకు హితుండవు, సుగ్రీవునకు మంత్రివి, కావున మాకు
నొక బుద్ధి యానతిమ్ము. ఈ కపులు క్షుద్బాధావశంబునం బొరలి,

మహా శ్రమంబును బొందియున్నవారు, గావున సుగ్రీవుని మధు
వనంబున నుండెడు ఫలంబులం బరితృప్తులమై, రాముని సన్ని
ధానంబున కేఁగుట లెస్స యని యంగద హనూమంతులు పల్క-
జాంబవంతుండును నత్యుత్సాహంబున నంగీకరించి, కపులం
బురస్కరించుకొని, మధువనంబులో బ్రవేశించినంత, 232

సీ. ఒక్కఁ డాఁకొని కొమ్మ మాఁచినఁ బం డ్లెల్లఁ
జేకొని తేర భక్షించు నొకఁడు,
ఒక్కఁ డాఁకొని రేఁపు చున్నట్టి తేనియల్
తడయక కొల్లాడి త్రాగు నొకఁడు,
ఒక్కఁ డాఁకొని కోయుచున్నట్టి కాయలు
మిన్నక యూటాడి మ్రింగు నొకఁడు,
ఒక్కఁ డాఁకొని గోళ్ళ నొలిచినట్టి చివుళ్ళఁ
బుక్కిళ్ళ కొలఁదిగా బొక్కు నొకఁడు,

తే. తరువుపై నుండి తరువుకు దాఁటు నొకఁడు,
పండ్ల కెటువంటి మ్రాఁకైనఁ బ్రాకు నొకఁడు,
దిగువఁ గూర్చుండి తరువున కెగురు నొకఁడు,
పెద్ద పొదవున నుండి కుప్పించు నొకఁడు. 233

ఉ. కాయల వ్రేటు లాడుచును, గంతులు వైచుచుఁ, బూవు దీవలం
దూయల లూగుచున్, దరువు లూఁపుచుఁ, బండ్లను బొట్ట నిండఁగా
మేయుచు, వెక్కిరింపుచును, మిన్నక దాఁటుచు, దోఁక లెత్తుచుం
గూయుచు, నేల దూఁకుచును, గుంపులు గూడి కపీంద్రులెంతయున్.

క. వన మెల్ల గాసి చేయఁగ
వన పాలకు లేఁగుదెంచి, వడిఁ గోపముతో
దను నదలించిన, వారల
హనుమంతుఁడు మొదలుగాఁగ నగచరు లెల్లన్. 235

క. మెడఁబట్టి వనములోపల

వెడలఁగ నటు పొలఁద్రొబ్బి, వెడలుం దన్నన్
దడయక దధిముఖుఁ డను తమ
యొడయని కడ కేఁగి వార లుగ్రముగాఁగన్. 236

వ. విన్నవించిన యంతనే, 237

## అంగదాదులచే దధిముఖ పరాభవము

చ. దధిముఖుఁ డల్గి మండిపడి, తాఁ దనవారలఁ గూడి వచ్చి, బల్
విధముల సంచరించు కపి వీరులఁ గోపముతోడఁ జూచి, యీ
మధువన మెల్లఁగొల్లగొన, మర్కట వల్లభు నాజ్ఞఁ ద్రోయ, మ
మ్మధములఁ జేయ, నెంత ఘ నులంచును బాలఁగ వారి నుద్ధతిన్.

వ. ఇట్లు దండింపుచున్న దధిముఖునిపై నంగదాది వనచరులు గదిసి
యాగ్రహంబున, 239

క. కొందఱఁ గఱచియుఁ బొడిచియుఁ,
గొందఱఁ దలపట్టి యీడ్చి కొట్టియు, గోళ్ళన్
గొందఱ వ్రచ్చియుఁ దన్నియు,
నందఱ నొప్పింప వార లాగ్రహ వృత్తిన్. 240

క. వ్రయ్యలు వాఱఁగ వ్రచ్చినఁ
గ్రయ్యఁగ రక్తములు గ్రమ్మఁగా వడితోడన్
గుయ్యో! మొఱ్ఱో! యని వా
ర య్యెడ సుగ్రీవు కడకు నరిగిరి భీతిన్. 241

వ. అరిగి, రామ లక్ష్మణులం గూడియున్న మిహిర నందనుం గనుం
గొని, నమస్కరించి, మధువనంబునందు జరిగిన వృత్తాంతం
బంతయు విన్నవించిన, వారల నాదరించి సుగ్రీవుం డిట్లనియె: 242

## సుగ్రీవాజ్ఞచేఁ గిష్కింధకు వానర వీరుల పునరాగమనము

క. దేవర పంపునఁ జని, వా
రే వెరవున సీతఁ గనిరొ, యిటు గాకున్నన్

నా వనము పాడుసేయరు
పావని మొదలైనవారు భయ విరహితులై. 243

వ. అని రామ భూపాలుండు విన సుగ్రీవుండు వారల నూరార్చి, వారి దుండగంబులు వారికే యుండుంగాని వారలం దోడ్కొనిరం డని యనిపినం జని, యంగద హనుమంతులం గని, యవనీశ్వరుం డీక్షణంబున మిమ్మందఱ నచ్చటకి రండని యానతిచ్చెం గావునఁ జెచ్చెరఁ బదుం డని, తోడ్కొని పోవునప్పుడు, వారల కెదురుగా వానర వీరులఁ గొందఱ ననిపిన, వారలం గూడి చనుదెంచి, శ్రీరామచంద్రుని పాదారవిందమ్ములకు సాష్టాంగ దండ ప్రణామమ్ము లాచరించి, సౌమిత్రికిని వందనమ్ము లొనరించి, సుగ్రీవునకు నమస్కరించి, తనచేత మేలు వార్త విన నుత్సహింపుచున్న రఘుకులేశ్వరుల తలం పెఱింగి హనుమంతుం డిట్లనియె:

హనుమంతునిచే శ్రీరామునకు సీత కుశల వార్తా నివేదనము.

శా. కంటిన్ జానకిఁ, బూర్ణ చంద్ర వదనన్, గల్యాణి నా లంకలోఁ,
గంటిన్ మీ పద పంకజాతము మదిన్ గౌతుహలం బొప్పఁగాఁ,
గంటిన్ మీ కరుణావలోకనము విఖ్యాతంబుగాఁ, గీర్తులం
గంటిన్ మా కపివీర బృందములలో గాంభీర్య వారాన్నిధీ. 245

సీ. కట్టిన వస్త్రంబు కట్టు కొంగే తప్ప
జీర్ణించి పోయిన చీరతోడ,
నుడుగని వగలచే నోరంత ప్రొద్దును
జెక్కుంటఁ జేర్చిన చేయితోడఁ,
బుడమిపైఁ బొరలాడు నొడలు బూదిద ద్రుంగి
నిరతంబు దొరఁగు కన్నీటితోడ.

విడుద పెన్నెఱి వేణి సడలించి జడలతోఁ
నిరత నిరాహార నియతితోడఁ

తే. గినుక జంకించు దైత్య కామినుల నడుమఁ
దపముఁ జేయుచు దనుజ బాధలకు నోర్చి,
వనిత ప్రాణంబు దక్క సర్వముఁ ద్యజించి,
నిత్యమును మిమ్ము మదిలోన నిల్పియుండు. 246

క. జానకిఁ బొడగనియును, మీ
రానతి నా కిచ్చి పంపినట్టి విధంబున్,
నే నాయమ కెఱిఁగించియు,
జానకి రత్నంబుఁ గొంచుఁ జనుదేఁ గఁటిన్. 247

సీతా శిరోరత్నమును గాంచి శ్రీరాముఁడు దురపిల్లుట

వ. ఇవ్విధంబున సీత చిహ్నంబులు రామచంద్రునకుం జెప్పి, దండ ప్రణామంబు లాచరించి, తనకు సీతా మహాదేవి దయచేసిన శిరో రత్నంబు శ్రీరామచంద్రునకు సమర్పించినం జూచి, యది యక్కు నం జేర్చి, యానంద బాష్పంబులు గ్రమ్ముదేర మూర్ఛిల్లి, తెప్పి ఱిల్లి, హా! వామలోచనా! హా! పద్మగంధి హా! సీత! హా! సీతా! యనుచు శోకించి సుగ్రీవుం జూచి, మనము లంకా ప్రయాణముఁ జేయఁబోవుదము, గాన నీవిఁక సేనలం గూర్చు మని యానతిచ్చిన వానరేశ్వరుండు మహా ప్రసాదం బని యంగద హనుమ జ్జాంబవ త్సుషేణ పనస నల నీల గజ గవాక్ష గోముఖాదు లగు సేనా నాయకుల నఱువదికోట్ల నియోగించిన, వారును నొక్కొక్కరు నూతేసి కోట్ల బలంబులతోడ రామచంద్రుని కిరువంకల నాడుచుఁ బాడుచు మాల్యవంతంబు వెడలి, రన విని నారదుని వాల్మీకి మహా మునీశ్వరుం డటమీఁది వృత్తాంతం బెట్టిదని యడుగుటయును,

## ఆశ్వాసాంత పద్య గద్యములు

క, జలజాక్ష! భక్త వత్సల!
జలజాసన వినుత పాద జలజాత! సుధా
జలరాశి భవ్య మందిర
జలజాకర చారు హంస! జానకి నాథా! 249

## గద్యము

ఇది శ్రీ గౌరీశ్వర వర ప్రసాద లబ్ధ గురు జంగమార్చన వినోద సూరి జన వినుత కవితా చమత్కా- రాతుకూరి కేసనశెట్టి తనయ మొల్ల నామధేయ విరచితంబైన శ్రీ రామాయణ మహా కావ్యంబునందు సుందర కాండము సర్వము నేకాశ్వాసము

శ్రీ

# రామాయణము

## యుద్ధకాండము

### ప్రథమాశ్వాసము

[శ్రీరాముఁడు వానర సేనతో లంకపై దాడి వెడలుట - రాక్షస వీరులతో రావణుని మంతనములు - రావణునికి విభీషణుని హితోపదేశము - రావణుఁడు విభీషణుని దూషించుట - రావణునికిఁ బ్రహస్తుని శాంత వచనములు - విభీషణ శరణాగతి - విభీషణుఁడు రామునికి రావణుని బల సంపదను దెలుపుట - పర్వతములు రువ్వి వారిధిపై వారధి తీరుప వానర వీరుల సముత్సాహము - సముద్రమునఁ బర్వతములను మ్రింగివేయు మహా మత్స్యములు - నలునిచే సేతు నిర్మాణము - కపిసేనతో శ్రీరామచంద్రుని లంకా ప్రవేశము - అతికాయుఁడు వానరుల దండగములను రావణునకు మనవి చేయుట - కుంభకర్ణుని సమర వీరము - అతికాయ కుంభకర్ణుల సంహరణము - ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముచే వానర సైన్యమును హత మార్చుట - హనుమంతుఁడు తెచ్చిన సంజీవినిచే వానర వీరుల పునరుజ్జీవనము - కుంభ నికుంభాది రాక్షస వీరుల నిహతి - శ్రీరాముఁడు మకరాక్షుని రూపుమాపుట - వానరుల వీరములను వినిన రావణుని బెగడుపాటు-ఇంద్రజిత్తు మాయా సమరము-ఆశ్వాసాంత పద్య గద్యములు.]

క. కామారి వినుత నామా।
సామీరి కృత ప్రణామ। సంహృత రక్షో
గ్రామా। వర్షా మేఘ
శ్యామా। సంగ్రామ భీమ। జానకి రామా।

## శ్రీరాముఁడు వానర సేనతో లంకపై దాడివెడలుట

వ. శ్రీ నారద మునీశ్వరుండు వాల్మీకి మునీశ్వరున కెఱింగించిన తెఱంగు విని పించెద సావధాన చిత్తంబుతో నాకర్ణింపుము: అట్లు శ్రీరామచంద్రుండు వానర సైన్యముతో వెడలి నడుచు చుండ, హనుమంతుం డంతకు ముందు తాను లంక కరిగి మగిడి వచ్చి, యచ్చటి వృత్తాంత మంతయు శ్రీరామచంద్రున కెఱింగించియుఁ, ద్రోవలో నుఱుకు పోకకుఁగా-మరల రాక్షసుం డుండు చందంబును, రాక్షస స్త్రీల సంవాదంబును, నింద్రజి త్తతికా యాది కుమార వర్గంబు తెఱంగునుఁ, గుంభకర్ణ విభీషణాది సోదరుల యునికియును, లంకిణి పొంకం బణంచుటయును, లంక లోపలకుఁ బోయిన చందంబును, లంకాపురీ దహనంబును, సముద్ర లంఘనంబును, నది యిది యననేల తాఁ జేసి వచ్చిన కార్యంబు నెల్ల నెవ రెవ్వ రే దేది యడిగిన వారి కా వృత్తాంతంబు నెఱింగించుచుండ, మిగిలిన కపులు వినుచుఁ, దమ జాతి చేష్టలు సూపుచుఁ, జనుచున్న చందంబు సుగ్రీవుండు రామచంద్రునకుఁ జూపుచు నడచుచున్న సమయంబున, 2

ఉ. కొందఱు మంతనమ్ములను గొంచును, గొందఱు దొమ్ములాడుచుం,
గొందఱు రామ లక్ష్మణులకుం బ్రియమౌ గతి నాట లాడుచుం,
గొందఱు గంతు లేయుచును, గొందఱు పండ్లిగిలించి చూపు, చి
ట్లందఱుఁ బోవుచుండిరి దయానిధి రాముఁడు సంతసిల్లఁగన్. 3

సీ. పాద ఘట్టనలచేఁ బరఁగిన పెం ధూళి
యాకసమ్మున మేఘ మట్లు పర్వ,
పీఁకతోఁ దాఁకిన వృక్ష జాతం బెల్ల
వ్రేల్మిడిఁ గొమ్మలు విఱిగి పడఁగ,
బలు వడితోఁ బోవు పక్షి జాతమ్ములు
భయముచే నందంద పాఱుచుండఁ,

జూపించి రావణాసురుని సైన్యం బిట్లు
మనవారిచేతను గ్రమందఁ గలదు.

తే. అనుచు శ్రీరామునకు నర్క తనయుఁ డిట్లు
సంతసము పుట్టఁ జెప్పుచు సాగి సాగి,
క్రమముగా నందఱను గొంత కాలమునకుఁ
దిన్నఁగాఁ జేరిరి సముద్ర తీరమునకు. 4

వ. ఇ ట్లందఱును సముద్ర తీరమున విడిసి యున్న సమయంబున, హనుమంతుండు బుద్ధిమ ద్వరిష్ఠుండు గావున, శ్రీరామచంద్రునకు నమస్కరించి రావణుండు, రాజ్యంబునం బట్టభద్రుండై యున్న వాఁడు; వానిం జంపి సీతా మహాదేవిం దెప్పించుపనికై వేగ మన మందఱమును సిద్ధులమై యుండవలయు. ననవుడు రామచంద్రుండు తమ్మునితో. 5

క. ఈ వానరులను దోడ్కొని
ప్రావీణ్యముతోడ వృక్ష పర్వత తతులన్
వే వేగమె తెప్పింపుము
పోవుద మటమీఁద వైరి పురముం జేరన్. 6

వ. అని యి ట్లానతిచ్చి సముద్ర తరణోపాయం బాలోచించుచుండె నంత. 7

రాక్షస వీరులతో రావణుని మంతనము

సీ. అక్కడ రావణుం డఖిల మంత్రుల వేగ
రావించి తగఁగ వారలకు ననియె:
మంత్రి సత్తములార! మర్కటుం డొకఁ డేఁగు
దెంచి మనందఱం గొంచెపఱిచి,
రాక్షస వీరుల రణ భూమిఁ గూలియించి,
వన మంతఁ బెకలించి, వార్ధి దాఁటి

పోయెను, బోరాని పోకలఁ బోవుచు
వాఁడు శ్రీరాముని వద్ద కేఁగి,

తే. ఏమి చెప్పునొ? యా మీఁద నా మనుష్య
లిద్దఱును వానరులఁ గూడి యేపు మీఱ
వచ్చి, లంకా పురములోని వారి నెల్ల
నేమి చేయునొ? యిపుడు నా కేమి దారి? 8

వ. అని యిట్లు రావణుండు నిండు పేరోలగంబునఁ గూర్చుండి, దోలాయమాన మానసుండై విచారించుచుండ, నా సమయంబున విభీషణుండు సాయం సంధ్యా విధిం దీర్చికొని, తన మంత్రులుం దానును గొల్వుకూటంబున కేఁతెంచి, పెద్ద గద్దియపైఁ గొలువున్న యన్నకు సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించిన, నతండును సంతోషించి యనుజునకు నర్హ పీఠంబుఁ జూపిన, నాసీనుండై 9
యన్న కిట్లనియె:

### రావణునకు విభీషణుని హితోపదేశము

తే. అవధరింపుము దేవ! మహానుభావ!
మన పురమ్మునఁ బ్రకృతము చను తెఱంగు
విన్నవించెద నున్నది యున్నయట్లు,
కొంచె మవధానముగ నాలకించుమయ్య! 10

సీ. అన్నంబు నీరును నక్కఱ లేకుండ
భటు లందఱును దుఃఖపడుదురయ్య.
కంబాలఁ గట్టిన గజ బృంద మెల్లను
జవస త్త్వములు దూలి జడిసెనయ్య.
హర్షంబుతోడుత హయ జాత మంతయు
మెడ లెత్తుకొని వేడ్క మెలఁగెనయ్య.
ప్రజ్వలించుచు నున్న ప్రతి హోమకుండంబుఁ
బొగలు గ్రమ్ముచు నాఱిపోవునయ్య.

తే. ఇట్టి యపశకునములఁ గన్పట్టుమయ్య,
సకల శాస్త్రంబు లెఱిఁగిన జాణవయ్య,
యింపుగాఁ జెప్పుచుంటి నాలింపుమయ్య,
వేగ రాముని సతి నిచ్చివేయుమయ్య। 11

క. సీతను దెచ్చుట మొదలుగ
నీతో నయ వాక్యములను నేఁ జెప్పితి, నీ
చేతమునఁ బెట్టవైతివి,
ఖ్యాతిగ నిఁక నైన సీత నాతని కిమ్మా। 12

వ. అదియునుంగాక మొన్న రాతిరి సీతయొద్దఁ గావలియున్న రాక్షస
కాంత లందఱును నిద్రించుచున్న సమయంబునఁ, ద్రిజట దిగ్గన
మేల్కాంచి, నిదురించుచున్న స్త్రీలను లేపి, చెప్పిన దుస్స్వప్నంబు
విన్నవించెద నాకర్ణింపుము : రామచంద్రుండు మన లంకపై
దండు విడిసినట్లును, నీవును గుంభకర్ణుండును దక్షిణాభిముఖులై
గార్దభంబులపై నెక్కి పితృభూమి కరుగుచున్నట్లును, నింద్రజి
దాది కుమార వర్గంబును, సైన్యంబును, మూల బలంబును, సర్వం
బును నశించిపోవుచున్నట్లును, సీతం జేకొని శ్రీరామచంద్రుం
డయోధ్యకుఁ బోవుచున్నట్లును, గలఁ గన్న దఁట. త్రిజట కల
నిక్కంబై తోఁచెడిని. రాముండు వానర సైన్యంబుతోఁ గూడి
సముద్ర తీరంబునకు వచ్చియున్నాఁడని చారులు విన్నవించిరి. ఆ
రాముని దూతలు మఱల నిచ్చుటకు రాక మునుపే శ్రీరామచంద్రు
నకు సబహుమానంబుగా సీతను సమర్పించుటయ లెస్స కార్యము.
ఇంత చెప్ప నేల? మొన్న నొక్క దూత వానరవేషంబున వచ్చి
తన పరాక్రమంబు నీకును బరివారమునకును నెఱింగించిపోయె,
నది గుఱుతుంచుకొమ్ము." అని యిట్లు నీతి చెప్పు తమ్మునిపైఁ
గోపించి, దిగ్గున కొలువుకూటంబు విడిచి యంతఃపురంబునకుఁ
బోయె, నా సమయంబున నా సభలోని వా రందఱును దమతమ
మందిరంబుల కరిగిరి. 13

క. మఱునాఁ డెప్పటి యట్లనె
సురుచిరముగఁ గొలువు సేయఁ జోద్యంబుగ ని
ద్దుర వోవు కుంభకర్ణుఁడు
సరిగా మేలుకొని వచ్చె సరభస లీలన్. 14

వ. ఇట్లు వచ్చి, గృహప్రవేశంబుఁ జేసి, స్నానాది క్రియలు నిర్వర్తిం చుకొని, భుజియించి, మంత్రులతో నన్ను కొలువునకుఁ జనుచుండు కుంభకర్ణునితో, మఱల విభీషణుండును మంత్రి సహితుండై వచ్చెను. అనుజు లిద్దఱును వచ్చి నమస్కరించిన దీవించి, సేమం బడిగి, యుచితాసనంబులం గూర్చుండ నియోగించినఁ, గుంభకర్ణుం డత్యంతమును నాసన్నుండై కూర్చుండెను. కొంచెము దూర ములోఁ గూర్చుండియున్న విభీషణుండు మరల నన్నుతో నిట్లనియె: 15

సీ. దశరథరాముండు తన పత్నిఁ గోల్పోయి
*వానరావళిఁ గూడి వచ్చి యిప్పు
డదె చూడు మంభోధి యావలి యొడ్డునఁ
గపి బలంబులతోడఁ గలసి యుండె,
రాముని సత్త్వంబు రమణిచే ము న్వింటి
మాతని తమ్ముండు నట్టిఁడంట
సొరిది వారికిఁ బ్రాపు సుగ్రీవుఁ డున్నాఁడు
వార్ధి నిన్ ముంచినవాని తమ్ముఁ,

తే. డాతఁ డిట వచ్చి నిన్ను నుగ్గాడి కాని
సీతఁ దే నని పంతంబు చేసె నంట,
వలదు వైరమ్ము, సీత నీవలయు వేగ
నతని నని గెల్వఁగాఁ జాల రమర వరులు. 16

తే. రాము గెలువంగ వచ్చునే రాజసమున?
సీత నర్పించి, త త్పదాబ్జాతములకు

* వానర్లఁ గూడుక వచ్చినాఁడు

నర్థిఁ బ్రాణమిల్లి, శరణ మన్న నతఁడె కాచు,
సత్య సంధుండు స త్కృపా సాంద్రుఁ డతఁడు 17

ఆ. చంప వచ్చినట్టి శత్రువు నైనను
శరణు చొచ్చినంత సదయుఁ డగుచు
నభయ మిచ్చి కాచు టాతని బిరు దంట,
సీత నిచ్చి రాముఁ జేరి బ్రతుకు. 18

వ. అనిన విని యా రావణుండు కటకటంబడి విభీషణునితో రోష
భీషణంబుగా నిట్లనియె: 19

రావణుఁడు విభీషణుని దూషించుట

తే. నీవు †నా దాయతోఁ గూడి నీచ బుద్ధి!
బుద్ధి సెప్పెదు నాకుఁ దమ్ముఁడవె నీవు?
కడఁగి నీ మంత్రులను నీవుఁ గంటి లోని
నెరసు సరవిగ నున్నారు నిశ్చయముగ. 20

తే. నాకుఁ దమ్ముఁడ వయ్యు ననార్యముగను
నాదు శత్రులఁ బొగడుచు, నాకు బుద్ధి
సెప్ప వచ్చితి వౌ రౌర! సిగ్గు లేక
యిచ్చ వర్తింపుచుండు టి దేమి పనిర! 20

వ. అనిన విభీషణుం డన్న కిట్లనియె: 22
తే. నిన్నుఁ జంపఁగఁ దలపోసి, నీదు మంత్రి
వరులు గాచుచు నున్నారు, వలదు గోత్ర
కలహ, మీ చెడు బుద్ధి యే కరణి నబ్బె?
నన్న! యిం కొక్క కొన మాట యాలకించు. 23

వ. రామచంద్రుం డాదినారాయణుండు, సీత యాదిలక్ష్మి, వానర
బలంబు బృందారక సందోహంబు, గావున నీ వా రామచంద్రున

† వానర్లఁ గూడుక

కెదిరి జయంబు గొనుట కడింది కార్యంబు. నేఁ జెప్పిన బుద్ధి
విని వేగ నా రాముని శరణు చొఱుము. సుఖంబుగ మనుము.
అని విన్నవించిన హిత వచనంబులు రోగికిఁ బథ్యాహారంబు
రుచింపని పోలికను వీనుల కసహ్యంబులై యుండ రావణుండు
మండిపడి యిట్లనియె: 24

సీ. పటు విషం బొలికించు పాములతో నైనఁ
 జెలఁగి యింపుగఁ జెల్మి సేయవచ్చుఁ
 గాని, శత్రుల నెప్డుఁ గై వారములు సేయు
 వానిని దన ప్రాణ బంధు నైనఁ
 జేరఁ దీసినయేనిఁ జేటు వాటిల్లును.
 గావున వీని బ ల్గర్వ మణఁతు.
 విను కుంభకర్ణ! నీవును రాక మునుపు నీ
 చెడుగు నాకును బుద్ధి చెప్పఁబూనె

ఆ. ననుచు హుంకరించి యవ్విభీషణుఁ బట్టి
 వేగఁ గత్తిఁ బూని వ్రేయఁబోవ
 నటఁ బ్రహస్తుఁ డప్పు డడ్డముగా వచ్చి
 దేవ! నీకుఁ దగునె యీ విధంబు? 25

రావణునికిఁ బ్రహస్తుని శాంత వచనములు

క. నీ కేల యింత కోపము?
 నీకు హితముఁ జెప్పుచున్న నీ తమ్ముని నీ
 వే కత్తి వ్రేసి చంపిన
 లోకులు నిను మెత్తురయ్య లోకస్తుత్యా! 26

తే. గుణ యుతుండైన మన విభీషణుఁడు లేని
 లంక యేటికి? సైన్యంబు లింక నేల?
 వైభవం బేల? యీ మీఁదఁ బ్రాణ మేల?
 శాంత మవధారు దేవ! నీ స్వాంతమందు. 27

వ. అని ప్రహస్తుండు రావణు కోపంబును గొంత శాంతపఱిచె. నప్పు డన్న కోపంబునకుఁ దమ్ముండు కుంభకర్ణుండు వడవడ వడంకి యన్న కెదురాడ నోపక, తమ్ముని గాదనలేక, గద్దియమీఁదఁ గూర్చుండియున్న యన్నకు మ్రొక్కి, నిదుర గృహంబునకుం జనియె. అట రావణుండు విభీషణుం జూచి, యోరీ! నీవు విశ్వాస ఘాతకుండవు. స్వామి ద్రోహివి. గావున నీవు నా కొక్క పేద నరుని బెద్దచేసి చెప్పెద. వాఁడె పౌరుషశాలి యేని నీ వాతనిం జేరి సుఖంబున బ్రతుకు మనిన నతం డిట్లనియె: 28

సీ. విను రాక్షసేశ్వర! విష్ణు సన్నిభుఁడు రా
ముండు హా! పేద నరుండె నీకు?
నతని సత్య స్థితి, యతని పరాక్రమం
బిపుడు నీ కెఱుంగంగ నెట్టు లగును?
అవనీశు బాణంబు లతి రయంబున వచ్చి
దండించునపుడైనఁ దలఁచు నన్నుఁ,
బర్వత శిఖరముల్ పడినట్లు నీ తల
లిలఁ గూలునపుడైనఁ దలఁచు నన్ను.

తే. నీకుఁ దమ్ముండ నౌట నే నీవు బ్రతుకు
కొఱకుఁ జెప్పిన నీ కింత కోప మేల?
వినుము నా మాట, సీత నర్పించి యతని
శరణు వేడుము, వలదు నీ సాహసమ్ము. 29

వ. అని చెప్పిన హిత వచనంబులకు మఱింత కోపోద్దీపిత మానసుండై యాజ్యాహుతిం బ్రజ్వరిల్లిన హుతాశను గతి న్మండిపడి, పెళపెళ నార్చి. గద్దియమీఁదం గూర్చున్న విభీషణుని వక్షంబు పగులం దన్నిన, నతండు తన కన్నులనుండి తొరఁగు జల కణంబులు హస్తంబులం దుడిచికొనుచు, నా క్షణంబున మంత్రులం దానును దన తల్లియైన కైకసి యొద్దకుం జని, సాష్టాంగ దండ ప్రణామం బాచరించి, యన్న చేసిన దుర్ణయం బెఱింగించి, శరణాగతవత్సలుం

దైన శ్రీరామచంద్రుని సన్నిధానంబునకుఁ బోవుచున్నాఁడ నని చెప్పి, యా యమ్మ యనుమతంబు వడసి, దీవనలు గై కొని, చని సముద్ర తీరంబున విచారగ్రస్తుండై యున్న శ్రీరామచంద్రునిం గని విభీషణుండు, 30

## విభీషణ శరణాగతి

సీ. భాను కులోత్తంస! వంది తామర లోక!
జానకీ నాయక! శరణు! శరణు!
తాటకా ప్రాణ విదారణ! రఘురామ!
సకల లోకాధార! శరణు! శరణు!
దిక్కు నీవని వచ్చితిని దీన మందార!
పరమ పూరుష! రామ! శరణు! శరణు!
మాతృ పిత్రాదుల మాదిక్కు సంరక్షించు
సర్వ లోక స్తుత్య! శరణు శరణు

ఆ. రాను వెఱచినాఁడ రక్షించు రక్షించు,
మిపుడు నాకు నభయ మిమ్ము ఇమ్ము
చూడు చూడు శరణు చొచ్చితిఁ జొచ్చితిఁ
గావు కావు నన్నుఁ గరుణతోడ. 31

వ. అని యి వ్విధంబున రామచంద్రుని స్తుతి సేయుచుఁ జేరవచ్చు తఱిని, సుగ్రీవుండు శ్రీరామచంద్రుని గని విశ్వాసంబు సూపు వాఁడై "దేవా! వీఁడు రావణుని తమ్ముండు, విభీషణుం డనువాఁడు. రాక్షసులు మాయలు సేయుదురు. గాన వీని వధింప నాజ్ఞ యొసంగు" మనిన రామచంద్రుం డందులకు సమ్మతింపక యితం డెవ్వండైన నేమి, శరణన్న రావణుని తమ్మునినే కాదు. రావణు నైనను గాచెద. శరణని వచ్చిన వాని ప్రాణంబులు గాపాడుట రాజులకుఁ బరమ ధర్మంబు. తొల్లి శిబి చక్రవర్తి రాజ్యంబు సేయుచుండ నొక్క ఖగం బేఁతెంచి, శరణు చొచ్చిన నభయం బిచ్చి, తన దేహముం గోసి, దానిం దఱుముకొని వచ్చిన డేగ కిచ్చె

నఁట. కావున నాతని నా యొద్దకుఁ గొని ర మ్మనవుడు, సుగ్రీవుండు విభీషణుని దోడ్కొనితెచ్చి, శ్రీరామచంద్రుని పాదారవిందము లపైఁ బడవైచిన, నతండు విభీషణు నెత్తి, యాలింగనంబు చేసి, యభయ ప్రదానం బొసఁగి, నేఁడు మొదలు నీవు మాకు హితుండవు, బంధుఁడవు నయితివి, గావున నిన్ను మా తమ్ములలో నొక వానిగాఁ జూచుకొనియెద నని నమ్మఁ బలికి, విభీషణా! యింక వైరి ప్రభావంబు చెప్పు మనిన, దశరథ నందనునకు వందనం బాచరించి కరంబులు శిరంబున ధరించి, యతం డిట్లనియె: 32

విభీషణుఁడు రామునికి రావణుని బల సంపదను దెలుపుట

క. రావణు బల సత్త్వ స్థితి,
యా వీరుని శౌర్య మహిమ, యభినుతి సేయన్
నా వశముగా, దతం డల
దేవేంద్రుని వెట్టి గొనును దినము నరేంద్రా! 33

క. ఒక్కొక్క గవని వాకిట
నొక్కొక యేనూరు కోటు లుందురు దైత్యుల్,
పెక్కురఁ గావలి యుంచును,
దక్కక మఱి యెల్ల కడలఁ దాను దిరుగున్. 34

వ. తన కుమార వర్గంబు లక్షయుం బదివేలు, వారల కొక్కొక్కరికి లక్షమంది బంట్ల నేర్పఱచి యుంచిన, వారు లంక వీథులలోఁ గొందఱును, నగరు చుట్టును గొందఱును, మఱికొన్నిచోట్ల మఱి కొందఱును, గుంపు గూడి తిరుగుచుందురు. అయినను బ్రహ్మా దుల కైనను సాధింప వలను పడని లంకా పట్టణము మీచేత సాధింపఁబడఁ గలదు. కావున మీరు వేవేగ సముద్రుని బ్రార్థించి, సముద్ర బంధనంబు సేయవలయు, ననిన నంత మహేంద్ర పర్వతంబు దిగ్గి, సముద్ర ప్రాంతంబున విడిసి, జాంబవ దంగద సుషేణ నీల మైందాది వనచర వీరులచేత నలు దిక్కులయందుం గల పర్వతంబులను బాషాణంబులను దెప్పించి కడలి కట్టం గడంగిన, 35

## పర్వతములు రువ్వి వారిధిపై వారధి తీరుప వానర వీరుల సముత్సాహము

శా. కూపారుండును సంతసిల్లి, జలజాక్షుం జూచి మిన్నంది, స
ల్లాపం బుద్ధతిఁ బొంగఁ జూచి, విరసోల్లాసంబునన్ రాఘవ
క్ష్మాపాలుండును గోపముం గదుర, నీ గర్వంబు నాచేత వ
మ్మై పో నిప్పు డటంచు లక్ష్మణుఁడు విల్లందియ్యఁ, బెన్వేఁకతోన్.

మ. పరుషోద్యత్కుటి లాకృతిన్ బొమలు చూపట్టంగ, శోణ ప్రభో
త్కరరేఖల్ గను గొల్కులన్నిగుడఁ, గోదండంబు చేఁదాల్చి, భూ
వర వంశాగ్రణి రాముఁ డద్భుతముగా వారాశి మీఁదన్ వడిన్
శర జాలంబులు పేర్చి వ్రేయుటయు, నిచ్చన్ బ్రాణ భీతిన్ వడిన్.

క. రాముని యెదుట సముద్రుఁడు
తా మానవు రూపు దాల్చి, దైన్యము దోఁపన్
రామునకు మ్రొక్కి, యపు డా
ధీమంతున కనియె నిలిచి తేజం బెసఁగన్.. 38

ఆ. ఇంక నేల తడయ నిన కులాధీశ్వర!
కపులఁ బంపి వేగఁ గట్టు మయ్య!
కట్టఁ గట్టి దాటు కమలాప్త కుల చంద్ర!
నీదు కీర్తి లతకు నెలవు గాఁగ. 39

వ. మిమ్మును దరిసించుటకు మిన్నంటఁ బొంగితి, నింతియ కాని కప
టోపాయంబునఁ బొంగిన వాఁడను గా ననిన, రామభద్రుండు
కరుణా సముద్రుండు గావున సముద్రు నెప్పటి యట్ల యుండ
నియమించి వానరులఁ బనిచిన. 40

క. రాముని పంపునఁ బ్లవగ
స్తోమం బ ట్లరిగి యరిగి, దొడ్డగు కొండల్
క్షేమమునఁ దెచ్చి జలనిధి
రా మాజ్ఞను వైచి రధిక రభసం బొప్పన్. 41

## సముద్రమునఁ బర్వతములను మ్రింగివేయు మహా మత్స్యములు

వ. అట్లు వానర వీరులు పర్వత పాషాణ వృక్ష జాతంబులు లక్షోప లక్షలుగాఁ దెచ్చి, వారాశిం బడవైచి, త ద్గుభగుభ ధ్వానంబుల కుప్పొంగుచు, బ్రహ్మాండ భాండంబు బ్రద్ద లగునట్లుగా నార్చుచు, నట్టహాసంబులు సేయుచు, గంతులు పెట్టుచు, వెక్కిరింపుచుఁ, బరువులెత్తుచు, మున్ను దెచ్చివైచిన పర్వతాదుల నెల్లఁ దిమింగిలములు మ్రింగ నా సమయంబున, 42

ఆ. తిరుగఁ దెచ్చి వైనఁ దేలి రాకుండుట
నాత్మలోన సంశయంబు నొంది,
రాజసింహుఁ డపుడు రత్నాకరుని జూచి
యడుగుటయును వేగ నాతఁ డనియె : 43

## నలునిచే సేతు నిర్మాణము

సీ. రావణు పంపున రా లెల్లఁ జేపలు
మ్రింగుచుండెఁ గదయ్య మేదినీశ!
తిమి తిమింగిలములు దిరుగుచు నాయందు
నుండి రావణు పంపు నొనరఁ జేయు,
నలుఁడు కట్టినఁ గాని నిలువ నేరదు కట్ట
నలుని బంపఁగదయ్య నలిననేత్ర!
యని సరి త్పతి సెప్పి య వ్వేళ నరిగిన
వీడు లిచ్చట మహా వీర్యమునను

తే. పర్వతంబులు తేరఁగా, భాను కులుని
పంపుచేతను వారిధిఁ బరఁగ వేగ
నలుఁడు నా ప్రొద్దె పది యోజనములు గట్టె,
నంతలో సూర్యుఁ డస్తాద్రి కరుగుచుండె. 44

## కపిసేనతో శ్రీరామచంద్రుని లంకా ప్రవేశము

వ. అంత సూర్యాస్తమయం బగుటయు వానరేంద్రులు తమ బలం బులం గూడి వేగు నందాఁక సేతు బంధనంబునకుఁ గాపుండిరంత, సూర్యోదయం బయిన వెంటనే మహా బలశాలి యగు హనూమంతుండు సువేలాద్రి కరిగి, యా నగంబు పొంత నున్న హేమ కూటంబును, నాగపర్వతంబును, సింహాచలంబును నను మూఁడు కొండలు వాలపాశంబునం బెకలించి, నిమ్మపండ్ల మాడ్కిఁ, బాల బంతుల వంతున నెగులవైచుచు నేతెంచి నలున కందిచ్చిన, నా పర్వతంబులు మూఁడును దొంబది యోజనంబులు నిడుపు గల్గి యుండ, ని వ్విధంబున శత యోజనములు నిడుపును, దశ యోజ నంబులు వెడల్పునుఁగా నీరధిని బంధించి, నలుం డా వార్త రామున కెఱింగించినతోడనే యతండు లంక లగ్గలు వట్ట నుద్యోగించి, పనసు నుత్తరపు గవను, జాంబవంతుఁ బడమటి గవను, హనుమంతుఁ దూరుపు గవనుఁ బట్ట నియమించిన వారలును లంకాపురంబు లగ్గలకుం జొచ్చి, రాక్షసుల నుగ్గునూచంబు గావించుచుండ, హతశేషులు పరుగెత్తి, యా వింత యంతయు రావణున కెఱింగించిన నతండు చింతాక్రాంతుండై, దేవాంతక నరాంతక కాతికాయ త్రిశిరో మహోదర మహాపార్శ్వాదుల, రామ లక్ష్మణులం జంపి వారి శిరంబులు గొని రండని పనుప, వా రరుగు దెంచి ఘోరాహవంబునం దమ శిరంబులె రామలక్ష్మణుల బాణం బుల కర్పించిన, వారిలోఁ జావక మిగిలిన యతికాయుం డరుగు దెంచి తండ్రియగు రావణున కిట్టు లనియె : 45

### అతికాయుఁడు వానరుల దుండగములను రావణునకు మనవి సేయుట

శా. దేవా! భాను కులావతంసుఁడు, మహా ధీరుండు, రాముండు బా హావిర్భూత మహా ప్రతాపమున దైత్య వ్రాతమున్ భూరి వీ

రావేశంబునఁ ద్రుంచెఁ బో, మనమునం దాశ్చర్యమున్ భీతియున్
ద్రోవన్ వేఱ వచింప నేల, యిఁకఁ దద్ఘోర ప్రతాపోన్నతుల్. 46

వ. అని అతికాయుఁడు విన్నవించిన నుల్కిపడి కుంభకర్ణుని మేల్కొ-
లుపఁ బనిచిన, నతండును లేచి యావులింపుచుఁ, బండ్లు గీటుచు
లయ కాల మృత్యువుం బోలె నేఁతెంచిన, నట్టి యనుజుం జూచి
దశముఖుం డిట్టులనియె : 47

కుంభకర్ణుని సమర వీరము

క. అనిలో నీ వా రాముని,
ననుపమ బలశాలి యైన యనిల తనూజున్,
ఘనుఁ డగు లక్ష్మణుఁ గూలిచి
విను, వారల తలలు గొంచు వేగమ రమ్మీ। 48

వ. అని యనిపిన, 49

సీ. భేరీ మృదంగాది భీమ వాద్య ధ్వాన
ములకు సముద్రముల్ పొంగి పొరలఁ,
గపుల పాలికి లయ కాలుఁడో యనుచును,
విను వీథి దివిజులు వెఱచి తొలఁగ,
నతికాయుఁడును మహా హంకారమున వేగ,
వెనువెంట రోష ప్రవృత్తిఁ జనఁగఁ,
గుంభకర్ణుండు కాకుత్స్థు పైఁ బోయిన
దక్షిణోత్తర సముద్రముల రీతిఁ

తే. గదిసి యిరువురుఁ బోరాడఁ గడఁగుటయును,
గపులు వేవేగ వచ్చిరి విపుల శక్తి,
సాధ్య గంధర్వ పతు లెల్ల సరభసమునఁ
జూచుచుండఁగఁ బోరిరి సురుచిరముగ, 50

## అతికాయ కుంభకర్ణుల సంహారణము

వ. ఇట్లు పెద్దయుం ప్రొద్దు వీరావేశంబునఁ బోరుచుండఁ. గుంభకర్ణుండు విజృంభించి బలంబుల కడికి, దిగ్గజ కర్ణపుట స్ఫాటితంబుగా నార్చుచు, వానర వీరుల నసంఖ్యంబుగా మ్రింగుటకుం గడంగిన, రఘువీరుం డలిగి బ్రహ్మాస్త్రంబు ప్రయోగించి వాని శిరంబును దునుమాడె, నంత నతికాయుండు తన పినతండ్రి పాటున కలిగి, రాఘవేంద్రుని కభిముఖంబుగా నిలిచి దివ్యాస్త్రంబులు ప్రయోగించుచుండ లక్ష్మణుం డడ్డు సొచ్చి, నానాస్త్రంబులు ప్రయోగించి, ఘోరంబుగ యుద్ధంబు సేసి కడపట వారుణాస్త్రంబు వింట సంధించి విడిచిన, నది యతికాయుని శిరంబుం ద్రుంచె, నంత హత శేషులైన రాక్షసులు కాందిశీకులయి రావణుం జేరి,

తే. దేవ! దేవాంతకుఁడు సచ్చె దీనవృత్తిఁ.
గుంభకర్ణుండు సమసెను ఘోర లీలఁ,
దెగువ నతికాయుఁడును మ్రగ్గె, దీని కింకఁ
బూని ప్రతికార మొనరింపు భూరి తేజ! 52

వ. అని విన్నవించిన మండిపడి రావణుం డింద్రజిత్తుం బంపిన నతం డాగ్రహంబున, 53

## ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముచే వానర సైన్యమును హతమార్చుట

క. పర వీరులపై వైశ్వా
నరుచేఁ గొన్నట్టి చాప నారాచములుం
బరిఘయు, బ్రహ్మాస్త్రముఁ గొని
దురమొనరింపంగ వచ్చె దోర్బల శక్తిన్. 54

వ. త దనంతరంబున, 55

క. తండోపతండములుగాఁ
జండాకుగ సమితిఁ బఱపి, శైల శరాశిన్

గాండ్ర మయంబుగఁ జేయుచు.
ఖండన మొనరించె దైత్యపతి పుత్త్రిండున్. 56

సీ. మిన్నక రామ సౌమిత్రులమీఁదను.
బ్లవగ సేనలమీఁద బాహుశక్తి.
బ్రహ్మాస్త్ర మదరింపఁ, బటు నినాదంబునఁ
బఱతెంచి వానర ప్రతతిమీఁద
బ్రహ్మమంత్ర జ్ఞాన పరులైనవారి ని
ర్బంధంబుగాఁ జుటి పట్టి కట్టి.
తక్కినవారల నుక్కడగించినఁ
గనుగొని యమరేంద్ర కంటకుండు

తే. వైర మెల్లను నేఁటితోఁ దీఱె ననుచు
మించి కెరలుచు వి ల్లెక్కు డించి పొదలి
శాంతతను బొందె. రాక్షస చక్రవర్తి
కడకు నేఁగెను వడి ముద్దుఁ గొడుకుఁగుఱ్ఱ. 57

క. మునినాయక! విను మంతటఁ
దన మనుమల పాటు దెలిసి తనలోఁ దానే
కనుగొనఁ జాలక పోయెనొ
యనఁగను నపరాబ్ధిలోన నర్కుఁడు గ్రుంకెన్. 58

క. అరవింద భవుని కరుణను
వర మందిన వాయు సుతుఁడు. వసుమతిమీఁదన్
మఱి బ్రహ్మమంత్ర జపమున్
బిరుదై యున్నట్టి యల విభీషణుఁ డొకఁడున్. 59

వ. తక్కఁ దక్కినవా రెల్లరును మూర్ఛా గతులై చచ్చినయట్లు పడి యున్న సమయంబున, వాయు సుతుండును విభీషణుండును దమలో నెవ్వరు సచ్చిరో? నొచ్చినవా రెవ్వరో? విచారింపఁదగు నని మహో గ్రాంధకారంబు నడుమ నింగలపుఁ గొఱవులు పట్టుకొని, (రణ

రంగంబుఁ గలయ శోధింపుచు వచ్చి శర తల్పంబున నున్న
జాంబవంతునిం గని విభీషణుం డిట్లనియె: 60

క. భల్లూ కేశ్వర! వానరు
లెల్లను నృప వరులతోడ నిలమీఁదను మూ
ర్ఛిల్లియుఁ, జచ్చియు నున్నా
రొల్లంబోవ్వడును దీని కుపమ యె టన్నన్. 61

ఆ. అపుడు జాంబవంతుఁ డసురేశ! నీ వంకఁ
గన్ను విచ్చి చూడఁ గానరాదు.
వాయు సుతుని మేలు వార్త నా కిప్పుడు
చెవులు సోఁకునట్లు చెప్పుమయ్య! 62

వ. అనిన విని హనుమంతుండు, 63

చ. పదములఁ జేరి మ్రొక్కుచును బాణి యుగంబును మోడ్చి, నీ
కృపన్
బ్రదికినవాఁడ నన్న, నతి ప్రీతిని జేరఁగఁ దీసి, నీ విటన్
బ్రదికితి గాన నీకతనఁ బార్థివ ముఖ్యుని సేన లన్నియున్
బ్రదుకునిజంబుగా నిపుడు పావని! యంచుఁ బ్రియంబు సేయుచున్.

హనుమంతుఁడు తెచ్చిన సంజీవినిచే వానర వీరుల

పున రుజ్జీవనము

వ. వినుము వాయు నందనా! యా లవణ సముద్రంబును దాఁటి, హిమవంతంబును నిషధాచలంబును గడచి, మేరు శైలంబును వెండి కొండయును శ్వేత పర్వతంబును నతిక్రమించి, ఘృత సాగరంబు లంఘించి, ద్రోణగిరి మధ్యంబునం దున్న యౌషధ శిఖరంబునం గల సంజీవిన్యాది దివ్యౌషధంబులు గొనివచ్చి, రాఘవ ప్రీతిగా సైన్యంబుల ప్రాణంబులు నిలిపి కీర్తి వడయు మని ప్రార్థించిన, నియ్యకొని వాయునందనుండు వాయు వేగ

మనో వేగంబులం జని, జాంబవంతుండు చెప్పిన దివ్యౌషధా చలంబునె కొనివచ్చి, సకల సైన్యంబుల ప్రాణంబులు గాచి, నిమేష మాత్రంబున న క్కొండ తొల్లింటి యునికిపట్టుననె నెల కొల్పి వచ్చె నపుడు, 65

క. ఇనుఁ డుదయ పర్వతంబునఁ
గనుపట్టినఁ, దెల్లవాఱఁ, గపి సైన్యములన్
జననాథుఁ గాంచి మ్రొక్కిరి,
జనపతియును వాయు సుతుని సంశ్లాఘించెన్. 66

కుంభ నికుంభాది రాక్షస వీరుల నిహతి

వ. అంత నింద్రజిత్తు పరాక్రమంబునకు సంతోషించి, నిజంబును గల్లయును దెలియుటకు రావణుం డనుపఁ జారు లేతెంచి, యుత్సా హంబుతో యుద్ధ సన్నద్ధులై కెరలుచున్న వానర బలంబులం గనుంగొని మరలి చనుదెంచి, రామచంద్రుని బలంబున్న తెఱం గెఱింగించిరి. అది విని కలంగియుఁ గలం గనిన భంగి నాశ్చ ర్యంబు నొంది, రామ లక్ష్మణులపైకిఁ గుంభ నికుంభ గవాక్ష ప్రజంఘ శోణితాక్షులం బంపిన, వారును దమ తమ బలంబుల తోడఁ గరి తురగ రథారూఢులై వెడలి, సింహనాదంబును సేయుచు, నా వానర సైన్యంబుపైఁ గవిసి శర వర్షంబులు గురియుచుఁ, బరిఘలం జక్కు సేయుచు, నడిదంబుల వ్రేయుచు, ముద్గరంబులం జెండుచు, ముసలంబుల మోఁదుచుఁ, గరులచే మట్టింపుచుఁ దురంగములచేఁ ద్రొక్కింపుచు, రథంబులం దోలి వెంపరలాడుచు, మ హాహవంబు సేయు సమయంబునఁ గపి బలంబు లదరి, గిరి వర్గంబులుఁ, దరు వర్గంబులును ననర్గళంబుగఁ గైకొని ప్రతిఘటించి పోరాడునప్పుడు, 67

క. తెంపున వాలి కుమారుఁ, డ
కంపనుఁ డను వాఁ డెదుర్పఁ, గని కోపమునన్

గంపింపఁ బట్టి వానిని
జంపెను వక్షంబు పొడిచి సాహస వృత్తిన్. 68

69
వ. అప్పుడు,

చ. కనుగొని శోణితాక్షుఁడు, నకంపను బ్రాణముగొన్న వాలి నం
దనుని పయిం గడుం గినిసి, తార్క్ష్యని, తాఁకి, రథంబుఁ ద్రోలినం
గనలుచు నంగదుండు తురగంబులతోన రథంబు నుగ్గుగా
దనుజుని మీఁదఁ దా నుఱికి తన్నిన వాఁడును గూలె నేలపైన్.70

ఆ. అతఁడు నేలఁ గూల నా ప్రజంఘుండును
ఘనుఁడు యూపనేత్రుఁ డెనసి, వాలి
కొడుకుమీఁద రాఁగఁ, గోపించి మైందుండు
ద్వివిదుఁ డంతలోనె తెంపు మిగిలి. 71

క. దనుజులఁ ద్రోలఁ బ్రజంఘుఁడు
గనుగొని య వ్వాలిసుతుని కటములు పొడువన్
గనలి నిశాచరు శిరమును
ఘనతర దృఢ ముష్టిఁ బొడిచి కడపెన్ ధరకున్. 72

సీ. ఘనుఁడు ప్రజంఘుండు కదనంబులోఁ బడ్డ
నక్షయబలుఁడు, యూపాక్షుఁ డంత
గదఁ గొని వ్రేసిన ఘనతతోఁ గుప్పించి
భుజ శక్తి నాతనిఁ బొదివి పట్టి
కొనిపోవు నప్పుడు కోపించి యన్నకై
శోణితాక్షుఁడు వచ్చి శూరుఁ డగుచు
విడిపించుకొనఁ జూడ, వడిగ మైందుఁడు డాసి
కలన యూపాక్షుని గడసి పోరి

తే. సాహసంబున నొఱలంగఁ జంపుటయును,
శోణితాక్షుండు ద్వివిదుని జూచి పొడువ
నతఁడు మూర్ఛిల్లి తెప్పిరి యసురఁ బట్టి
శిరము శూలంగ నడిదంబుచేత వ్రేసె. 73

తే. శోణితాక్షుండు పోరిలోఁ జూర్ణ మయినఁ
గుంభుఁ డప్పుడు కోపించుకొనుచు వచ్చి
ద్వివిదు నెదుఱొమ్ము నాటఁగఁ దీవ్ర శరము
లేసి వడిఁ జంపె నాజిలో నేమి చెప్ప। 74

క. తమ్ముని పాటు గనుంగొని,
హుమ్మని మైందుండు కుంభు నురుతర ముష్టిన్
ఱొమ్మునఁ బొడిచిన, నతఁ డొ
క్కుమ్మునఁ గూలంగ నేసె నమరులు దలఁకన్. 75

ఉ. అంగదుఁ డంతఁ గుంభుని శతాంగముపై నొక పర్వతంబు భూ
మిం గలయంగ వేయుటయు, మేదినికిన్ వడి దాఁటి వాలి పు
త్త్రుం గని దైత్యుఁ డాగ్రహముతో ముసలంబున వ్రేయ, నొచ్చి తోఁ
కం గొని వజ్రిపౌత్త్రుఁడు సగర్వమునన్ దగ మోదె నార్చుచున్.

క. కాలాంతక రుద్రులతోఁ
బోలుపఁ దగు కుంభుఁ డపుడు భుజ బల శక్తిన్
వాలి కుమారుని ధరపైఁ
గూలఁగ వడి నేసె నైదు కోలలచేతన్. 77

వ. ఇట్లు వాలి కుమారుండు కుంభునిచేత బాణ పీడితుండై పడుట యెఱింగి, రామచంద్రుఁడు వానిపై సుగ్రీవ జాంబవ ద్ధనుమ దాదులం బంపిన, 78

క. వారంద ఱధిపు నాజ్ఞను
భూరుహములు, గిరులుఁ గొనుచు। భువనము లదరన్
భోరున నార్చుచుఁ గుంభుని
దారసమై వ్రేసి రంత దర్పోద్ధతులై. 79

క. వారలు వేసిన తరు గిరు
లారయఁ దనుఁ దాఁకకుండ నవి తునియఁగా,

గ్రూరాస్త్రంబులఁ దునుముచు
నారసముల వారి వారి నాటఁగ నేసెన్. 80

క. ఏసినఁ, గుంభుని రవిజుం
డా సమయమునందు నేసె నద రంటంగా
నేసినఁ, గ్రమ్మఱ రవిజుని
గాసిల వక్షంబు పొదువఁగా నిలఁ బడియెన్. 81

తే. మూర్ఛ తేఱి యా రవిజుఁ డమోఘ ముష్టి
పూని దైత్యుని ఱొమ్ముపైఁ బొడువ నంత
శరధి మథియించు మంద రాచలము మాడ్కి
ధీరత యడంగి దిర్దిరఁ దిరిగి పడియె. 82

ఉ. కుంభుఁడు గూలినం గని, నికుంభుఁడు దాఁ బరిఘాయుధంబు సం
రంభ మెలర్పఁ ద్రిప్పి, దినరాజ తనూజునిపైకి రాఁగ, బల్
సంభ్రమ మొప్ప వాయుజుఁడు శౌర్యము గన్పడ, నడ్డమైన ది
క్కుంభి గముల్ కలంగఁగను గొబ్బున వక్షము వైచె నార్చుచున్.

క. వేసిన పరిఘాయుధ మది
వీసము నాటంగ లేక విఱిగిన, మిగులన్
గాసిలి దైత్యుఁడు పవనజు
నా సమయమునందు నేసె నడిదముచేతన్. 84

తే. అంత హనుమంతుఁ డుగ్రుఁడై యసుర గళము
నందు వాలంబు దగిలించి యాకసమునఁ
ద్రిప్పి ధరణీ తలంబునఁ ద్రెళ్ళఁ గొట్టి
సింహ నాదంబుఁ జేసె నచ్చెరువు గాఁగ. 85

వ. అట్టి సమయంబున, 86

క. హత శేషులు ఘటకర్ణుని
సుతు లాహవ భూమిఁ దెగిన సుద్దులు లంకా

పతి కెఱిఁగించిన దుఃఖో
న్నతుఁడై యొక్కింత తడవునకు నిట్లనియెన్ : 87

తే. మనకుఁ గలయట్టి బాంధవ గణము, సుతులు,
దారలుఁ, బరివారమును, గంధకరులు; హరులుఁ,
గుటిల కపి యోధముల బారి గూలియ లగుచుఁ
దెగిరి మునుముట్ట నేఁటితోఁ దీవ్ర గతిని. 88

వ. అని చింతింపుచుఁ గొంత వడికి ధైర్యంబుం గొని, 89

శ్రీరాముఁడు మకరాక్షుని రూపుమాపుట

క. దైతేయ వల్లభుఁడు కడు,
బ్రీతిన్ మకరాక్షుఁ జూచి పృథుతర శక్తిన్
మీ తండ్రి ఖరుని జంపిన
యాతనిపై నూడు వీఁగు మరుగు మటన్నన్. 90

సీ. సింధుర రథ భట సైంధవంబులతోడఁ
దలచైన పట్టు ఛత్రములతోడఁ
బటహ భేరీ ముఖ్య బహు వాద్యములతోడ
దట్టంపు నానాయుధములతోడ
వంది మాగధ సూత బృంద స్తుతులతోడఁ
గెరలాడు బిరుదు టెక్కెములతోడ
బహుళ కాహళ శంఖ ఢాంకారములతోడ
రాజిల్లు నవ చామరములతోడ

తే. నడిచె దిగ్దంతి భూదార నాగ కూర్మ
కుల నగేంద్ర యుతముగ భూతలము గదలఁ
బద రజఃపాళి సంఛన్న భానుఁ డగుచు
దక్షుఁ డైనట్టి మకరాక్షుఁ డా క్షణంబ. 91

వ. ఇట్లు భయంక రాకారంబుగాఁ గదలి, వానర వీరులతోడం దలపడి
పోరాడు నెడ, వానర బలంబులుతలచెడి పాఱుట గని, రాజపుంగవుం

ద్రోహీ! వెఱవకుఁ డని, తన మఱువునకున్ మరలించి, మకరాక్షుం
దేఱి చూచి, చండ కాండముల తండంబులు ఖండించి, హరుల
శరంబుల పాలుచేసి, రథంబులను సారథులతోడం గూడఁ బృథ్విం
గలిపి, బలంబులఁ జలంబునం దఱిమి, సింహనాదంబు చేసినం,
గినిసి మకరాక్షుం డిట్లనియె : 92

క. మా తండ్రి ఖరుని జంపిన
నీతో యుద్ధంబు సేయ నేఁ డిదె కలిగెన్,
నా తీవ్ర నిశిత సాయక
పాతంబుల పా లొనర్తుఁ బగ దీఱ నినున్. 93

మ. అని గర్వోక్తులు పల్కుచుం గెరలి, తీవ్రాస్త్రంబు లా రాముపైఁ
దన బాహా బల శక్తి నేయఁ గని, కోదండంబునం దప్పుచున్
వనజాప్తాన్వయుఁ డేసె వాని నట గీర్వాణుల్ ప్రశంసింపఁగా,
దనుజుం డేసెను రామ భూవిభునిపైఁ దద్బాణ జాలంబులన్.

క. ఆ శరము లుడిపి, మఱి యొక
యాశుగమున వాని చాప మపుడు దునిమి, యా
దాశరథి రథము పొడిగాఁ
గౌశలమున నేయ, వాఁడు క్ష్మా స్థలి కుఱికెన్. 95

ఆ. ధరకు నుఱికి దుష్ట దైత్యుఁడు గదఁ ద్రిప్పి
భానుకులుని నేయ, దాని నొక్క
విశిఖముననె తునిమి, వేగంబె విభుఁ డగ్ని
శరముఁ దొడిగి వాని శిరముఁ ద్రుంచె. 96

క. ఆ యెడ, మకరాక్షుఁడు రిపు
సాయకముల మాఱు నాటి చచ్చుట విని, దై
తేయుఁడు గుండెలు వగులఁగఁ
బాయని దుఃఖంబు పాలుపడి చింతిల్లెన్. 97

వ. ఇట్లు చింతాక్రాంతుండై కొంత తడ వూరకుండి మేఘనాదుని
గనుంగొనియె. 98

క. అక్కటః నీవును, నేనును
దక్కఁగ మఱి తక్కినట్టి దళములు దెగఁగా
నొక్క కపి యైనఁ గానీ
యక్కడ రిపులందు నొచ్చి రనఁగా వింటే? 99

వ. అదియునుం గాక. 100

వానరుల బీరమును వినిన రావణుని బెగడుపాటు

సీ. నాగ పాశంబున నాఁ డాజిలోఁ బడ్డ
ప్లవగు లీ రీతిని బ్రతుకు టెట్లు?
బ్రహ్మాస్త్రమునఁ గూల్పఁబడి ధాత్రి యెడఁబాసి
పోయిన కపు లెల్లఁ బుట్టు టెట్లు?
కుంభకర్ణుఁడు సావఁ గొట్టిన వానరుల్
చెచ్చెఱ జీవించి వచ్చు టెట్లు?
అతికాయుఁ డడఁగించినట్టి కీశ బలంబు
క్రమ్మఱఁ దా నెల్ల గలుగు టెట్లు?

తే. రాముఁ డెన్నంగ నాదినారాయణుండె,
వనచ రావళు లెల్ల దేవతల, మున్నె
కాన లేనైతి, నీ రీతిఁ గదనమునను
వారి గెలువంగ నెవ్వారి వశము చెపుమ? 101

ఇంద్రజిత్తు మాయా సమరము

వ. అని దీనాలాపంబు లాడుచున్న తండ్రికి నమస్కరించి, మేఘనాదుండు మేఘ గంభీర వాక్యంబుల దుఃఖోపశమనంబు చేసి, నేఁటితోడఁ బగ సాధింతు నని ప్రాగల్భ్యంబుగఁ బలికి, యనిపించుకొని, గజ వాజి శతాంగాదు లగు చతురంగ బలంబులు

గూర్చుకొని, ఛత్ర చామరంబులు పిక్కటిల్ల, నట్టహాసంబు సేయుచు, లంకాపురంబు వెడలి, సంగ్రామ రంగంబునకుం జని, తన బలంబులఁ జక్రాకారంబుగా నిలిపి, తన్మధ్యంబున రథావతరణంబు చేసి, రక్తాంబర గంధ మాల్యంబులు ధరించి, లోహ పాత్రంబునఁ గృష్ణసర్ప రక్తంబు నించి, తర్పణంబు చేయుచుఁ, దద్విధి యుక్తంబైన హోమంబులు సేయుచుండు నెడ, నొక కృత్తి ప్రత్యక్షంబై నిలిచి, 'మెచ్చితి వరం బిచ్చెద వేఁడు' మనిన, నతండు తా నాకసంబుననుండి ఖండనంబు సేయునెడఁ, గపులకుం గానరాకుండ నంధకారంబు గావించిన, నేను వారిని జయింతు నని ప్రార్థించిన నియ్యకొనియె. నంత మేఘనాదుండు నభంబున కెగసి, మహాంధకార బాణంబు నేసిన, దానంజేసి పెంజీకటి గప్పినఁ, జీకాకై పాఱుచున్న వానరులం గని, వాయు నందనుండు శ్రీరామచంద్రునితో నిట్లనియె: 102

క. వాయ వ్యాఘ్రముచేతను
బాయును జ మ్మంధకార బాణ విశేషం,
బీ యెడ నేయుఁడు శ్రీరఘు
నాయక! యని విన్నవింప నవ్వుచు నంతన్. 103

క. వి ల్లెక్కు వెట్టి మారుత
భల్లము సంధించి తివిచి పార్థివుఁ డలుకన్
బెల్లార్చి యేసె. గగనం
బెల్లను వడిఁ దూల దైత్యుఁ డిలపైఁ గూలన్. 104

ఆ. రాజతిలకుఁ డంబరమ్మున కెగయంగ
వాయు శరముఁ దొడిగి వేయఁ దడవె
మాయ శక్తి తొలఁగి పోయిన నంతలో
మేఘనాదుఁ డుర్విమీఁదఁ బడియె. 105

చ. పడియును మేఘనాదుఁడు సుపర్వులు బెగ్గిల, నుగ్ర బాణముల్
తొడిగి ప వంగ సేనపయిఁ దోరముగా నడరింప, నంతటన్

బెదబెద నార్చి, మారుతి విభీషణు లుగ్రత దాన వావళిన్
బొడిపొడి సేయ, లక్ష్మణుఁడు పూనిక నాతనిఁ దాఁకె నార్చుచున్.

క. అంతట దానవ సేనలు
పంతము చెడి, తలలు వీడఁ బాలం గని, తా
నెంతయు వెలవకుఁ డనుచును
గుంతము ద్రిప్పుచును దైత్య కుంజరుఁ డంతన్. 107

## లక్ష్మణునిచే నింద్రజిత్తు సంహారము

శా. సౌమిత్రిం గని గర్వ మొప్పఁ బలికెన్ శౌర్యంబు సంధిల్లఁగా,
'నా మీఁదం బలుపింప వచ్చితివె నా నాగాస్త్ర సంఘంబులన్ ?
నే మిమ్మందలఁ గట్టుటల్ మఱచితే? నేఁడైనఁ జింతింపుమీ
నీ మా సత్త్వ విశేష మెల్ల మదిలో నిక్కంబుగా లక్ష్మణా!'

వ. అని బాణ ప్రయోగంబు సేసిన. 109

క. వానిని బరి శరములు దాఁ
బూనిక సంధించి త్రుంచి భుజ బల శక్తిన్
దానవుని మూర్ఛ పుచ్చెను
భానుకులుం డంక నొక్క బాణముచేతన్. 110

ఆ. ఇంద్రజిత్తుఁ దప్పు డిన కులోద్భవునిచే
మూర్ఛ నొంది తెలిపి మూర్ఖ గతిని
భాసమాన మైన బాణ త్రయంబున
నతని నొవ్వ నేసి యార్చె నంత. 111

సీ. సౌమిత్రి తా వాని చాపంబు నడిమికి
ఘనత రాస్త్రంబుచేఁ దునుఁగ నేసి,
పది బాణములు వాని బాహు మధ్యంబున
గాటంబుగా వడి నాట నేసి,

తురగంబులను నాల్గు తూపులఁ దునుమాడి,
సారథి నొక్కట సంహరించి,
శర వృష్టిఁ గప్పిన, సురవైరి కోపించి
కాద్రవేయాస్త్ర సంఘంబు లేయ,

తే. గరుడ శరమునఁ దునిమి లక్ష్మణుఁడు కినిసి,
వడిఁ గుబేరాస్త్ర మతనిపై వైచె, నసుర
దానిఁ దునుమాడి వేగ నైంద్రాస్త్ర మేసె,
నరవరుఁడు దాని యామ్య బాణమునఁ ద్రుంచె. 112

వ. ఇట్లు త్రుంచిన, 113

క. వరు ణాస్త్రంబును నేసెను,
సురరాజ విరోధి రాజ సూనుని మీఁదన్,
గర మలిగి రాము సోదరుఁ
డరుదారఁగ దానిఁ ద్రుంచె నైంద్రాస్త్రమునన్. 114

వ. మఱియును, 115

తే. కనలి దానవుఁ డతనిపై గంధ పుష్ప
సమితి నొప్పెడు గంధర్వ శరముఁ దొడిగి
వేయఁ గోపించి, దశర థోర్వీప సుతుఁడు,
ఖండ శశి బాణమున దాని గం డడంచె. 116

వ. ఇట్లు గంధర్వ శరంబును ద్రుంచి, యంతటం బోవక, దేవేంద్ర
దత్తం బైన భుజగాస్త్రంబు వింట సంధించి, 'వేదంబులు నిత్యం
బగునేని, రామచంద్రుండు ధర్మాత్ముండేని, యింద్రాది బృందారక
ద్రోహి యైన యింద్రజిత్తుని శిరంబు నీ శరంబు ద్రుంచుంగాక!
యని వానిపై లక్ష్యంబుచేసి, ప్రత్యాలీఢ పాదస్థుండై నిలిచి,
కర్ణాంతంబుగాఁ దిగిచి యేసిన, నదియును గాలాన లాభీల జ్వాలా
జాలంబు లుప్పతిల్ల గగనంబునం బఱతెంచి, యక్కఱకు రక్క
సుని శిరంబుఁ ద్రుంచిన, 117

క. కనుగొని దేవత లందఱుఁ
దనుఁ బొగడఁగ, మరలి రాము తమ్ముఁడు విజయం
బున వచ్చి మ్రొక్క, నాతని
మనుజేంద్రుఁడు కౌగిలించి మఱి యి ట్లనియెన్ : 118

క. నీచేత వీఁడు త్రుంగుట
భూ చక్రం బెల్ల మేలు పొందెను, వినుమీ
నాచేత దశముఖుండను
నీచుఁడు తెగు నెల్ల నిజము నిర్మల చరితా ! 119

వ. ఇట్లు సౌమిత్రిచేత నింద్రజిత్తు తెగె ననిచెప్పిన, నారదుని వాల్మీకి మహామునీంద్రుం డటమీఁది కథా విధానం బెట్టి దని యడుగుటయు, 120

## ఆశ్వాసాంత పద్య గద్యములు

క. జలజాక్ష! భక్త వత్సల!
జలజాసన వినుత పాద జలజాత! సుధా
జలరాశి భవ్య మందిర
జలజాకర చారు హంస! జానకి నాథా! 121

## గ ద్య ము

ఇది శ్రీ గౌరీశ్వర వరప్రసాద లబ్ధ గురు జంగమార్చన వినోద
సూరి జన వినుత కవితా చమత్కా రాతుకూరి కేసనసెట్టి
తనయ మొల్ల నామధేయ విరచితంబైన
శ్రీ రామాయణ మహా కావ్యంబునందు
యు ద్ధ కాం డ ము నఁ
బ్రథమాశ్వాసము.

శ్రీ

# రామాయణము

## యుద్ధకాండము

### ద్వితీయాశ్వాసము

[ఆహవ రంగమునకు రావణాగమనము - రావణ సుగ్రీవుల కదనము - పవనజుఁడు సుపార్శ్వుని మట్టుపెట్టుట - రామరావణుల భీకర సంగ్రామము - రావణుని శక్తి ప్రహారముచే లక్ష్మణుని మూర్ఛ - శ్రీరాముని సంతాపము - సంజీవినికై హనుమ పయనము - కాలనేమి కపటోపాయము - శాపవిముక్తయై దేవకన్యయైన మొసలి - కాలగతి చెందిన కాలనేమి - హనుమంతుఁడు పెకలించి తెచ్చిన సంజీవి పర్వతము - మాల్యవంతుని మరణము - లక్ష్మణుఁడు సంజీవినిచే మూర్ఛ దేరుట - ఆశ్వాసాంత పద్య గద్యములు.]

క. అమలిన శుభ చారిత్రా!
కమల దళ సమాన నేత్ర! కౌశిక మిత్రా!
ద్యుమణి కుల వార్ధి సోమా!
సమ దాసుర జన విరామ! జానకీ రామా! 1

వ. శ్రీ నారద మహా మునీశ్వరుండు వాల్మీకి కెఱింగించిన తెలం
గెఱింగించెద నాకర్ణింపు మట్లు. 2

#### ఆహవ రంగమునకు రావణాగమనము

ఆ. చారు లరుగుదెంచి సౌమిత్రిచే నింద్ర
జిత్తుఁ డీల్గె ననుచుఁ జెప్పఁటయును,
పంక్తి ముఖుఁడు సుతుని బలుమాఱు దలఁచుచు, 3
వగవఁ జొచ్చె నెల్లవారు వినఁగ.

వ. ఇట్లనేక ప్రకారంబులఁ గుమారుం బలవరింపుచు, దుఃఖింపుచుఁ, గొంత తడవున కూఱడిల్లి, ధైర్యంబు నూలుకొల్పి తన కుమారుం జంపినవానిని నేఁ డవశ్యంబును సంగ్రామ రంగంబునఁ జంపుదు నని నియమంబు సేసి, తత్క్షణంబ, 4

సీ. శైల సన్నిభములౌ సామజంబులతోడ,
ననిల వేగము గల్గు హరులతోడఁ,
గాంచ నోజ్జ్వలములౌ, ఘన రథంబులతోడఁ,
బ్రతి లేని ఘన మూల బలముతోడఁ,
గిమ్మీర వర్ణోరు కేతనంబులతోడఁ,
దఱచైన పట్టు ఛత్రములతోడ,
భేరీ మృదంగాది పృథు వాద్యములతోడ
వర శంఖ కాహళ ధ్వనులతోడఁ

తే. బాద ఘట్టన చలితోర్వి భాగుఁ డగుచు
వనధు లెల్లను బిండలివండు గాఁగ
నడిచె లంకేశుఁ డధిక సన్నాహమునను
వంది కైవార వీర రావములతోడ 5

మ. కరి ఘీంకారములున్, మహా జవ తురంగ వ్రాత హేషావళుల్,
వర కోదండ నినాదముల్, సుభట దుర్వా రాట్టహాసంబులున్,
గురు శంఖోజ్జ్వల నాదముల్, దశ దిశాక్రోశంబుగా నొక్కటై
పరగన్, బంక్తిముఖుండు దా నడిచెఁ గోప స్ఫూర్తి నిశ్వాసుఁడై.

## రావణ సుగ్రీవుల కదనము

వ. ఇట్లు చతురంగ బలంబులు గొల్వ, లోక విద్రావణుం డగు రావణుండు సమరం బొనర్ప నరుదేరం గని, రాఘవేశ్వరుం డనికి దండ నాయకులం బనిచిన, వారును దరు గిరి పాషాణ పాణులై యెదురు నడిచి, సింహ నాదంబులు సేయ, నుభయ బలంబులుం దలపడి పోరాడు సమయంబున, నమర వైరులు శస్త్రాస్త్ర వర్షం

బులు గురియించి నొప్పించి నంత. వానర వీరులు మరల దాన
వులపైఁ బాషాణ పాదపంబు లడరింప. నరి బలంబులు విఱిగి
పికాపికలై పఱచు నత్తఱిఁ, బం క్తికంధరుం డుదగ్రుండై
కెరలుచుఁ, గ్రూర నారాచంబులు చాపంబునఁ దొడిగి. పనస
పవనతనయ నల నీల ద్వివిద శరభ కుముద గజ గవయ గవాక్ష
గంధమాద నాంగద మైందాదుల నొక్కొక్కరిఁ బదేసి బాణంబుల
గుదిగొన నేసిన, విఱిగి యగచర సేనలు సురుగు న య్యవస
రంబున. 7

క. చేరి విరూపాక్షుని దగు
తేరిపయి నొక్క నగము ధీరతతోడన్
సూరజుఁ డప్పుడు మిక్కిలి
శూరత్వం బడర నేసి చూర్ణము సేసెన్. 8

ఆ. రథము విఱిగినంత, రణ మధ్యమున నొక్క
వారణంబు నెక్కి వచ్చు నెడను,
వాలికొడుకు దాని పటు రోషమునఁ దోల
నుఱికి ప్లవగుఁ గోల నఱికె వాఁడు, 9

క. అక్షయబలుఁ డగు రవి సుతుఁ
డా క్షణమున నుగ్రుఁ డగుచు నదరంట విరూ
పాక్షుని వక్షముఁ బొడిచిన,
రక్షో వీరుండు కూలి రణమునఁ బడియెన్. 10

11
వ. ఇట్లు కూలిన.

క. హమ్మని యాతని కూరిమి
తమ్ముండును. గనలివచ్చు తపనజు నత్యు
గ్రమ్ముగ మార్కొని జడి గా
తమ్ముల వక్షంబుఁ దురియ, నాలోఁ బెలుచన్. 12

చ. శరములు తాఁకకుండ నొక శైలమునం దగ నోసరించి, యా
యరదము నుగ్గుగాఁ గపికులాగ్రణి వైచిన, వాఁడు నేలకున్
వర భుజశక్తి దాఁటి కరవాలున నేసినఁ, దప్పఁ గ్రుంకి వా
నరపతి కొట్టె *నప్డు మహినాథుఁడు సంతస మంది చూడఁగన్.

క. కదనమున నొచ్చి దానవుఁ
డదలింపుచు భాను సుతుని యొదల వగులన్
గదచే నడిచిన, వానిని
గుదియంగాఁ బట్టి వైచెఁ గుంభినిమీఁదన్. 14

పవనజుఁడు సుపార్శ్వుని మట్టు పెట్టుట

క. అంత సుపార్శ్వుఁడు మిక్కిలి
పంతము నెఱపుచును. రథము పవనాత్మజుపై
నెంతయుఁ బఱపుచు. బాణము
లంతంతనె నాట నేయు నవసరమందున్. 15

సీ. హనుమంతుఁ డా దైత్యు నరదంబుపై దాఁటి,
చెక్కులు వాలంగఁ ద్రొక్కి వేసి,
సైంధవంబులఁ జంపి, సారథి తలఁగొట్టి,
గొడుగులు పడగలు పుడమిఁ గలిపి,
వడి వాని చే నున్న యడిదంబుఁ గైకొని,
దురుసుగా నేసిన, ధరను గూలి
గొబ్బునఁ దెప్పిర్లి, కోపంబు దీపింప
ననిలజు నురము మూఁ డంబకముల,

తే. జాంబవంతుని నిరు మూఁడు సాయకముల,
వడి గవాక్షుని నైదింట, వాలి సుతుని
నేడు బాణంబులను దూలనేసె, నంత
నవనిఁ బడి లేచి యంగదుం డాగ్రహమున. 16

*న య్యసుర నాశము వొందఁగఁ బాదపంబులన్

తే. వాని చేవిల్లు విరిచిన, వాఁడు కినిసి
పరిఘఁ గొని యేయ, మూర్ఛిల్లి ధరణి వ్రాలి,
తెలిసి, యంగదుఁ డాదైత్యుఁ దెగువ నురము
పిడు గడంచిన గతి ముష్టిఁ బొడిచి చంపె. 17

వ. ఇట్లు సుపార్శ్వాది రక్షో నాయకు లా క్షణంబునం గూలిన 18

## రామ రావణుల భీకర సంగ్రామము

క. తన కెట్టెదురను గూలిన
దనుజులఁ బెక్కండ్రఁ జూచి దశకంఠుఁడు, దాఁ
గనలుచు సూతున కనియెను
జననాయకుమీఁద రథముఁ జన నిమ్మనుచున్. 19

ఆ. అధిపుఁ డానతిచ్చినట్టుగా సూతుండు
రామచంద్రు మీఁద రథము వఱపె
నపుడు శంఖ కాహళాది రవంబులు
వంది జనుల నుతులు సందడింప. 20

వ. ఇట్లు శతాంగ తురంగ హేషా రవంబులును, బహుళ కింకిణీ ఘంటికా నినదంబులును, రథ నేమి స్వనంబులును, దనుజ భటాట్టహాసంబులును, బోరు కలంగ, సంగర రంగంబున కరుగు దెంచు నక్తంచరేశ్వరుండు ధనుర్ధరుండై ప్రతిఘటించు సమయంబున, 21

క. తన కెదిరించిన రాముని
గని దనుజ విభుండు కినుక గదురఁగ నటఁ జ
య్యన నాగాస్త్రములను దన
ధనువునఁ గీలించి యేసెఁ దన భుజ శక్తిన్. 22

క. అవి లెక్క గొనక పోరఁబోరి
నవనీ నాయకుఁడు గినుక నసురాధిపుపై

దివిజారు లులికి పాఱఁగఁ
బవి సన్నిభ మైన తీవ్ర బాణము లేసెన్. 23

సీ. లంకేశుఁ డవి యెల్ల లక్ష్యంబు సేయక
తిమి రాంబకములు సంధించి యేయ,
నిబిడమై చీఁకటి నిండంగఁ బర్వినఁ
గపు లెల్ల నంధు లై కళవళింప,
నుర్వీశ్వరుం డంప నుగ్ర బాణంబుల
నంధకారం బంత నడఁగఁజేసి,
వాస వారాతిపై వహ్నిబాణము నేయ
నాతండు రౌద్రాస్త్ర మదర నేసె

తే. రెండు బాణంబులును గూడి గం డెసంగఁ
బెనఁగి యాకాశముననుండి పృథ్విమీఁదఁ
బడియె నద్భుత గతి జగ త్త్రితయముగను.
సురలు దైత్యులుఁ గపులును జోద్యపడఁగ. 24

వ. అట్లు మహాద్భుతకరంబుగా సమరంబు జరుగుచున్న సమయంబున.

క. రాముని మేనను బాణ
స్తోమంబులు నాట నేసె సుర రిపుఁ డలుకన్
రాముఁడు ఘన నారాచ
స్తోమంబులు నాట నేసె సుర రిపు మీఁదన్. 26

చ. ధరణిపు మీఁదనుం గనలి దానవ నాయకుఁ డేసె నంత భీ
కర శరభోష్ట్రి కాక ఫణి గండక ఘూక బలాక భేక సూ
కర కిరి ఋక్ష కూర్మ శుక గర్దభ భల్లుక నీలకంఠ కే
సరి వృక గృధ్ర కీట బక సైంధవ సైరిభ వక్త్రి బాణముల్. 27

వ. ఇట్లు నిరంతరంబుగాఁ బ్రయోగించిన. 28

చ. పరువడి మీదవచ్చు పటు బాణ చయంబులఁ జూచి, రాఘవుం
డరుదుగ వాని నన్నిటి వియత్తల వీథిని ద్రుంచి, కమ్మఱన్

సురరిపుమీఁద నేసె బలసూదన ముఖ్యులు సూచి మెచ్చ, ని
బ్బరముగ నగ్ని బాణము నభంబునఁ గీలలు పర్వుచుండఁగన్.

వ. అమ్మహాస్త్రంబువలన. 30

క. దహన ముఖంబుల శరములు
గ్రహ ముఖములు గలుగునట్టి ఘనతర శరముల్
మిహిర ముఖంబుల శరములు
బహుళముగాఁ గల్గి దైత్య పతిపైఁ బర్వెన్. 31

ఆ. అంత దానవేంద్రుఁ డా బాణ తతు లెల్లఁ
దృణము లట్లు నడుమఁ ద్రెంచివైచి,
మయునిచేతఁ గొన్న మహనీయ మగునట్టి
శంబరాఖ్య మైన శరము వైచె. 32

క. ఆ శరమున బహు శస్త్రము
లాశు గతిం గలిగి గవియ, నన్నిటి నొకటన్
నాశము చేసెను రాముం
డాశా పతు లలర మన్మథాస్త్రముచేతన్. 33

ఆ. శంబ రాఖ్య శరము జగ దీశు బాణంబు
వలనఁ జెడక రాము వక్ష మదర
నాటె, నంతలోన నాకారిపై నేసె
విశిఖ తతులు వేయి. వేయునెడను. 34

క. రావణుఁ డా బాణములకు
వేవేగను బ్రతిఘటించి వేసిన శరముల్
చేవమెయిఁ దాఁకి వడి ధా
త్రీ వలయంబునను బడి ధరిత్రి వడంకెన్. 35

రావణుని శక్తి ప్రహారముచే లక్ష్మణుని మూర్ఛ

ఉ. తల్లడ మంది రామ వసుధాపతి కడ్డము సొచ్చి, లక్ష్మణుం
డుల్లము నొవ్వ నాడుచు మహోన్నత కోపముతోడ దైత్యుచే

విల్లును నారియుం దునిమివేసి, వడిన్ శర సప్తకమ్ముచే
బల్లిదుఁడైన దైత్య కులపాలుని వక్షముఁ దూర్చి యార్చినన్. 36

క. అంత విభీషణుఁ డమరేం
ద్రాంతకు నరదంబుఁ గూల నట నేసిన, న
త్యంత జవంబున ధరణికి
గంతుగొనెన్ వడిని బంక్తి కంధరుఁ డలుకన్. 37

వ. ఇట్లు తన రథంబుఁ గూలనేసిన, విరథుండై రావణుండు మయ దత్తంబైన శక్తిని బూని తమ్ముని నేయఁ జూచుచున్నంత, శరణాగత వజ్రపంజరుండగు రాఘవేశ్వరుని తోఁబుట్టు వగుటంజేసి, లక్ష్మణుండు కరుణాపరుండై విభీషణుం దనవెనుక నిడికొని యెదిర్చినం గని, నీవు నా పగఱ కడ్డంబవైతివి, గావున నీవ యీ శక్తిచేత హతుఁడవు గమ్మని యేసిన, నదియును శత ఘంటికా రంజితంబును, శతకోటి నినదంబును, పావక జ్వాలాభీల కీలాన్వితంబునునై పఱతేరంగని, సురేంద్రాది దేవ గణంబులు భయం బంది, రాముతమ్మునకు దీర్ఘాయు వగుం గావుత మని దీవింప, జగంబులు తల్లడిల్ల, సముద్రంబులు ఘూర్ణిల్లఁ, గులాచలంబులు వడంకఁ, జంద్రార్క బింబంబులు దలంక నేఁగుదెంచి, సౌమిత్రి యురంబు నాటి ధాత్రిం బడియె నట్టి యవసరమ్మున. 38

సీ. పంక్తి కంధరుఁ దేయు బాణంబు లవి లెక్క
*సేయక రఘుకుల సింహుఁ డపుడు
తమ్ముని మెయి నాటి ధరణి గాడిన శక్తి
నొగి వానరులు తీయ నోపకున్న
నవలీల దాని నొయ్యనఁ దీసి పోవైచి
ఘనులైన కపులను గాపు వెట్టి
'నేనె రాముఁడ నైతి నేని మ జ్జనకుండు
దశరథుం డగునేనిఁ దప్పకుండఁ

* బాయక శ్రీరామచంద్రుఁ డంత

తే. గలన నెదిరించి నాతోఁ డఁ గయ్యమునకు
నిలిచె నేనియు, దనుజేంద్రు నిజముగాఁగఁ
జంపుదును నొండెఁ, గాక నేఁ జత్తునొండె
వినుఁడు కపులార! నామాట వీనులలర'. 39

వ. అని మఱియును, 40

క. రాముఁడు రావణుఁ డనుచును
భూమిపయి న్నిర్వు రునికి పొసఁగదు సుండీ!
నా మాట వినుఁడు లెస్సగ,
రాముఁడ నే నొండె, భువిని రావణుఁ డొండెన్. 41

వ. ఉండుదు మని, వీరాలాపంబు లాడుచు, రామచంద్రుండు ధనుర్ధరుండై శర వర్షంబులు గురియించిన, నసురేశ్వరుండును బ్రతి శరంబుల వాని నన్నింటినిం దూల నేసినఁ, గనలి రామచంద్రుండు తొడిగిన యమ్మును, వెడలు తూఁపులును, విల్లు గుడుసు పడుటయు, నెఱుంగరాని చందంబునఁ బింజపింజం గలచి పాఱు చుండునట్లుగా, హస్తంబు ముడుచుటయుఁ, జూచుటయుఁ దెలియ రాకుండ, రావణు కాలుసేతు లాడకుండ, శరలాఘవంబు నెఱపుచు నేయుచున్న యప్పుడు విఱిగి శరీర భూషణంబు లురులఁ, గిరీటంబులు డుల్లఁ, దలలు వీడ, మరలి మరలి చూచుచు, మృగేంద్రుం గన్న గజేంద్రుని చందంబున భీత చేతస్కుండై దశముఖుండు లంకా పురంబుఁ జొచ్చెఁ ద దనంతరంబున, 42

క. ఆ వేళ లావు సూపుచు
రావణుచే శక్తిఁ దాఁకి రణ రంగమునన్
జేవ సెడి పడిన లక్ష్మణ
దేవున్ దగ్గఱఁగ రామదేవుఁడు వచ్చెన్. 43

వ. ఇ ట్లరుగుదెంచి, 44

తే. రక్త సిక్తాంగుఁడై, ధాత్రి శక్తి నాటి
యున్న తమ్ముని గనుగొని యుస్సు రనుచు,

ధుఃఖ మంతంత నాఁగక తొంగలింపఁ,
దొడలపై నిడి బాష్పముల్ దొప్పఁదోఁగ. 45

## శ్రీరాముని సంతాపము

సీ. 'హా! భాను కుల దీప! హా! సత్య సల్లాప!
హా! సుగుణ కలాప! హా! సురూప!
హా! ధర్మ సంచార! హా! వైరి సంహార!
హా! కీర్తి విస్తార! హా! సుధీర!
హా! నిత్య సుజ్ఞాన! హా! పుణ్య సంధాన!
హా! పూజ్య సమ్మాన! హా! నిధాన!
హా! శౌర్య గుణ వృద్ధ! హా! యుద్ధ సన్నద్ధ!
హా! చిత్త సంశుద్ధ! హా! ప్రసిద్ధ!

తే. హా! మునీశ్వర సంరక్ష! యసుర శిక్ష!
హా! గుణ స్తోత్ర! సత్పాత్ర! యబ్జ నేత్ర!
హా! స దాచార సంపన్న! హా! ప్రసన్న!'
యనుచు శోకాతు రాత్ముఁడై యంత కంత. 46

క. జనకుని పంపున నడవికిఁ
జనుదెంచియు నిడుమ కోర్చి సన్ముని వృత్తిన్
నను గూడి నడవ నేర్చిన
యనుజన్మా! యెందుఁ బోయితయ్యా! తలఁపన్. 47

క. వనమునఁ గల ఫల మూలము
లనుదినమును భక్తి యుక్తి నర్పింపుచు, మ
జ్జనకుని భంగిని నన్నును
జనకజఁ బోషించి యెందుఁ జనితివి తండ్రీ! 48

క. నీవంటి తోడఁబుట్టువు,
నీవంటి గుణోత్తరుండు నిజ మూహింపన్

భూవలయమందుఁ గలఁడే?
భావింపఁగ నీవె తక్కఁ బావన చరితా! 49

క. నెఱయక ని ద్రాహారము
లెఱుఁగక, పదునాలు గేండ్లు హిత మతితో మ
మ్మఱిముఱి నరసిన నిన్నును
మఱవ నగునె నీతి గల్గు మనుజుల కెందున్? 50

క. ని న్నిచట విడిచి పురికిని
జన్నను, నిను గన్నతల్లి సనుదెంచి ననున్
ని న్నడుగఁ, దడవ మదిలోఁ
జిన్నంబోవుచును నేమి చెప్పుదుఁ దండ్రీ! 51

వ. అని మఱియును. 52

చ. వినుఁడు కపీంద్రులార! పలవింపుచు మ జ్జనకుండు నాకమున్
జనియె, ధరా తనూభవ నిశాచరుచేఁ జెఱవోయె, నేఁటితో
ననుజుఁడు దీఱె, నింక నడియాసల నుండుట నాకు ధర్మమే?
చనుఁడు నిజాశ్రమంబులకు సంశయ మొందక మీరు గొబ్బునన్.

వ. అని విభీషణుం గనుంగొని, 54

ఉ. అక్కట! నీకు నింటఁ గలయట్టి సుబాంధవ కోటిఁ బాసి నీ
విక్కడ కేఁగుదెంచితి వహీన ముదంబున మమ్ము నమ్మి, పెం
పెక్కఁగ రావణుండు తగ నేలెడి లంకఁ గడంక నీకు నేఁ
దక్కఁగ నిత్తునన్ ప్రతిన దప్పె, విభీషణ! నీవు వోవుమా! 55

వ. అని యనేక ప్రకారంబులఁ బ్రలపించుచున్న రామ భూపాలునకు
సుషేణుం డిట్లనియె: 56

ఉ. దేవర! నీకు నీ గతి మదిం దలపోయఁగ నేల? తీవ్రమై
రావణుచేతి శ క్తి బవరంబున నాటుటఁజేసి లక్ష్మణుం

డీ విధి నుండెఁ గాని ధరణీశ్వర! చూడు ముఖారవిందమున్,
జావఁడు పావఁ డియ్యెడ నిజంబుగ నమ్ము మనంబులోపలన్. 57

ఉ. పున్నమ చందురుం దెగడి పొల్పెసలారెడి మోముఁ దమ్మియున్,
గన్నులు కల్వ ఱేకులను గాంతి జయించెడుఁ గాని. రక్తిమన్
జెన్ను దొలంగియుండ, వలచేతులుఁ, బాదములున్ దలంపఁగా
నున్నవి వర్ణముల్ గలిగి, యొప్పు తొలంగదు, రాఘవేశ్వరా! 58

వ. అని విన్నవించుచు హనుమంతుఁ గనుంగొని సుషేణుం డిట్టు
లనియె: 59

## సంజీవినికై హనుమ పయనము

క. ఈయన ప్రాణము లెత్తఁగ
వాయుజ! యల నాఁటి మందు వడిఁ దేవలె నీ
వీ యెడ, నచటికిఁ దడయక
పోయి వెసన్ రమ్ము ప్రొద్దు పొడువక మునుపే. 60

వ. అనిన భూకాంతుండు హనుమంతున కిట్లనియె: 61

క. రమ్మా వాయు తనూభవ!
యి మ్మహి సత్కీర్తిఁ బడయు మీతని ప్రాణం
బిమ్ముగ రక్షింపుము, నా
తమ్ములలో నీవు నొక్క తమ్ముఁడ వరయన్. 62

వ. అని దాయం జని, కౌఁగిటం జేర్చి, దీవించి యంపె నప్పుడు. 63

ఆ. పదము లూనఁ ద్రొక్కి, వదనంబు దిగఁజూచి,
చేతు లూని, యొడలు చిక్కఁబట్టి,
క్రుంగి, నిగిడి, యెగసి, కుప్పించి వడి దాఁటి
చనియె గగనవీథి ననిల సుతుఁడు. 64

వ. అట్టి సమయంబున, 65

## కాలనేమి కపటోపాయము

సీ. దనుజేశుఁ డా వార్త విని కాలనేమింటి
    కర్ధరాత్రం బేఁగి, యతనితోడఁ
దనచేత హతుఁ డైన ధరణీశు తమ్ముని
    ప్రాణంబు లెత్తంగఁ బవన సుతుఁడు
సనుచున్నయట్టి యా పని విఘ్న మొనరింపఁ
    గ్రక్కున నటఁ బోయి ర మ్మటన్నఁ.
గాలనే మతనికిఁ గార్యంబుగా దన్న.
    వినక కోపించిన, వేగ నరిగి

తే. ద్రోణ శైలంబు చేరువ త్రోవయందు
వనముఁ గావించి, తగ మునీశ్వరుని రీతి
జపము సేయుచుఁ గన్నులు చక్క మూసి
నడుము నిక్కించి పద్మాసనమున నుండె. 66

వ. అప్పు డాకాశ మార్గంబునఁ జనుచున్న య ప్పవన సుతుండు వనంబుం గాంచి, త్రోవ దప్పె నని మనంబున సందియ మొంది, య మ్మునీంద్రు నడిగి చనువాఁడై. యతనికి నమస్కరించి యిట్లనియె: 67

క. మునినాథ! నేను రాముని
పనికై చనుచున్నవాడఁ, బర మౌషధముల్
గొని రావలె, మది భావిం
చి నిజమ్ముగ నిపుడు త్రోవ సెప్పుము నాకున్. 68

వ. అని ప్రార్థించి దాహోపశమనంబున కుదకంబు వేఁడిన, న క్కపట మునీంద్రుం డిట్లనియె: 69

ఆ. పవన తనయ! రామభద్రుని పని మాకుఁ
దీర్పవలయుఁ, గాన నేర్పుతోడఁ

ప్రాణ రక్షకొఱకు ద్రోణాద్రి కరుగంగ
వలదు వినుము, నాదు వనమునందు, 70

తే. ఘనతరం బైన సంజీవి కరణి, మొదలు
గాఁగ దివ్యౌషధంబులు గలవు, గానఁ
గొంచుఁ బోవచ్చుఁ గావునఁ గోరు పండ్లు
తనివి దీఱంగఁ దిని నీళ్ళు త్రాగు మిచట. 71

వ. అని తన హస్తంబున నున్న విష యుక్తంబైన కమండ లూద
కంబు చూపినం, గని హనుమంతుం డవి చాల వనిన, న క్కపట
మునీంద్రుండు క్రూర మక రావృతంబైన కమలాకరం బొకం
డెఱింగించి పొమ్మనినఁ బవ నాత్మజుండు సని, 72

క. విమల మకరంద లుబ్ధ
భ్రమర నికర పక్ష పవన పరికంపిత స
త్కమనీయ కుముద కైరవ
కమలంబులు గలుగు కొలను గనుగొని యచటన్. 73

శాప విముక్తయై దేవకన్య యైన మొసలి

సీ. మడుఁగులోపలఁ జొచ్చి కడుపార నుదకంబు
గ్రోలంగ దిగ, నందుఁ గ్రాలు మొసలి
పాదముల్ కబళించి పట్టినఁ, జరణముల్
విదళింపఁ, బట్టువి విడువకున్నఁ,
గడు సూక్ష్మ రూపుఁడై కడుపులోపలఁ జొచ్చి
వేగంబ భేదించి వెడలె నంత,
నది దేవ కన్యయై యాకాశముననుండి
తనదు వృత్తాంత మంతయును జెప్పె.

తే. వీఁడు దైత్యుండు నమ్మకు, వీనిఁ జంపి,
పొమ్ము సంజీవి కొండకుఁ బ్రొద్దు గలుగ

నీ కతంబున శాపంబు నాకుఁ దీఱె
ననుచు దీవించి చనియెఁ దా నమర పురికి. 74

వ. అంత హనుమంతుండు తేజోవంతుండై యరుగుదెంచి కపట
సంయమినిం గనిన నతం డిట్లనియె: 75

కాలగతి చెందిన కాలనేమి

చ. తడసితి వేల యింత వడిఁ దాపున నే వసియించినట్టి యీ
మడువున కేఁగి రాకునికి, మా కనుమానము దోఁచె నయ్య! యి
ప్పుడు గలదేనిఁ గొంత గురు పూజకు విత్తము కాన్క వెట్టి, నీ
వడుగుము మందు లెట్టివి ప్రియం బగు నట్టివి నీకు నిచ్చెదన్.

చ. అనవుడుఁ గోప మెత్తి పవనాత్మజుఁ డప్పుడు నీకుఁ బూజ గొ
మ్మని యురు ముష్టిచేఁ బొడువ, నాతఁడు దీకొని పక్షి రూపుఁ డై
తనుఁ గదియంగ వచ్చుటయు, దాని నపక్షముగాఁగఁ ద్రుంచినన్,
గినిసి మృగేంద్రుఁడై పొడువఁ, గేసరి పుత్త్రుఁడు దానిఁ గూల్చినన్.

తే. అంత సుగ్రీవుఁడై వచ్చి, యనిల తనయ!
బ్రతికె సౌమిత్రి, మందుల పని తలంప
వలదు రమ్మని, నన్ను భూవరుఁడు పనిచె
మగిడి పోదము పద, మన్న మాట వినుచు, 78

వ. సుగ్రీవుం డని విచారించి కాకుండు పెటిఁగి, వాని బాహు మధ్యం
బునఁ బొడిచిన, నతం డా రూపంబు విడిచి, శతశృంగుండై నొప్పిం
చిన, నలిగి జగత్ప్రాణ నందనుండు వాలంబున నడిచి, కరంబులు
ఛేదించి, శిరంబుఁ ద్రుంచివైచి, సింహ నాదంబు చేసి, జయలక్ష్మిం
గైకొని, 79

హనుమంతుఁడు పెకలించి తెచ్చిన సంజీవి పర్వతము

క. ద్రోణాద్రి కేఁగి మందులు
*పోఁణిమి నీకున్నఁ గినిసి పొల్పలరఁగ నా

* వేఁడిన నీకున్నఁ గినిసి వేగంబున నా

క్షోణీ ధర మగలింపుచుఁ
బాణి తలాగ్రమునఁ బెట్టి పట్టుక రాఁగన్. 80

సీ. కావలి యున్నట్టి గంధర్వ గణములు
పదునాల్గువేలు కోపంబుతోడ
నాహవం బొనరింప, నందలు నచ్చోట
వాల ముఖంబున వసుధఁ గూల్చి,
గగన మార్గంబునఁ గడు తీవ్ర గతితోడఁ
బోవ, నందిగ్రామ పురమునందుఁ
దైలయుక్తం బైన తలలతోఁ బొరలాడఁ
గలిగిన రామ లక్ష్మణుల తెలఁగు

తే. భరతుఁ డా రాత్రి కల గని, భయము దోఁచి,
తొడరి దుస్స్వప్న దోషంబు దొలఁగి పోవ
విప్రవరులకు దానముల్ వేడ్క నిచ్చి,
వెలుపలను నున్న భరత భూవిభుని గాంచి, 81

తే. రాముఁడో యంచు నూహించి, రాముఁ డేల
వచ్చు నిచటికిఁ? సౌమిత్రి, వనచరులను,
జనకనందనఁ దగ డించి, జగ మెఱుంగఁ
దగుఁ జంపక రా నేమి పని తలంప. 82

## మాల్యవంతుని మరణము

వ. అని యిట్లు సందియంపడి, కాఁ దని నిశ్చయించి, యంతహనుమంతుండు దక్షిణ పాథోనిధి దటియం జనునప్పుడు, దశానను పంపున సేనఁ గూడి, మాల్యవంతుం డెదిరించి, శస్త్రాస్త్రంబులు గురియించి నొప్పించినం గని, వాతూల సంభవుండు వాల మల్లార్చి, యార్చి, పేర్చి, దనుజ బలంబుఁ జలంబునం దటిమి, వాల ముఖంబున గళంబులు పట్టి, నానా ముఖంబులఁ బాఱవైచినన్ గని మాల్యవంతుండు తీవ్ర శరంబుల నొప్పించిన, వదరి య

ద్దానవేంద్రుని కంఠంబున వాలంబుం గీలించి గిరగిరం ద్రిప్పి సముద్ర మధ్యంబునఁ బడవైచిన, వాఁడును బాతాళంబునకుం జనియె నా క్షణంబ, 83

తే. మాల్యవంతుని బోకార్చి మానుషమున,
గగన మండల మందంద పగుల నార్చి,
వచ్చు నప్పుడు శతకోటి వారిజాప్త
దీప్తిఁ గనుపట్టెఁ బ్రాచీన దిక్కునందు. 84

వ. ఇట్లు వెలుంగుచున్న మహౌషధాచలంబు దివ్య దీప్తులు గనుం గొని, రాఘవేశ్వరుం డది సూర్యోదయం బని మనంబునఁ దలంకి, కపిరాజున కిట్లనియె: 85

చ. అదె కనుఁగొంటిరే! కలయ నర్కుఁడు పూర్వగిరీంద్ర శృంగమం దుదయము నొందె, నింక నిటనుంచినఁ దమ్ముని ప్రాణ వాయువుల్ బ్రదుకుట దుర్లభం బకట! పల్కుఁబు మ్రొక్కెడు ప్రొద్దె, మాకుఁ దా నదయత శత్రుఁ డయ్యెఁ గపులార! వినుం డిదె మీకుఁ జెప్పెదన్.

తే. మా కులంబున కెల్లను మహిని దలఁపఁ
దానె కర్తయై యుండియు ధర్మ మగునె
యుదయ మందంగ మనుమఁ డిట్లున్న యెడను?
గొసరి చుట్టాలుఁ బగవారిఁ గూడవలెనె? 87

క. ఈ లాగునఁ దాఁ బొడిచిన
మా లక్ష్మణు ప్రాణ మేల మగుడును? భానుం
గూలఁగ నేసెద, విల్లును,
గోలలుఁ దెమ్మనుచు నందికొను నాలోనన్. 88

వ. రామచంద్రునకు జాంబవంతుం డిట్లనియె: 89

ఉ. భానుఁడు కాఁడు చూడు నరపాలక! మందుల కొండ దీప్తి, లే మానము దోఁచెఁగాని యనుమానము లేదు వినుండు, వేడ్కతో

వానర సేనల న్నెదుర, వాయు తనూజుని గారవింపఁగా
మానవ నాథః పంపు మనుమాత్రనె వచ్చె నతండు తీవ్రతన్. 90

క. అనిమిషులు సన్నుతింపఁగ
హనుమంతుఁడు ద్రోణశైల మతి శీఘ్రముగాఁ
గొని వచ్చి నిలిచి రఘురా
ముని శ్రీపాదముల కెలమి మ్రొక్కిన యంతన్. 91

లక్ష్మణుఁడు సంజీవినిచే మూర్ఛదేరుట

వ. రామచంద్రుం డతనిం గౌఁగిలించుకొని, సుషేణుం జూచి నీ విందలి దివ్యౌషధంబులవలన సౌమిత్రి ప్రాణంబులు తేర్పు మనిన, న య్యధిపు నాజ్ఞ శిరంబునఁ దాల్చి వనచర సహితుండై పర్వతం బెక్కి తొల్లి దేవత లమృత పానంబు చేసిన తావును, నారాయణుండు మోహినీ రూపంబున నమృతము పంచునప్పుడు సూర్య చంద్రుల నడుమ నిటికిన రాహువు శిరంబుఁ ద్రుంచిన తావును, బలిచక్రవర్తి యాగంబు చేసిన తావును, రాక్షసులు జన్మించిన తావును, శంకర భగవానుండు పర్వతరాజు కూఁతును బెండ్లి యాడిన తావును, వానరులకుం జూపుచు న గ్గిరీంద్రంబుపై నున్న యౌషధంబులు గొనివచ్చి ప్రయోగింప, నా యౌషధముల సామర్థ్యంబునంజేసి లక్ష్మణునకుఁ బ్రాణంబులు మగుడ వచ్చె; నంత సకల వానరులు నానంద రసాబ్ధిం దేలి, రప్పుడు సౌమిత్రి రామునకు నమస్కరించిన రామచంద్రుండు కౌఁగిటం జేర్చి, హనుమంతుం దొనరించిన యుపకృతికి సంతోషించి, యీ పర్వతంబును దొల్లింటి యునికినే యుంచి రమ్మనిన నతం డట్ల కావించె, నని నారదుండు చెప్పిన వాల్మీకి మునీశ్వరుం డటమీఁది కథా విధానం బెట్టి దని యడుగుటయు: 92

ఆశ్వాసాంత పద్య గద్యములు

క. జలజాక్షః భక్త వత్సలః
జలజాసన వినుత పాద జలజాతః సుధా

జలరాశి భవ్య మందిర
జలజాకర చారు హంస! జానకి నాథా! 93

## గ ద్య ము

ఇది శ్రీ గౌరీశ్వర వర ప్రసాద లబ్ధ గురు జంగ మార్చన వినోద
సూరి జన వినుత కవితా చమత్కా- రాతుకూరి కేసనసెట్టి తనయ
మొల్ల నామధేయ విరచితంబైన శ్రీ రామాయణ
మహా కావ్యంబునందలి యుద్ధకాండమున
ద్వితీయాశ్వాసము.

శ్రీ

# రామాయణము

## యుద్ధకాండము

## తృతీయాశ్వాసము

[రావణుని శత్రుంజయ హోమము - మండోదరి దీనాలాపములు - రావణుని సమర సంరంభము - వందిచేసిన రావణ స్తుతి (చూర్ణిక) - హనుమంతునిచే ఖడ్గరోముని ఖండనము - సర్పరోమాదుల సంహారము - శ్రీరామచంద్రున కింద్రుఁడు రథమును గానుకగఁ బంపుట - రామ రావణుల నిరుపమ మహా సమరము - రామ రావణుల వీరాలాపములు - తెగిన తోడనే మరల మొలచుచున్న రావణుని శిరములు - విభీషణుఁడు తెలిపిన రావణ మరణ రహస్యము - శ్రీరాముఁడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రముచే రావణ హననము - మండోదరీ విలాపము - విభీషణుఁడు శ్రీరాముని విజయవార్తను సీతకు నివేదించుట - సీత యగ్ని ప్రవేశము - బ్రహ్మ సీత సౌశీల్యమును బ్రస్తుతించుట - దేవతలు చేసిన శ్రీరామ స్తోత్రము - సీతా లక్ష్మణ సుగ్రీవాదులతోఁ బుష్పక విమానమున శ్రీరాముని పయనము - అయోధ్యా నగర ప్రవేశము - శ్రీరాముని ధర్మ పరిపాలనము - ఫల శ్రుతి - ఆశ్వాసాంత పద్య గద్యములు.]

క. విమల సుధాకర వదనా।
సుమన శ్చేతోఽబ్జ సదన। సుస్థిర కదనా।
కమనీయ రదన। శత్రు వి
షమ। రఘుకుల సార్వభౌమ। జానకి రామా। 1

వ. శ్రీనారద మునీంద్రుండు వాల్మీకి కెఱింగించిన తెఱంగెఱింగించెద
నాకర్ణింపుము. 2

## రావణుని శత్రుంజయ హోమము

క. కలకల పక్షులు గూయఁగఁ,
బలపలనై తారకములు పడమటఁ దోఁపన్,
జలజములు విరియఁ, దూర్పునఁ
బలపలనై తెల్లవాఱ భానుఁడు పొడిచెన్. 3

సీ. అట మున్ను దశకంఠుఁ డాచార్యుఁ డైనట్టి
శుక్రాను మతి దేహ శుద్ధితోడ
రణ జయార్థంబుగా రథములు గుఱ్ఱముల్
కవచంబు లస్త్ర సంఘములు గలుగఁ
పాతాళ గుహఁ జొచ్చి వీతిహోత్రునిగూర్చి
పాయక హోమంబు సేయుచుండ
నా హోమ ధూమంబు లాకసంబునఁ బర్వఁ
గని విభీషణుఁడు భూ కాంతునకును

తే. విన్నవించెను మా యన్న విన్న నరిగి
హోమ మొనరింపుచున్న వాఁ డుడుగ కిపుడు
మొనసి యా హోమ మది తుద ముట్టెనేనిఁ
గలన బ్రహ్మాదు లాతని గెలువలేరు. 4

క. ఈ పని విఘ్నము సేయఁగ
భూపాలక! కపుల నేర్చి పుచ్చుము లేదే
మీ పని విఘ్న మగు ననుడు
భూపాల వరేణ్యుఁ డపుడు భూధర చరులన్. 5

చ. గవయ గవాక్ష వాలిసుత కంజహితాత్మజ నీల వాయుసం
భవ నల గంధమాదన విభాషిత భల్లుకనాథ ముఖ్యులన్

ద్విజ విరోధిపైఁ బనుపఁ దీవ్రత నేఁగి పురంబు సొచ్చి దా
నవపతి సేనలం దటిమి నాకము భేదిల నార్చి యత్తఱిన్. 6

క. గుహ సొచ్చి దనుజ వల్లభ!
విహితమె సాహసము విడిచి విను ముని వృత్తిన్
దహన గత ధూమ రేఖల
నహరహమును నీకు ద్రేల్వ నర్హం బగునే? 7

క. మగఁటిమి గలిగిన పురుషులె
మగతనమును విడిచి నడువ మగుపలు నగరా?
తగ దనక నేఁడు మఱుఁగున
విగత వ్రీడుండ వగుచు ద్రేల్వం దగునే? 8

మ. అని కేఁతెంచి నృపాల శేఖరుఁడు వాహ్యాళి ప్రదేశంబునన్
నిను రమ్మంచును బిల్చుచుండ నిచటన్ నీవుండి వ్యాజంబునన్
దనుజాధీశ్వర! వీర ధర్మ మగునే తప్పించుకో? నంచు న
వ్వనచారుల్ సిగ వట్టి యీడ్వఁగను గ్రవ్యాదుండు నిశ్చింతుఁడై.

క. కదలక హృదయ ధ్యానము
వదలక మంత్రంబు చొప్పు వడి తప్పక లోఁ
జెదరక ద్రేల్చుచు నుగ్రత
బెదరక కూర్చుండె నట గభీర ప్రౌఢిన్. 10

వ. అట్లు శిలా స్తంభంబు పగిదిని జలింపకున్న నతనిచేతి యాహుతులు విడిచి పోవైచి, స్రుక్స్రువంబులు నఱుఁగఁ ద్రొక్కి, యిధ్మంబు హోమ ద్రవ్యంబులు నొక్కింత నగ్నిలోఁ ద్రోచి, హోమాగ్నిం జిందఱవందఱ చేసి, భుజంబు లెక్కి, మీసలు పట్టుకొని లాగి, తలలు గదలించి, వీనులఁ బెను బొబ్బ లిడి, కదలకున్నం గినిసి,

వాలితనూభవుం డంత నంతఃపురంబునకుం బోయి యందున్న మందోదరిని జుట్టుపట్టి యీడ్చుచుఁ బరువునఁ గొని వచ్చి, దశ వదను ముందఱ నిలుప న క్కాంత దుఃఖాక్రాంతయై తన కాంతున కిట్లనియె: 11

మందోదరి దీనాలాపములు

తే. రామచంద్రుండె యాది నారాయణుండు
గపులు దేవత లని నీకుఁ గనఁబడంగ,
నెల్ల వేళల నేఁ జెవి నిల్లు గట్టి
విన్నపము సేయ నామాట వినకపోతి. 12

మ. మయదైత్యేంద్రునకుం దనూజనయి, సేమం బొప్ప నీ పత్నినై,
జయమెట్టంగను నింద్రజి జ్జననినై, సర్వాంగనా పూజ్యనై,
భయ మెన్నండు నెఱుంగనట్టి నను ని బ్బంగిన్ వనాటుండు ని
ర్భయవృత్తిం దలపట్టి యీడ్వఁగనుఁగోఁ బాలైతి నీ ముంగలన్.

క. రాముని దూతలు నన్నును
బాములు వెట్టంగఁ జూడఁ బండువె నీకున్?
నా మానము గాపాడని
నీ మానుష మేటి కిపుడు నిర్జర వైరీ! 14

ఉ. ఈ ముని వృత్తి కన్న దనుజేశ్వర! రామునితోడ నేఁడు సం
గ్రామము సేసి గెల్చిన నఖండ రమా విభవంబు గల్గుఁ, నా
రామునిచేతఁ జచ్చిన స్థిరంబగు మోక్షము గల్గు, దీనికై
యేమిటి కింత దైన్య మిసి! యిచ్చఁ దలంపుము రాక్షసేశ్వరా! 15

వ. అని యనేకవిధంబులుగా దీనాలాపంబు లాడుచు వెక్కి వెక్కి యేడ్వం గని లజ్జించి మహోగ్రాకారుండై లేచి, దగ్ధశేష కాండం

బులచే వానర వీరుల కరంబులు శిరంబులు ముక్కులుఁ జెక్కులు నలుఁగ మొత్తినం బఱచి వారు రామచంద్రుని సమ్ముఖంబునకుం బోయి తాము వోయి వచ్చిన పని విన్నవించి రట్టి సమయంబున, 16

తే. నగచరులఁ ద్రోలి క్రమ్మర నగరి కరిగి
పంక్తి కంఠుండు ధైర్యంబు పాదుకొల్పి
విన్నఁదనమున వగపునఁ జిన్నవోయి
చెంత నున్నట్టి తన కులకాంతఁ జూచి. 17

క. నా కేలు వట్టి వెలసిన
నీ కేలా చిన్న వోవ నీరజ నయనా!
నాకులు బెదరఁగ నల యి
క్ష్వాకు కులోద్భవుల గెలిచి వచ్చెద నింకన్. 18

తే. తెలియ మయు పుత్త్రి! నాదు ప్రతిజ్ఞ వినుము
వనచరులతోడ రామ భూవరుని నేఁడు
చంపు టొండెను వానిచేఁ జచ్చుటొండెఁ
గాని యూరక మరలుట కానిమాట. 19

వ. అని వీర రసం బుప్పొంగఁ బ్రతి జ్ఞాలాపంబులఁ దన పట్టపుదేవి యగు మందోదరి నోదార్చి కొలువుకూటంబున కేతెంచి యచ్చట,

రావణుని సమర సంరంభము

క. శిరముల వీనుల గళములఁ
గరముల నురమున నడుమునఁ గమనీయ పదాం
బురుహముల భూష ణావళు
లరుదారఁగఁ దాల్చి మోహ నాకృతి మీఱన్. 21

తే. గంధ మాల్యాంబ రాదులు బంధురముగ
మేనఁ గలయంగ ధరియించి దానవేంద్రుఁ
డంత రణభేరి వ్రేయించి పంత మలర
బిరుదు రాహుత్త వీరులఁ బిలువఁ బనిచె. 22

వ. అట్టి యవసరంబున, 23

ఆ. రోష మదర ఖడ్గరోముండు వృశ్చిక
రోముఁ డల్ల సర్పరోముఁ డగ్ని
వర్ణుఁ డాది గాఁగ వచ్చిరి రాక్షస
వీరు లపుడు దనుజ విభుని గొలువ. 24

క. ఇరువది చేతుల శస్త్రా
స్త్రములు మెఱయంగఁ దాల్చి కౌతుక మదరన్
దురగములు నూఱు గట్టిన
యరదముపైఁ గూరుచుండ నతి విభవమునన్. 25

సీ. భేరులు తమ్మటల్ పెల్లు నిస్సాణముల్
బూరగొమ్ములు కంచు వీరణములు
మకిలక్రోవులు వీరమద్దెలల్ గిడుగిళ్ళు
పేరైన తప్పెటల్ పిల్లఁగ్రోళ్ళు
తారలు చిమ్మటతారలు శంఖముల్
కాహళాల్ పసిఁడి ఢక్కలును బిడులు
గాలిగొమ్ములు డోళ్ళు కైవళ్ళు రుంజలు
ఛత్ర సంఘంబులు చామరములు

తే. బోరు కలఁగంగ దిక్కులు బూరటిల్ల
[illegible]

వెడలె సన్నాహ మదరంగ వీర రవము
కరువు గట్టిన చందంబు గానఁబడఁగ. 26

క. కాలాగ్ని కాలభైరవ
కాలాంతక కాలగండ కాలాహి కళా
భీల సముద్య ద్దినకర
కాలాకృతితోడఁ బంక్తికంఠుఁడు వెడలెన్. 27

వ. ఇట్లత్యుత్సాహంబుగా యుద్ధరంగంబునకు బయలుదేఱిన సమయంబున. 28

## వంది చేసిన రావణుని స్తుతి

చూర్ణిక. జయ జయ కైకసీ గర్భ సముద్ర సంపూర్ణ సుధాకరా। జయ జయ మయ తనూజా మనోహరా। జయ జయ రాక్షస కుల సార్వభౌమా। జయ జయ సాగ రావరణ లంకాధీశ్వరా। జయ జయ పాకశాసన భద్ర శ్రీ హరణ చతురా। జయ జయ కుటిల వైశ్వానర పుటభేద నిర్ధూమధామా। జయ జయ సమవర్తి సంప ద్విచ్ఛేదకా। జయ జయ దనుజ వల్లభ హల కల్లోలా। జయ జయ యబ్ధీశ్వర తోయ శోషణ బడబానలా। జయ జయ పవమాన సంహారా। జయ జయ యక్ష నాయక దుర్వార గర్వాపహారకా। జయ జయ యీశా నైశ్వర్య హర బోద్యమా। జయ జయ నవగ్రహానుగ్రహ నిగ్రహా। జయ జయ దశగ్రీ వాలంకారా। జయ జయ కైలాస నగేంద్రోత్పాటన కందుక క్రీడా వినోదా। జయజయ భవానీశ్వర శ్రీపాద కమల శిరః కంజాత పూజా సమర్థా। జయ జయ పుష్పకారూఢ సకల దిగంత విక్రాంతా। జయ జయ బ్రహ్మ వంశ ప్రదీపకా। జయ జయ త్రిలోక విజయా।
[illegible] 29

వ. అని వంది బృందంబు లుభయ పార్శ్వంబుల జయజయ ధ్వను లతో బిరుదు గద్య పద్యంబులు వర్ణించింప ముక్తాతపత్రంబుల నడుమ మహిళా మండలార్పిత చామర పవన కంపిత కుంతలుం డగుచు వీర రసంబు పురుషాకారంబు దాల్చిన లీల నేతేర ముజ్జ గంబులు గడగడ వడంకెఁ, గులాచలంబు లొద్దగిల్లెఁ, జంద్రార్క మండలంబులు తఱఁబడె, నక్షత్రంబులు డుల్లె నట్టి సమయం బునఁ గరి బృంహితంబులు, నశ్వ హేషా రవంబులును, దనుజ భటాట్టహాసంబులును, సురత్రాస జనకంబులుగాఁ బటహ నిస్సాణ భేరీ శంఖ కాహళ ఢాంకార రవంబులును ప్రతిధ్వనుల నీన నంత రావణునిపై మేఘంబులు రక్త ధారలు వర్షించె, బిరుద ధ్వజంబులు విఱిగిపడియెఁ, దురంగంబుల వాలంబులనుండి నిప్పు లురలె, దిక్కుల ధూమంబు నిబిడంబై పర్వె, నట రామునిచే రావణుండు తెగుట యవశ్యం బని నభంబును మ్రోసె, నట్టి సమయంబున,

క. భూనాయకుఁ డతి వేగమ
దానవ సేనలకు నెదురు దార్కొని ఘోరన్
వానర సేనలఁ బంపెను
ధానుజ ముఖ్యాధిపతులఁ బౌరుష మడరన్. 31

మ. తరుశైలంబులతోడ నార్చుచు భుజా దర్పంబు లుప్పొంగ వా
నర వర్గంబు లెదిర్చి వచ్చునెడ నానాకారు లా దక్షిణో
త్తర వార్ధుల్ ప్రకటించి డాయు గతి నుద్య త్ప్రౌఢిఁ దార్కొంచు [సం
గరముం జేయఁగఁ జొచ్చి రంత సుర లాకాశంబునం జూడఁగన్

సీ. కరుల నెక్కించి భీకర లీలఁ ద్రొక్కించి
వాజులఁ ద్రోలి తీవ్రముగ నేయ

రథములఁ బఱపి శిరంబులఁ జక్కాడి
చెలఁగి పదాతులఁ జేరి పొడువఁ
బంతంబు చేకూఱఁ బ్లవగో త్తములఁ గేరి
తరువులఁ బాషాణ తతులఁ బఱపి
శైలంబు లదరించి సంహారముబు సేయఁ
గలఁగక దైత్యులఁ గపులు గలసి,

తే. పోరు నప్పుడు వానర వీరు లసుర
వరుల మీఁదను బాషాణ వర్ష మధిక
లీలఁ గురియింప దనుజు లావేళ విఱిగి
తలఁబు వీడంగఁ బఱచిరి త త్తరమున. 33

సీ. మెండైన రథముల మీఁదికిఁ గుప్పించి,
విక్రమ ప్రౌఢిమై విఱుగఁ ద్రొక్కి,
కరుల కొమ్ములు పట్టి బిరబిర నడిఁ ద్రిప్పి
జగతీ స్థలంబునఁ జదియఁ గొట్టి,
తొడరి సైంధవకోటి తడకాళ్లు విదళించి
పట్టి పెన్ జెక్కులువాఱఁ గొట్టి,
కాల్బలంబుల పైకిఁ గదిసి శస్త్రంబుల
తోడఁ గూడనె చుట్టి తునియఁగొట్టి,

తే. ఛత్రములు గూల్చి చామర సమితి విఱిచి,
కెరలి యార్చుచు బిరుదు టెక్కెములు చించి
వాద్య సంఘంబు లవలీల వసుధఁ గూల్చి,
కపులు దోలిరి దానవ గణము నెల్ల. 34

హనుమంతునిచే ఖడ్గరోముని ఖండనము

ఆ. అంతఁ బం క్తివదను నరదంబు నెదురుగా
నడుచు వాయుపుతు నకును ఖడ

రోముఁ డనియె నతని రూపించి నాతోడ
రణము సేయ వేగ రమ్మటంచు. 35

చ. పిలిచిన రోష మెత్తి కడు భీకర వృత్తిని ఖడ్గరోముతోఁ
దలపడ వాని రోమములు దాఁకి శరీరము నొచ్చి యంతలో
పల నొక పర్వతంబు గొని పావని దైత్యునిమీఁద నేయ ని
శ్చలతను ఖడ్గరోముఁడును జక్కగఁ జేసినఁ దత్క్షణంబునన్. 36

చ. మఱి యొక పర్వతంబు హనుమానుఁడు గైకొని వచ్చి క్రమ్మఱన్
మెఱవడిఁ ద్రిప్పి తద్రథముమీఁదను వైచిన వజ్ర ధారచేఁ
బఱియలువాఱి ధాత్రిఁ బడు పర్వతమో యనఁ దేరితోడ ని
ర్భరముగ ఖడ్గరోముఁడు సపాటగఁ గూలె ధరంబులోపలన్. 37

సర్పరోమాదుల సంహారము

ఆ. రోఁజి కలన ఖడ్గరోముండు గూలుట
సర్పరోముఁ డెఱిఁగి సాహసమున
వాలిసుతుని దాఁక వాని రోమంబుల
విషము సోఁకి నొచ్చి వేగఁ దెలిసి. 38

క. ఆలోన సర్పరోమునిఁ
దూలించుచు వాని ముక్కు దూలము పగులన్
వాలితనూజుఁడు దన్నినఁ
జాలంగా నొగిలి తెలిసి సాహస మొప్పన్. 39

ఉ. వాలితనూజు నెన్నుదురు వ్రక్కలు వాఱగఁ సర్పరోముఁ డా
భీలత నార్చి చేకొలఁదిఁ బేర్కొన కొట్టిన రక్త ధారలన్
దేలుచు నంగదుం డతని దీకొని పూని శిరంబు చెక్కలై
వ్రీలి పడంగఁగొట్టఁ బృథివీస్థలిఁ గూలెను సర్పరోముఁడున్. 40

క. ఆలోన సర్పరోముఁడు
గూలుట కనుఁగొనుచు మిగులఁ గోపంబునఁ దా
నాలో వృశ్చికరోముఁడు
నీలునిపై రథముఁ దోలె నిర్భయ వృత్తిన్. 41

ఉ. బోరన నీలుఁ డంత నొక భూజముఁ గైకొని వాని తేరిపై
శూరత నేసి యాక్షణమ చూర్ణముగా నొనరింప నేలకున్
ధీరత దాఁటి భూరుహముఁ ద్రెంచెఁ గనుంగొని నీలుఁ డొక్కమం
దార మహీజమున్ వయిచె ధారుణి వృశ్చిక రోముఁ డీల్గఁగన్.

సీ. వృశ్చికరోముఁ డావేళఁ ద్రుంగుటఁ జేసి
వడి రోషమున నగ్నివర్ణుఁ డదరి
త్రేతాగ్ను లొక్కఁడై తెరలి మఁడిన లీలఁ
దన మేని మంటలు దరికొనంగ
రావణు నెదురఁ బరాక్రమస్థితిఁ బేర్చి
రామచంద్రునిమీఁద రథముఁ ద్రోలి
ప్రల్లదంబునఁ బెక్కు భాషలు నుడువుచు
సాయక నిచయంబు లేయు నెడను

తే. వాని శౌర్యంబుఁ దెంపును వాని బలముఁ
జూచి భూపాలుఁ డప్పుడు చోద్యపడుచు
ధనువునందును వారుణాస్త్రంబు దొడిగి
యగ్నివర్ణుని తలఁ ద్రుంచె నా క్షణంబ. 43

తే. అగ్నివర్ణుండు తెగిపోవు టసుర వరుఁడు
కన్నులారంగఁ గనుఁగొని కలుష వృత్తి
రామచంద్రుని డాయంగ రథముఁ బఱపి
పలికె నుత్కట గర్వ ప్రభావుఁ డగుచు. 44

క. జాఱకుమా బీరము చెడి
పాఱకుమా రిపులు నవ్వ భయపడి వనమున్
దూఱకుమా పేర్కొంచును
జీరకుమా కపులఁ దోడు చేకొని పోరన్. 45

మ. అని విల్లెక్కిడి దైత్య నాయకుఁడు రోషాయత్త చిత్తమ్మునన్
ఘన మౌర్వీ నినదంబు భీకరముగాఁ గావించి పెల్లార్చి య
జ్జననాథాగ్రణి మీఁద నుగ్ర శరముల్ సంధించి బిట్టేయఁగా
వినువీథిన్ సురసంఘముల్ గొలువఁగా వీక్షించె దేవేంద్రుఁడున్.

వ. ఇట్లు కనుంగొని, 47

శ్రీరామచంద్రున కింద్రుఁడు రథమును గానుకగఁ బంపుట

క. రథ మెక్కి రావణుండును
బృథివీస్థలి నుండి రామ పృథ్వీపతియున్
బ్రథనము సేయుట తగ దని
వ్యథఁ బొందుచు నాత్మలోన వాసవుఁ డంతన్. 48

క. మాతలిచేతను గవచము
చాతుర్యము గలుగు రథము చాపము శరమున్
భూతల నాయకునకుఁ బురు
హూతుఁడు పుత్తెంచెఁ గడు మహోన్నత మహిమన్. 49

వ. ఇట్లు పుత్తెంచిన, 50

చ. ధరణికి వచ్చి మాతలి ముదంబున రాముని జూచి మీకుఁగా
సురపతి పంపినాఁ డధిక శోభన కృత్యములై వెలుంగు నీ
శరములు విల్లు వజ్ర కవచంబును దేరును వీనిచేత సం
గరమున దైత్యునిం దునిమి కైకొను రాఘవ! శ్రీజయంబులన్.

వ. అని చెప్పిన మాతలి ప్రియ వచనంబులకు సంతసించి విభీష
ణానుమతంబున రామ భూపాలుండు వజ్ర కవచంబు దొడిగి
శరశరాసనంబులు గైకొని యింద్రస్యందనంబునకు వలగొని
వందనం బాచరించి బాలాదిత్యుండు పూర్వ పర్వతం బెక్కు
చందంబున రథం బెక్కి నంత జయ జయ ధ్వనులతో సుగ్రీ
వాంగద హనుమదాదులైన వానర వీరులు మ్రొక్కి రప్పు డంత
రిక్షంబున దేవ సంఘంబులు సంగ్రామ రంగంబుఁ జూడ వేడ్క
పడి వచ్చి విమానంబులతోఁ గ్రిక్కిరిసి చూచుచుండి రా సమ
యంబున, 52

## రామ రావణుల నిరుపమ మహా సమరము

క. గిరి గిరి, నభము నభంబును,
ధర ధరయును, జలధి జలధి దార్కొను రీతిన్
సుర రిపుఁడు నసుర రిపుఁడును
దురమున నెదిరించి రధిక దోర్బల యుక్తిన్. 53

వ. ఇట్లు మార్కొనుచు, 54

శా. వీరాలాపము లాడుచుం గదిపి దోర్వీర్యంబుతోడన్ ధను
ర్జ్యా రావంబులు మిన్నుముట్ట నతి తీవ్రంబైన శబ్దంబులన్
వారాసుల్ కలఁగంగ నార్చి నిజ గర్వ స్ఫూర్తి నుప్పొంగుచున్
గ్రూరాస్త్రంబుల నేసి రొండొరులపైఁ గోదండ పాండిత్యులై. 55

క. దనుజేశుఁ డేయు శరమును
మనుజేశుఁడు తప్పఁ ద్రుంచు మార్కొని కడిమిన్
మనుజేశుఁ డేయు శరముల
దనుజేశుఁడుఁ దప్పఁ ద్రుంచుఁ దత భుజ శక్తిన్. 56

క. కంటున వేసిన శరములు
వింటన్ దప్పించుకొనుచు వెస బాణములన్
గెంటింపుచు దమ గాత్రము
లంటక యుండంగ నేటు లాడిరి కడిమిన్. 57

క. మొదల నొక బాణ మావలఁ
బదులను బది పదులు వేయుఁ బదివేలును నేఁ
బదివేలు లక్ష కోటియుఁ
జెదరక విలుకాండ్రమీఁద శీఘ్రమ పర్వెన్. 58

క. తొడిగిన బాణము వింటను
దొడిగిన యట్లుండు మిగుల దోర్దో నవలన్
వెడలెడు శరములు లెక్కకుఁ
గడ గులు తనరాక చిత్ర గతులన్ బర్వెన్. 59

వ. అట్టి సమయంబున, 60

చ. అభవ మురాంతకాదులు మహాత్ములు వింటికి వారికన్ననున్
త్రిభువనమందు వీరె గణుతింపఁగ నెక్కు డటంచు మెచ్చుచున్
నభమున నుండి ప్రస్తుతి ఘనంబుగఁ జేతురు దేవ కోటు ల
ట్లుభయ ఫలంబునం బొగడుచుందురు రాముని రావణాసురున్. 61

చ. ధనువుల మ్రోఁత మేఘ నినదంబులుగా శర దీప్తి జాలముల్
ఘన వర చంచ లావళులుగా మణి మౌక్తిక దీప్తి ధాత్రీమీఁ
దను వడగండ్లుగా క్షతజ ధారలు సంతత వర్ష ధారగా
ననయముఁ జెప్ప నొప్పె విపు లాహవ మప్పుడు వాన కాలమై.

తే. పంక్తికంఠుండు మిగులఁ గోపంబు గదుర
దేవ గంధర్వ శరము సంధించి తివిచి

రామ భూపాలుమీఁద విక్రమము మెఱసి
వేసి వడి నార్చె దిగ్దంతి విసర మదల. 63

క. దానికిఁ బ్రతి శర మప్పుడు
మానవ నాథుండుఁ దొడిగి మానుష మదరన్
బూనిక నేసిన దానిం
బోనీయక త్రుంచి వైచె భువనము లలరన్. 64

క. త్రుంచినఁ గనుఁగొని దనుజుఁడు
మించిన కోపమున రాముమీఁదను వడి సం
ధించి స్ఫుర ద్విష బాణము
వంచింపక యేయ దానివలనన్ జాలన్. 65

ఆ. నాగశరము లొదవి నానా ముఖంబుల
వచ్చునపుడు మనుజ వల్లభుండు
గరుడ బాణ మేసి ఖండించె నన్నింటి
మింట సురలు సూచి మెచ్చి పొగడ. 66

చ. అది వృథ వోయినన్ దనుజుఁ డాగ్రహ మూని కర త్రిశూల మ
య్యదనునఁ ద్రిప్పి వైవ విపు లార్చులఁ బేర్చుచు వచ్చు దానిపై
వదలక ముందుగాఁ ద్రిదశ వల్లభుఁ డిచ్చిన శక్తి నేసినన్
బొదలుచుఁ బాఱి త్రుంచె మణి భూషణ జాలము నా త్రిశూలమున్.

వ. అట్లు శూలంబును దూలి పోయిన, 68

క. సూతుని రథమును వాజులఁ
గేతువుఁ దూలంగ నేసి కినుక మెఱుం జే
సేతను నొప్పించిన నృపుఁ
డా తటి దైతేయ విభుని నద్భుత మదరన్. 69

క. సూటి గొని యసుర తలల కి
రీటము లవలీల డుల్లి రివ్వన నొసలున్
వీటలు వాల శతాంగము
ఘోటకముల గుండె లవిసి కూలఁగ నేసెన్. 70

ఉ. ఆయెడ దైత్య నాయకుఁ డహంకృతి రాముని మేన నాటఁగా
వేయు శరంబు లాయముల వేగమె గాఁడిన రక్త పూరముల్
కాయము దొప్పఁదోఁగ వడిఁ గ్రమ్మెడు నప్పుడు గూడ నొప్పెఁ బ
ద్మాయత లోచనుండు చరమాద్రి తటిం దగు భానుఁడో యనన్.

ఆ. అంత రామచంద్రుఁ డత్యంత కుపితుఁడై
బాణవృష్టిఁ గురియఁ బంక్తిముఖుఁడు
కాలు ద్రేఁప చెయ్యి కదలింప నోపక
మెదల లేక రథముపైఁద నొరిగె. 72

వ. రావణుండు సొమ్మసిల్లి పోవు పెల్లింగి కాలకేతుఁడు తేరు దూరం
బుగాఁ గొనిపోయినఁ గొంత ప్రొద్దునకు దనుజేంద్రుండు మూర్ఛ
దేరి "యోరీ! పగవారలు నవ్వఁ దగ దనక రథం బిట్లు తేఁ
దగునే?" యని కోపించినఁ గాలకేతుండును యుద్ధ మధ్యంబున
దేవరకు సంకటంబైన రథంబు వెడలఁ గొనిపోవుట యోటమి
గాదని ధర్మవిదులు సెప్పుదురు గావున నే నిట్లు దెచ్చితి నని
విన్నవించిన సూతుని వాక్యంబులకు మెచ్చి పసదనంబు లిచ్చి
మన రథంబు రాముని పయిం బఱపు మనిన నట్ల కావించినం
గనుంగొని, 73

క. ఆతని రథమున కెదురుగ
మాతలి! మన రథముఁ బఱపుమా యన నతఁడున్
వే తీవ్ర గతిం బఱపిన
భూతలపతి పలికె దనుజ పుంగవుతోడన్. 74

## రామ రావణుల వీరాలాపములు

ఉ. భూరి భుజ ప్రతాపమునఁ బొంగుచు నిర్జరకోటి మాటికిన్
బోర జయించి తంచుఁ బలు పోకలు పోదువు నీవు, భీతిమైఁ
బారక నిల్చి నా యెదఁ బ్రతాపము సూపుము, చూపవేని నా
వారిజగర్భుఁ డడ్డుపడ వచ్చినఁ జంపుదు నిన్ను రావణా! 75

ఉ. అలములోన వానరుల నాలము సేసినయట్లు గాదు నా
వాలి శరంబు నీ నుదుటి వ్రాలు హరింపఁగఁ బాలుపడ్డ దీ
వేళ వృథాపహాస్యములు వేయి విధంబుల మానలేక తాఁ
గాలుఁడు కన్నుగీటె నిదె కాలము దగ్గఱె నీకు రావణా! 76

చ. హరి గిరి వహ్ని గిహ్నిఁ బ్రళయాంతకుఁ గింకరు దైత్య గీత్య వా
ర్వరు గిరు గాడ్పు గీడ్పు ధనవల్లభు గిల్లభు రుద్రు గిద్రు సం
గరమున నోర్చినట్టి దశకంధర! నీకు జయింప వచ్చునే?
సుర నగ ధీరు నుగ్ర రణ శూరుఁ బయోధి గభీరు రాఘవున్. 77

క. మఱిఁ దలఁప సుఖ రతిం బతి
వ్రతలను మునివరులఁ బట్టి వ్రతములు గర్వో
న్నతిఁ జెఱచినట్టి దురిత
స్థితి యిప్పుడు నీవు నాకుఁ జిక్కితి విచటన్. 78

వ అని గర్వాలాపంబు లాడుచున్న యుర్వీశునకుఁ బూర్వ గీర్వాణా
ధీశ్వరుం డగు రావణాసురుం డిట్లనియె: 79

క. అంతటి భూరి పరాక్రమ
వంతుఁడ వౌ టెఱుఁగుదేని వసుధేశ్వర! నా
పంత మెఱింగియు నెఱుఁగక
యింత ప్రగల్భముల నాడ నేటికి నీకున్? 80

క. నీ లావును నా లావును
వాలా యము సురలు సూచి వర్ణింపఁగ నేఁ
డాలములోపలఁ జూపుద
మేలా గర్వోక్తు లిప్పు డిన కుల తిలకా! 81

మ. జననా థాగ్రణి! నా ప్రతిజ్ఞ వినుమా శాంతాత్ముఁడై నీకునై
*వనజాప్తుం డిట వచ్చి కావు మనుచున్ వైశంబ నన్ గోరినన్
వినువీథిన్ సుర లెల్లఁ జూచి వెఱవన్ భీకంబు సంధిల్లఁగా
నిను నీ తమ్ముని జంపకుండ మరలన్ నే లంకకుం బోదునే?

వ అని కోపోద్దీపిత మానసులై వీరాలాపంబు లాడుచు నిద్దఱును నుద్దవిడి గద్దింపుచు నోల మానగొనక మీఱిన కోపంబున శరీరంబులు మఱచి జయోల్లాసంబు లుల్లసిల్ల నొనళ్ళఁ బొడము పెన్నెమట మొత్తంబులును రక్త పూరంబులును బెరసి కాలువలై పాఱుచుండ, మెఱుంగు కఱకు టంపగములు నాటినం జూఱు కెఱుంగక తమకంబులను నిష్ఠుర బాణ సంఘట్టనంబులను బృథుల రథ నేమి స్వనంబులను, ద్విసహస్ర తురంగ హేషా రవంబులను, భటుల సింహ నాదంబులను గగనంబు వగుల జగంబులు కలంగ సముద్రంబులు ఘూర్ణిల్ల ధాత్రి వడంక దిగ్గజంబులు మ్రొగ్గతిల్లఁబడ నభో భాగంబున దేవ గంధర్వ సిద్ధ సాధ్య కిన్నర కింపురుషాదులు సూచి వెఱంగుపడ నిది పగ లిది రాత్రి యని యెఱుంగక తమకంబున నే డహో రాత్రంబులు పోరాడి యలసి బాణ ప్రయోగంబు లుజ్జగించి యొకరి నొకరు సూచుచుండ నయ్యవసరంబున, 83

*వనమా లద్దము వచ్చి కావు మనుచున్ వైశంబ చేఁపట్టినన్.

తెగినతోడనే మఱల మొలచుచున్న రావణుని శిరములు

క. సరసీరుహ మిత్త్రాన్వయుఁ
దరు దరు దని సురలు వొగడ నసురేశ్వరు న
క్కరములు శిరములుఁ దెగిపడ
నరు ముష్టిని దీసి వేగ నుగ్రాస్త్రములన్. 84

క. తెగి పడిన తలలుఁ జేతులు
దెగినట్లే మొల్చుచుండఁ దీవ్రత యదరన్
జగతీశుఁ డపుడు మదిలోఁ
దెగ కుండుట చిత్ర మనుచు దీకొని మఱియున్. 85

క. ఒక కోలఁ దలలుఁ జేతులుఁ
బ్రకటంబుగఁ ద్రుంచినంత బాహులుఁ దలలున్
వికచాంబుజముల రీతిని
సకలేశుఁడు వెఱగు పడఁగఁ జయ్యన మొలిచెన్. 86

క. తొడగెడి శరములు ధరపైఁ
బడియెడు మస్తకము లేరుపడ కుండఁగ న
ప్పుడు రామ మహీతలవరుఁ
దెగతెగ కుండంగ నేసె నేమని చెప్పన్. 87

వ. అట్టి సమయంబున, 88

ఆ. వింటఁ దొడుగు శరము వెడలెడు శరమును
దిరుగ మొలుచు తలలుఁ దెగిన తలలు,
నెట్టివారి కైన నెఱుఁగంగ రాకుండ
రాముఁ డేయఁ దొడగె రణములోన. 89

ఆ. *శరము దొడిగి తివియఁ జక్రంబువలె నుండు
శరము విడుచు నపుడు చాప మగును
జూడ నొప్పె నొర శోభితం బగు రాము
చేతి విల్లు సెప్పఁ జిత్ర మగును. 90

ఉ. కాంచన పుంఖ దివ్య విశిఖంబుల బాహులు మస్తకంబులన్
ద్రెంచినఁ ద్రెంచినట్లె కడుఁ దేజ మెలర్పఁగ నుద్భవించు స
త్కాంచన రత్నభూషణ నికాయము దీప్తులు ప్రజ్వరిల్లఁగాఁ
గాంచన గర్భ దత్త వర గర్వ విశేషముచేత సారెకున్. 91

చ. పొరిఁ బొరిఁ ద్రుంచినన్ దిరిగి పుట్టెడు చందముఁ గోల నారిపై
వెరపుగఁ బూను చందమును వేసెడు చందముఁ బాహుదండమున్
గరము నుతింపఁగా నరుదు గాదె తలంపఁగ దేవ తాశికిన్
శిరముల చిత్రమున్ నృపతి చేతి విచిత్రము తూపు చిత్రమున్.

ఉ. రావణుఁ డేయు బాణములు, రాముని బాణము లొక్క పెట్టునన్
రావణు మేన నాటియును, రాముని నాటియు రక్త పూరముల్
పూవులతోడి మోదుగను బూర్వ గిరీంద్రము మీఁది భానునిన్.
జేవురుకొండ కాలువల సిందురమున్ దలపించు నెంతయున్. 93

క. ఒత్తిలి రాముఁడు దైత్యుని
కుత్తుక నొక కోలఁ ద్రుంచి కూల్చుటఁ దోడ్తో
నెత్తురు గ్రమ్మక మున్నే
మొత్తములుగఁ దలలు మరల మొలచుట యేమో! 94

వ. అని దేవ సంఘములు గొనియాడ శ్రీరామచంద్రుండు దైత్య
నాయకుని తలలుఁ జేతులుం ద్రుంచి త్రుంచి విసివినం గని విభీష
ణుండు నరేంద్రున కిట్లనియె: 95

*వింట నమ్ము తొడుగ విల్లు చక్రంబును

## విభీషణుఁడు తెలిపిన రావణ మరణ రహస్యము

క. పోలఁగ నాతని నాభీ
మూలంబున నున్న యమృతమును మొదలను ని
ర్మూలముగా శ్రీరఘుభూ
పాలక! తెగవ్రేయు మగ్ని బాణముచేతన్. 96

క. అది తెగిపోయిన పిమ్మటఁ
బది తలలును రెట్టి గలుగు బాహులు మరలన్
జెదరక తునుమఁగఁ దునుమఁగఁ
దుది ముట్టఁగ మొలచు నూట తొమ్మిదిమారుల్. 97

వ. అంత నంతం బౌనని విన్నవించిన విని రామభూపాలుం డట్లు
గావించిన, 98

క. ఒక తలయు రెండు చేతులు
నకలంక స్థితిని గల్గు న ట్లితనిన్ నేఁ
డొక తలకుఁ దెచ్చె నౌ నని
ప్రకటించిరి సురలు రామభద్రుని నెలమిన్. 99

తే. అంత నమృతంబు తెగిపోవ నసుర విభుని
మేన బాహులుఁ దలలును మిన్న కడఁగి
పోయి కనుపట్టె నప్పు డద్భుతము గాఁగ
రెండు చేతులునుం దల యొండె మిగుల. 100

వ. అంత దైత్యేంద్రుండు తన మనంబున. 101

క. ఎవ్వరు నెఱుఁగని మర్మం
బి వ్విభునకు నెఱుక పఱుప నిటు గావించెన్
మవ్వమున ; నీ విభీషణు
క్రొవ్వెల్ల నడంతు నంచుఁ గ్రూరతతోడన్, 102

సీ. తొల్లి వర ప్రాప్తి దొరికిన యటువంటి
రక్తాభ మను మహా శక్తి దివిచి
గంధ పుష్పాక్షత కలితమై కనుపట్టి
విపుల తేజంబున వెలయుచున్న
దానిఁ బ్రయోగింప దారు ణానల తీవ్ర
శిఖలు దిక్తటములఁ జెలఁగుచుండ
ఘన ఘనారావమై ఘంటా నినాదంబు
శ్రుతి పుటంబులకు నశ్రుతము గాఁగఁ

తే. జండతరముగ నట విభీషణుని పైకిఁ
జిచ్చు లమియుచు నుగ్రమై వచ్చుదానిఁ
గాంచి రాముండు నిశిత మార్గణముచేతఁ
దృణము కైవడి నడిమికిఁ ద్రెంచివై చె. 103

వ. ఇట్లు తన శక్తి వృథ యగుటఁ గని దానవేంద్రుండు మానవేం
ద్రునిపైఁ గరం బలిగి నిట్టూర్పు నిగుడింపుచు, నసి ముసల
ముద్గర పరశు పట్టిస ప్రాస గదాదండ కోదండ భిండివాలాది
సాధనంబుల నవక్ర విక్రమంబున నాలంబు సేయుచుండఁ గని
విభీషణుం డులికి దేవా! వీడు రెండు కరంబులతోడనే మెండుగ
యుద్ధంబు సేయం దొడంగె నింక శిరంబులుఁ గరంబులు మరల
నుద్భవించెనేని గార్యంబు దప్పుటకు సందియంబు లేదు. కావున
వీని నీలోనన బ్రహ్మాస్త్రంబున నడఁగింపఁ దగు నని విన్న
వించిన. 104

## శ్రీరాముఁడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రముచే రావణ హననము

మ. అనఘుం డుజ్జ్వల చాప దండమున బ్రహ్మాస్త్రంబు సంధించి యొ
య్యనఁ గర్ణాంతముగాఁ గడున్ దివిచి ప్రత్యాలీఢ పాదస్థుఁడై

దనుజాధీశ్వరు బాహు మధ్యము వడిం దాఁకంగ లక్ష్యంబుగాఁ
గొని బిట్టేసె నదల్చి తీవ్రతరమౌ కోపంబు దీపింపఁగన్. 105

క. ఆ వ్రేటు వడిగ నాటిన
రావణుఁ డతి వివశుఁ డగుచు వ్రాలె ధరిత్రిన్,
దేవ తతి పొగడి యప్పుడు
పూవుల వర్షంబు గురిసె భూవరు మీఁదన్. 106

ఉ. సంగర భూమి రావణుఁడు సత్త్వముఁ దూలి ధరిత్రిఁ గూలినన్,
గ్రుంగె భరంబునన్ ధరణి. క్రుంగెఁ గులాచల వర్గమెల్ల. వేఁ
గ్రుంగె దిశా కరీంద్రములు, గ్రుంగె మహోరగ వంశ నాథుఁడున్,
గ్రుంగె ఢులీ కులేశ్వరుఁడు, క్రుంగె వరాహము గ్రుడ్లు తేలఁగన్.

క. జగములకు నెల్ల బాధకుఁ
డగు రావణుఁ డాజిఁ గూల నంతటితోడన్
బగ దీఱె ననుచు రాముఁడు
తగఁ దన విల్లెక్కు డించి తమ్ముని కిచ్చెన్. 108

సీ. అఖిల లోకమ్ముల కానంద మొదవెను,
సురల కంటికి నిద్ర సోఁకె నంత,
మునులు చేసిన తపంబులు చాల ఫలియించెఁ,
దొడరి సాధ్యులకుఁ దుందుడుకు వాసె,
గుహ్య కావళికిని గూడు నోటికిఁ బోయె,
సిద్ధుల తలఁపులు సిద్ధి నొందె,
దర్వీకరంబుల తల్లడం బడఁగెను.
గిన్నర సంఘంబు కీడు తొలఁగె,

తే. గరుడ గంధర్వ ఖేచర గణములకును
క్షేమ మింపారె, జన పరిణామ మయ్యె.

వేడ్క లింపొందె, బాధలు విఱుగఁడయ్యె.
సంగరంబున దైత్యుండు డ్రుంగు నంత. 109

ఉ. అంత విభీషణుండు తన యన్న పదంబులమీఁద వ్రాలి, య
త్యంత విషాద దుఃఖ జనితాశ్రు కణంబులు రాల నేడ్చె లో
కాంతకుఁ డైన రావణు మహాద్భుత దుష్టపరాక్రమంబు భూ
కాంతుని ముంగలన్ దడవి గద్గద కంఠ కషాయ నేత్రుఁ డై.

మండోదరీ విలాపము

వ. అట్టి సమయంబున మండోదరి మొదలైన యంతఃపుర సుందరీ
సందోహంబు లేఁతెంచి, తమ ప్రాణేశ్వరుండైన రాక్షసకుల
సార్వభౌముం గని వక్షంబులు శిరంబులు మోఁదుకొనుచు బహు
విధంబులఁ బ్రలపించుచుఁ బరివేష్టించికొనియుండ భూకాంతుండు
కాంతాలాపంబుల ననునయించి విభీషణుం గని, నీవు దుఃఖం
బుడిగి మీ యన్నకు నగ్నిసంస్కారాది విధుల నాచరింపు మనిన
నతం డట్ల కావించిన యనంతరంబ విభీషణుని లంకానగరంబు
నకుం బట్టంబు గట్టించిన, నతండు సుగంధ ద్రవ్యంబులును, నవ
రత్న ఖచితంబులైన భూషణంబులును, జీని చీనాంబరంబులును
గానుకగా నిచ్చినం బరిగ్రహించిఁ యవి యెల్లను మాతలి కిచ్చి,
ప్రియోక్తులం దనిపి యనిపిన నతండు స్వర్గంబునకుం జనియె
నయ్యవసరంబున, 111

విభీషణుఁడు శ్రీరాముని విజయ వార్తను
సీతకు నివేదించుట

సీ. ఆలోన రాఘవుం డా విభీషణుఁ జూచి
సత్ప్రీతి యుక్తిమై సరగఁ బిలిచి

పం_క్తికంధరు నాజిఁ బరిమార్చితి నటంచు
        వసుమతీ తనయకు వా_ర్త సెప్పి
నీ దేవి మొదలగు నీరజాక్షులచేత
        నతివకు శృంగార మమరఁ జేసి
కొంచు రమ్మని చెప్ప నంచిత గతి నేఁగి
        సరమాది సతుల కా నరణిఁ జెప్ప

తే. సతులు నిర్మల జలముల జలక మార్చి
పట్టు పుట్టంబు ముదమునఁ గట్టఁ బెట్టి
చందన మలంది సురభి పుష్పములు ముడిచి
మేలి మణి భూషణంబులు సొలఁ దొడిగి. 112

క. ఇందిరతో సరి యగు నా
సుందరిఁ దై ్రలోక్య మాత సొబ గొందఁగఁ దా
రందలమునఁ గొనివచ్చిరి
కందర్ప విభుండు రాము కడకుం బ్రీతిన్. 113

వ. ఇట్లు గొనివచ్చి రామ భూపాలుని సమ్ముఖంబున నునిచిన న ద్ధరా
తనూజాత పతికి వినయ భ_క్తి తాత్పర్యంబులు వెలయఁ బ్రణ
మిల్లిన నతండు వనితారత్నం బగు సీతం గనుంగొని యిట్లనియె:

సీత యగ్ని ప్రవేశము

క. కుల సతిఁ జెఱ గొనిపోయిన
యల శాత్రవు గెలువ నోపఁ దను పలుకులకున్
గెలిచితిఁ బగఁ జంపితి నిఁక
నెలఁత! నీ యిచ్చఁ జనుము నే నిన్నొల్లన్. 141

ఆ. అనుచుఁ బలుకు పలుకు లవనీ తనూజాత
కర్ణములకు వాఁడి గలుగునట్టి
నారసములు సోఁకి నాటిన యట్లైన
సరసిజాక్షి మూర్ఛ జాలి నొంది. 116

చ. నరవర! నాదు చిత్తము మనంబున నీవ యెఱింగి యుండియున్
బరుషము లాడ నేమిటికిఁ, బాపము నాయెడ లేదు, కాదు వో
సురలు నుతింప మేటి సొదఁ జొచ్చెద మెచ్చుఁ డటన్న, రామ భూ
వరుని మనం బొడంబడిన, వారిజ లోచన సీత యాతఱిన్. 117

క. హృదయేశుఁ డలర నప్పుడ
సొదఁ జొచ్చెను భూమి పుత్రి సురలు నుతింపన్
ముద మంది పద్మభవుఁ డా
యదనం బ్రత్యక్ష మయ్యె నౌ నౌ ననుచున్. 118

బ్రహ్మ సీత సౌశీల్యమును బ్రస్తుతించుట

ఆ. అంతఁ బద్మగర్భుఁ డవనీశుఁ డగు రామ
భద్రుఁ జూచి పలికెఁ బరమ పురుష!
వనజనేత్ర సీతవలన యే దోషంబు
లేదు నమ్ము మయ్య మేదినీశ! 119

వ. అని పలికిన పితామహుని మాటల కుభయ సేనలును సంతసిల్లినవి. అనంతర మగ్నిభగవానుండు న య్యంగనం గొనివచ్చి పరమ పతివ్రతాభరణం బగు నిద్ధరా తనూజాతం గైకొమ్మని యప్పగించిన నయ్యెడ దశరథుండు ప్రసన్నుండైన శ్రీరామచంద్రుండు సతీసమేతుండై తమ్ముండును దానును నమస్కరించినఁ గురమా

ద్వయంబును గోదలిని నాలింగనంబుచేసి త ద్దుఃఖంబులం బాపి
చనియె నప్పుడు సకల దేవతలు ని ట్లనిరి: 120

## దేవతలు చేసిన శ్రీరామ స్తోత్రము

క. మాకొఱకు జనన మొందితి
రాకాసుల రాజుఁ జంపి రక్షించితి వా
లోకంబు లెల్లఁ గృపతో
సాకేత పురాధినాథ! సజ్జన వినుతా! 121

క. అని వినుతి సేసి కలనన్
జనిపోయిన కపుల నెల్ల సత్కృప బ్రదుకుం
డని వరము లిచ్చి యరిగిరి
ఘను లా దేవతలు మరలి గగనంబునకున్. 122

వ. త దనంతరంబున. 123

తే. భాను పుత్త్రాది వానర బలముతోడ
ఘన విభీషణ ముఖ్య రాక్షసులతోడ
మఱియు జానకితోడ లక్ష్మణునితోడఁ
బుష్పకం బెక్కి చనియె నా భూమివిభుఁడు 124

## సీతా లక్ష్మణ సుగ్రీవాదులతోఁ బుష్పక విమానమున శ్రీరాముని పయనము

వ. ఇట్లు పుష్ప కారూఢుండై చనుచుండి రామ భూకాంతుండు కాంతా
రత్నంబునకుఁ జేయెత్తి చూపుచు సంగ్రామ స్థలం బిదె, రావణ

కుంభకర్ణాదులైన రాక్షస బలంబును మర్దించిన తా విదె, సువే లాచలం బిదె, సముద్రంబున బంధించిన సేతు బంధనం బిదె, విభీషణుఁడు మమ్ము శరణు చొచ్చిన ప్రదేశం బిదె. సుగ్రీవుని కిష్కింధా నగరం బిదె, వాలిని నేలఁ గూలనేసిన చోటిదె, భాను నందనుండు మమ్ముఁ బొడగన్న స్థలం బిదె, ఋశ్యమూకా చలం బిదె, వాయు తనూభవుండు మమ్ముఁ బొడగన్న తా విదె, పంపా సరోవరంబు నిదె, కబంధుండను దానవుని వధించిన ప్రదేశం బిదె, జటాయు వను పక్షీంద్రుండు నిన్ను గొనిపోవు నప్పుడు రావణాసురునితోడం బోరి మడిసిన స్థానం బిదె, జన స్థానం బిదె, దశవదనుండు నిన్నుఁ జెఱగొనిపోయిన చోటిదె, మాయామృగంబును బడనేసిన చోటిదె, ఖర దూషణాదులు నాతోడఁ బోరి పొలసిన తా విదె, శూర్పణఖ యనుదాని ముక్కు సెవులుం జెక్కిన యిక్క యిదె, సుతీక్ష్ణుం డను మునీంద్రుండు వర్తించు నాశ్రమం బిదె, యగస్త్యాశ్రమం బిదె, యత్రి మహా మునీంద్రుని పత్ని యనసూయాదేవి యంగరాగంబులు నీ కిచ్చిన చక్కి యిదె, విరాధుం డను రాక్షసుండు నిన్నుఁ బట్టుకొని పోవుచుండ విడిపించిన చోటిదె, చిత్రకూటాచలం బిదె, భర తుండు మనల నొడంబఱచి మరలఁ గొనిపోవ వచ్చిన చోటిదె, గంగానది యల్లదే, కనుంగొను మని చెప్పుచు భరద్వాజాశ్ర మంబుఁ జేరం జని యచ్చటఁ బుష్పకంబు డిగ్గి, య మ్మునీంద్రు నకు నమస్కరించిన నతండు రాముని దీవించిన మహానందంబు నొంది, యనిల సంభవా! వేవేగ నీ వేఁగి నందిగ్రామమ్మున నున్న భరతునకు మా రాక యెఱింగించి రమ్మని యనిపిన, 125

క. అరుదెంచి కాంచెఁ బావని
సురుచిర సౌభాగ్య భరతు శోభన చరితున్,
విరచిత పుణ్య స్ఫురితున్
నిరుపమ సత్కీర్తి నిత్య నిరతున్ భరతున్. 126

వ. కనుంగొని వందనంబు సేసి కరంబులు మోడ్చి వినయంబున,

ఆ. భరతునకును రామభద్రుఁ డేఁతెంచిన
వార్తఁ జెప్ప వినుచు వాయు సుతుని
గారవించి విందు కౌఁగిటఁ జేర్చుచు,
నగ్రజన్ము సేమ మడిగి యడిగి. 128

క. తల్లులు ముప్వురకును రఘు
వల్లభుఁ డేఁతెంచినట్టి వార్తలు దెలుపన్
బల్లిదుఁ డగు తన తమ్ముని
నల్లన సాకేత పురికి ననిపెన్ వేడ్కన్. 129

## అయోధ్యా నగర ప్రవేశము

వ. అట భరద్వాజాశ్రమంబున మజ్జనభోజనాదు లాచరించి నాఁటి రాత్రి నిలిచి మఱునాఁ డమ్మునీంద్రుని వీడ్కొని శ్రీరామ చంద్రుడు పుష్పకారూఢుండై చనుదెంచుచున్న యప్పు డన్నకు భరతుండు సకల సేనా సమేతుండై తల్లులుం దమ్ముండును నెదు రేఁగి రాఘవేశ్వరు పాదారవిందంబులకు వందనం బాచరించిన నతం డనుజన్ములఁ గౌఁగిలించుకొని లక్ష్మణ సహితుండై జనక రాజ నందనం గూడి తల్లులు ముప్వురకుం బ్రణమిల్లి వార లతి

స్నేహంబున నిండు కౌఁగిళ్ళ నొత్తుచు దీవింపఁ దమలోఁ దాము
పెద్ద పిన్న యంతరువుల వందనంబులు సేసికొని మరలి, నంది
గ్రామంబున కేఁగి యచ్చటఁ బుష్పకంబు డిగ్గి, దాని కర్చన లిచ్చి
కుబేరుని వీటికిఁ బొమ్మని యనిపి, భరతు మందిరంబు ప్రవేశించె 130
నట్టి శుభ సమయంబున,

క. దానంబు లిచ్చి భద్ర
స్నానంబులు సేసి భూషణంబులు పూఁతల్
చీనాంబరములుఁ బరిమళ
సూనంబులుఁ దాల్చి రధిక శోభన లీలన్. 131

వ. ఇట్లు రామాది సోదర చతుష్టయంబును, భూమి నందనయును
దపోవేషంబు లుజ్జగించి రాజ చిహ్నంబులు గైకొని దానవ వానర
బలంబులం గూడుకొని షడ్రసోపేతంబులైన భోజనంబులం బరి
తృప్తులై యా రాత్రి గడపి మఱునాఁడు గజ తురగ స్యందనాది
వాహనంబు లెక్కి, ఛత్ర చామరాదులు మెఱయ, శంఖ భేరీ
ఝాంకారంబు లుల్లసిల్ల, వంది మాగధుల బిరుదు కైవారంబులు
సెలంగ నయోధ్యా పురంబుఁ బ్రవేశించి నగరులోనికిఁ జొత్తెంచి
వసిష్ఠానుమతంబున శుభ ముహూర్తంబున భద్ర సింహాసనం
బునఁ బట్టభద్రుండై రామభద్రుండు భూసురులకు దానంబు
లొసంగి యర్థార్థుల కిష్టార్థంబు లిచ్చి విభీషణ సుగ్రీవాంగద
జాంబవ ద్ధనుమ దాదులఁ బ్రియ వచనంబులం దనిపి వారి వారికిం
దగిన పగిదిని గట్నంబు లిచ్చి వీడ్కొలిపిన వారు నిజస్థానంబు 132
లకుం జని రంత మహానందంబున.

ఆ. అశ్వమేధ యాగ మన నొప్పు జన్నంబు
నెలమిఁ జేసి దివిజు లెల్ల మెచ్చ

లీలఁ బదునొకండు వేలేండ్లు ధర యేలెఁ
బరమ ధర్మ మహిమఁ బ్రజలు వొగడ. 133

## శ్రీరాముని ధర్మ పరిపాలనము

సీ. సక లౌషధక్రియా సంజీవ కరణిచేఁ
జెలఁగి రోగులను రక్షింపఁజాలు
బంధు రోన్నత శస్త్రసంధాన కరణిచేఁ
గుటి లారులను రంభ గూర్పఁ జాలు
సంత తోత్పాదన సౌవర్ణ కరణిచే
నర్థుల దారిద్ర్య మడఁపఁ జాలు
ననుదిన సంధాన మను శల్యకరణిచేఁ
బురుషార్థ నికరంబుఁ బ్రోవఁజాలు

తే. సిద్ధి విద్యానురాగ ప్రసిద్ధుఁ డైన
రాజ చంద్రుఁ డితం డని రాజు లెల్ల
సన్నుతింపఁగ విలసిల్లె జగతియందు
భాగ్య విస్తారి రామ భూపాల శౌరి. 134

సీ. కుటిలత నదులందుఁ గుంతలంబులయందు,
బొంకు జూదములందు బూతులందు,
లేమి వైరులయందు లేమల నడుమందు,
భంగ మంబుధులందుఁ బరులయందుఁ,
గోపంబు ఖలులందుఁ గ్రూర వర్తనులందు
వడఁకు పీణలయందు వ్యసనులందు,

బంధంబు రతులందుఁ బటు శిరోజములందు,
మోహంబు ధనమందు ముదితలందుఁ,

తే. చింత కవులందుఁ దపసుల చిత్తమందు,
వర్ణమిశితంబు చిత్తరువందు యవను
లందుననె, కాని యొందెడఁ జెందకుండ
లీల ధర యేలె రామ భూపాలవరుఁడు. 135

ఫ ల శ్రు తి

క. ఈ రామ చరిత మెప్పుడు
వారక విన్నట్టివారు వ్రాసినవారున్
గోరి పఠించినవారును
శ్రీరాముని కరుణ మేలు సెందుదు రెలమిన్. 136

ఆశ్వాసాంత పద్య గద్యములు

క. జలజాక్ష! భక్త వత్సల!
జలజాసన వినుత పాద జలజాత! సుధా
జలరాశి భవ్య మందిర
జలజాకర చారు హంస! జానకి నాథా! 137

మాలిని. కువలయ దళ నేత్రా! కోమల స్నిగ్ధ గాత్రా!
భవ ముఖ నుతిపాత్రా! భక్త వృక్షీ చైత్రా!

రవి శశి సమ ధామా ! రక్షి తాఘాంఘ్రి భామా !
కవి జన నుత నామా ! కావుమా మమ్ము రామా ! 138

## గద్యము

ఇది శ్రీ గౌరీశ్వర వర ప్రసాద లబ్ధ గురు జంగమార్చన వినోద
సూరి జన వినుత కవితా చమత్కా- రాతుకూరి కేసన సెట్టి
తనయ మొల్ల నామధేయ విరచితంబైన శ్రీ
రామాయణ మహా కావ్యంబునందు
యుద్ధ కాండము సర్వంబును
దృతీయాశ్వాసము.
సంపూర్ణము.




# మొల్లరామాయణం





త్య చరిత్రమున
ధుర కవయిత్రి
గు భ తి కంఠాభరణమున
గొండి సదృశ క మణి
య తీయని యగు రీతి
లు సొంపెత అందముగా
మనములు
రంచ విరచించిన
సువిఖ్యాత సరస కావ్యము
శ్రీకంఠ మల్లేశ్వర వరప్రసాదిత
సహజ కవితా సంశోభిత
ఆతుకూరి మొల్ల
రామాయణము

Revised Price Rs. 6-25










